




# ఎమెస్కో వచన రామాయణం

శతావధాని కోట వీరాంజనేయ శర్మ

# ఎమెస్కో వచన రామాయణం

## (ఏడవ సంపుటం)

రచన :

శతావధాని కోట వీరాంజనేయ శర్మ



195

యం. శేషాచలం అండ్ కంపెనీ

మచిలీపట్నం - సికింద్రాబాదు

EMESCO VACHANA RAMAYANAM - Vol. 7

*as retold by :*
SATAVADHANI KOTA VEERANJANEYA SARMA


*first edition :*
FEBRUARY 1981


*publishers :*
M. SESHACHALAM & Co.,
Machilipatnam - Secunderabad.

*cover design :*
BAPU

*printers :*
LEELA PRINTERS,
Secunderabad.




Price : Rs: 5—00

*distributors :*
M/s. ANDHRA PRADESH BOOK DISTRIBUTORS,
3237, Rashtrapathi Road, Secunderabad-500 003.



195

# ద్వాదశాదిత్యమండలంవలె ప్రకాశించే
# 12 సంపుటాల ఏమెస్కో వచన రామాయణ ప్రాశస్త్యం

ఏనాడు వాల్మీకి మహర్షి అపార తపశ్శక్తితో వేదాన్ని రామాయణాత్మకంగా ఆవిష్కరించాడో ఆ నాటినుండి అవిచ్ఛిన్నంగా రామోపాఖ్యానంతో జనావాసాలలో ఆ కల్పవృక్షం భారతాన్ని పుణ్యభూమిగా, కర్మభూమిగా చేసి దిగ్దిగంతాలకు ప్రాకింది. ఇంకా ప్రాకుతుంది. అందుకే ఒక కవి "రామసచ్చారిత్రము నెందరెన్ని గతులన్ వర్ణించినన్ గ్రాలదే" అని అన్నాడు. మేంకూడా ఆ పవిత్ర భావంతోనే ఈ మహాకార్యానికి పూనుకున్నాం. ఈ నూత్న ప్రయత్నంలో ఒక విలక్షణమైన మార్గం ప్రాకట్యం జరిగింది. వేదానికి వేదం ప్రమాణంలాగా వాల్మీకి రామాయణానికి వాల్మీకమే ప్రమాణంగా అనువాదంలోనే అపవాదులు పరాస్తం చేయబడినై. యథాతథంగా అనువదించినా స్వతంత్ర కావ్యంవలే చదువరులకు ఆనందం కలిగిస్తుంది. ఎన్నో గ్రంథ గ్రంథులున్నై. ఎన్నో పూర్వాపర విరుద్ధాలున్నట్లు పైకి కనుపిస్తాయి. వచ్చిన కథలే వస్తై. ఒకచోట శంకకు ఎక్కడో పరిహారం వుంటుంది. ఈ విషయాలన్నీ ఇందులో విశదీయబడినై. తైలధారవలె అవ్యాహతంగా రచనా స్రోతస్సు ప్రవహిస్తుంటే చవిటి నేలు, కేదారఖండాలు, నల్లని, ఎర్రని, రేగడ భూములు, నిస్సార నిరుపయోగ ప్రదేశాలు సస్యశ్యామలంగా మారి ఫలానుభవంతో ఇహపర సుఖాలు తమంత తామే కోరి వరించి వస్తై. ఈ రచనా విన్యాసం సరికొత్తది. పండిత పామరభేదం లేకుండా స్త్రీ శిశు విచక్షణ లేకుండా అందరికీ రామాయణ కల్పవృక్ష ఫలాలను అందిస్తుంది. ఏ అనుమానం వచ్చినా ఈ రామాయణం ఆ ఘట్టంలో చూస్తుంటే తెలుస్తుంది. ఇంతకు పూర్వం తెలియని ఎన్నో రహస్యాలు వెలికి తీయబడినై. ఉదాహరణకు దశరథుడు ముగ్గురు భార్యలకు పాయసం నాల్గు భాగాలెందుకు చేశాడు? వాలి వధ ఎందుకు ధర్మబద్ధమైంది? తార పతివ్రతగా ఎందుకు ఆరాధ్య అయింది? సీతా పరిత్యాగంలో రాముడు అన్యాయం చేశాడా? ఇంకా ఎన్నో ఎన్నో - ఈ బృహత్కార్యం ఎందుకు సంకల్పించామో చదివి చదువరులు సాక్షులు కండి.

—:o:—

స్వామి! భవత్కృపాప్రభావసంగతి ఆరవసంపుటంబును
భూమి భవార్త్రదేవ పదముల్ స్పృశియింపఁగనుంచినాను నే
ధాయుంచునూనముల్లుగను, పావని! ఏడవ సంపుటంబును
నాదుర పంచితాళి భవబంధహారంబుగ వ్రాయఁబూనుమా.

త్రాగివున్న హేతువుచే సిగ్గు విడిచి, వారిపట్ల తనకున్న చనవు కొద్దీ, అర్థయుక్తంగా, సాంత్వపూర్వకంగా వున్న మాటలతో, చల్లగా మెల్లగా, "స్వామీ! నిల్చున్నావేమి? ఆసనంపై అధివసించు. నీవు కోపంతో వచ్చినట్లు మీ అనుగ్రహపాత్రుడు అంగదుడు చెప్పగా విని వచ్చాను. పూజ్య భ్రాతలకు కిష్కింధలో కోపకారణం ఏముంటుంది? మీ ఆజ్ఞను తిరస్కరించినవారెవరిక్కడున్నారు? నీ రసవాదపుల దహించే వహ్నిలో మిడుతలుపడి చూడిన అయినట్లు మీకపకారం సలిపి మీ దాయిచి కోరిన నీమదెవ్వరిక్కడున్నారు? మా ప్రభువులు రామానుగ్రహపాత్రములే కదా?" అని ప్రశ్నించింది.

## తారతో సౌమిత్రి సుగ్రీవుడు సమయభంగం సలుపటం చెప్పుట

"ఏమి ధర్మహితైక భాషిణీ! ఏమంటున్నావు? నీవెందుకు వచ్చావో, అతడెందుకు రాలేదో నాకు తెలుసు. వంచకులైనవారు వంచకులంపట్ల ప్రయోగించిన క్షత్రియ వినయాస్త్రం అగతికులమైన మా మీద ఎందుకు ప్రయోగిస్తావు? కిష్కింధలోని వారంతా రామానుగ్రహపాత్రులైతే, నిర్నిమిత్తంగా రామునికాగ్రహం వచ్చినట్లేకదా? నీకు పల్లంపంక పాటుందని ఏమాత్రం బుద్ధివున్న వాడికైనా తెలుస్తుంది. అటువంటి వాడు ఇక్కడ వుండబట్టే ఆయన పంపాడు. నేను వచ్చాను. వచ్చి నన్ను కలిసినవాడులేడు. కారణం అడిగినవాడులేడు. నా రాకను నేనే తెలుపుకున్నాను. ఆ తెలపటం లోకం పాటుతోకాక విపరీతం కావటంతో భీతితో క్రోధుడు పారిపోయినె. నాలుదైనా, వాలి కొడుకు అయినందున అంగదుడు వచ్చి నా సందేశం కొనిపోయి నీ పతికి వినిపించాడు. అప్పటికి అతడు రాలేదు. మతిమంతుడైన హనుమంతుని ఆగ్రహంతో మత్తు కొంతవదలి మంత్రుల కూర్చి మంత్రాంగం మెలగబెట్టాడు. ఎంతకో పాపం. అయోధ్యా రత్నసింహాసనంలో, అనుచరులు, రాజాధిరాజులు, వసిష్ఠాదిమహామునులు కొలుపుతీరగా, అనుజులు చామరాలుకొని వీవగా లోక కల్యాణార్థం రాజ్యపాలనంచేస్తూ, అర్థులై వచ్చిన ఆర్తులను ఆదరిస్తూ, అసాధ్య కార్యసాధనకు ప్రార్థించే దేవతలను తృప్తిపరచే నా

అన్న, దిక్కులేనివాడై, దీనుడై, అర్థముల్లాగా, 'నీకు మేలు చేసేం కనుక మాకు మేలుచేయు' మని అడిగినట్లు అడిగించుకున్నవాడు ఇక్కడ వుండబట్టే వచ్చాను. నిన్నుపంపి ప్రాణరక్షణ చేసుకో చూస్తున్నాడా? నా అన్న నీ మగనివంటి నీచుడుకాడు. అపరాధియైనా ఆయన అనుగ్రహించే నన్ను పంపాడు. నేను మాటకారినికాను. చేతలవాడను. నీవుపోయి అతని పంపు. ప్రాణ భయంలేదని చెప్పు. రాజ్య తంత్రంలో పారం ముట్టిన మాతో చెలగాటం మానుమని చెప్పు. ఈ వానరనగరంలో అష్టాంగనవగినవారు ముగ్గురే వున్నారు. ఇప్పుడిద్దరే. ప్రతిభావంతుడూ, ప్రాజ్ఞుడూ అయిన వాలి మరణించాడు. బాలుడైన అంగదుడు ఒకడు. మహా మనీషి మారుతి ఒకడు. నీవు చెప్పిన మాటలు అతడే చెప్పవచ్చునుగా. అతని కింత భయమెందుకు? కామోద్రేకంలో కన్నుమిన్ను కానకున్నాడు.

పానాసక్తుడై పూనిన కార్యం పరిత్యజించాడు. అహంకారంతో అర్థ ధర్మ విధుల అనాదరించాడు. అగ్నిమిత్రుల కూర్చిన మానవు మాట తృణీకరించాడు. ఆనందానికిబదులు అన్నను చెనకి అనర్థం తెచ్చుకున్నాడు. అందరు వినంగా సీతాన్వేషణ చేయిస్తానని చెప్పాడుకదా? అన్న శరత్కాల ప్రారంభం సుమా అని గడువు పెట్టాడుకదా? ఆ విషయం నీకు తెలుసుకదా? ఇప్పుడు నాతో పలికిన శ్రీరంగనీతులు అతనితో నీవు పల్కలేకపోయావా? ప్రమత్తుడై ప్రాణంమీదికి తెచ్చుకుంటే పతిరక్షణార్థం వచ్చావు కాని అవసరం గుర్తించి అతణ్ణి హెచ్చరించావా? అతడెంత మధుపానమత్తుడో, వ్యసనలంపటచిత్తుడో, కామశరవిద్ధుడో, నీవూ అంతే అయినావు. ఉపకారికి ప్రత్యుపకారం చేయకపోతే ధర్మహాని వస్తుంది. ధర్మం చెడగానే కామం వెర్రితలలు వేస్తుంది. అర్థం వ్యర్థమవుతుంది. అర్థకామవరిష్ఠుడూ, సత్యధర్మపరాయణుడూ, అయిన సఖుని వంచించి ధర్మహాని చేశాడు. తక్కిన రెండూ ఇక మీకు దక్కవు. ఈ మాటలు నేనన్నవి కావు. నన్ను పంపుతూ అన్న అన్నమాటలు. అర్థంచేసుకో. ఇప్పటికీ అన్న మీ క్షేమంకోరే వున్నాడు. కార్యకారిణివై వచ్చావు. నీ మగడు అపరాధంచేసి, అది సమర్థించటానికి నిన్ను పంపి, అనవసరంగా ఆడుదానితో అధిక ప్రసంగంచేసే దౌర్భాగ్యయోగం నా తలపెట్టాడు.

అతడు ఇకరాడు. వచ్చిన నీవే ఆలోచించి మా అన్నను ఏం చేయమంటావో చెప్పు. వృథాకాలయాపనం చేయవద్దు. నేనిక్కడ నిలువలేను. జనక నియమం నాకు లేకపోయినా, అన్న పోనిచోటికి నేను ఇంత వరకూ పోలేదు. నేటికి ఈ అమిత్ర పుత్రుని మిత్రత్వ కారణంగా అది కూడా జరిగింది. నాకై అన్న ఒడలెల్ల కన్నులుగా చూస్తుంటాడు. ఆశతోనో, నిరాశతోనో వెంటనే ప్రత్యుత్తరమిచ్చి నన్ను పంపించు." అని ఆగిపోయాడు.

## తార సౌమిత్రిని సమాధానపరచుట

పురుషాకారం పూర్ణ స్వరూపమైన రామచంద్రుని మూర్తి సౌమిత్రి మాటల్లో తార సాక్షాత్కరింపచేసుకుంది. అర్ధాంగినిబాసి ఆయన పొందుతున్న బాధ అర్థంచేసుకుంది. లక్ష్మణునిలో అన్నగానున్న రాముడెవడో, తమ్ముడుగా భావించిన రాముని హృదయంలో లక్ష్మణుడెవడో అవగతం చేసుకుంది. పని పక్వంచెడిన స్థితిలో వుందని గ్రహించింది. రామచంద్రుని కార్యంలో వానరపతి కేవలం నిమిత్తమాత్రుడేనని తెలుసుకుంది. మైత్రీభంగం కాకుండా, ప్రమాదంరాకుండా, ఉభయపక్ష క్షేమం గూర్చి యోచించింది. రాజనీతిలో రాణించిన తార ఆణిముత్యాలవంటి అశ్రువులు రాలుస్తూ "రామానుజా! నీవాడిన మాటల్లో లేశం కల్పితంకాని, కృత్రిమంకాని, ఉత్కృష్టకాని, ఆరోపణంకాని, అసత్యంకాని లేదు. అంతా యథార్థం. అన్ని దోషాలకు పరిహారం అంజలి. అది మీకు పశ్చాత్తాపాగ్నిలో పరిశుద్ధనై సమర్పిస్తున్నాను. కోపం ఉపసంహరించు. కోపకాలం కాదిది. ఆత్మబంధువులమేకాని అననుకూలవర్తులంకాము. మీ పనిపట్ల శ్రద్ధాభక్తులు కలిగిన మిత్రుని ప్రమాదపాటు క్షమించండి. బలహీనతలో సామాన్యులు సల్పే దోషాలను బలవంతులైన సజ్జనులు క్షమిస్తారు కాని కోపగించుకుంటారా? నీవు శాంతి సత్యాలకు నిలయమవు. అల్ప ప్రాణులపై ఆగ్రహించవద్దు నాయనా! నీవన్నమాట నూటికి నూరు శాతం సత్యం. మీ అన్న కోపం, శక్తి ఎరుగుదును. కాలం కడచిపోవటం ఎరుగుదును. మీరు చేసినమేలెరుగుదును. మిత్రుడు చేయవలసిన పని ఎరుగుదును. రామబలంతో కలిగే ఉపకారం ఎరుగుదును. వానరపతి వనితాలోలుడై ఒడలు మరచిన సంగతి ఎరుగుదును. నిగ్రహ-

మూర్తివైన నీవు, "స్వతంత్ర పాలకులు, కామాసక్తులు, మధుపాన మత్తుల చిత్తం దేశకాల పాత్రాల దిక్కు చూడదు" అని తెలియదు. మహర్షులే ఇంద్రియబలాకృష్టులై కాని కార్యాలెన్నో కావించారు. నన్ను గూర్చి నీవన్నది నిజం. ఇకపరం లజ్జాహీనులమైనాం. చపల స్వభావం గల శాఖా మృగాలు నియతితప్పి ప్రవర్తించటం వింత కాదుకదా? మోహం ముమ్మరమై, మదిరాపానం మత్తు అధికమై, స్మృతిహీనతలో నడుపు నడచిందే కాని బుద్ధిపూర్వకంగా సమయభంగం సల్పలేదు" అని సమయోచిత వాక్కులతో శాంతపరచి ఇంకా ఇట్లన్నది. "రఘువంశ దీపకా! సుజనుల రత్నమా! రామానుజా! మీ కార్యం కోసం పూర్వమే యత్నం చేశాడు. సతీసంగమసంలోలుడైనా, సలుపవలసినపని చేయటం మరచిపోలేదు. బలవంతులు, కామరూపులు, యువులు కోటానుకోట్లు, పర్వతవాసులూ, బిలముఖులూ, సలిలాశయచరులూ, కార్యసాధన కళా ప్రవీణులూ కిష్కింధకు చేరుకుంటున్నారు. అంతఃపురంలోపల అన్య దారలుంటారని మూలంగావచ్చి నిల్చున్నావు. సాశంకతో శీలపరీక్షణం చేసుకున్నావు. నీవు మేం అన్యులమెట్లవుతాం. మిత్రసమూహం. బంధువులం. మన్నించిచూస్తే పాపంరాదు. అన్నింతభావుడవైన నీవు అనరాదు. లోప లికిపోదాం" అని ఆహ్వానించింది. "అమ్మా! నీవు కొంతనిజం చెప్పావు. ఆ నిజంకూడ నీ మనశ్శ్రేయస్సుకోరే. అంగదుడు కొంత చెప్పాడు. అంతా నేనవగతం చేసుకున్నాను. కపులకోసం వా ప్రయత్నించటం కాదు మంత్రుల హెచ్చరికలో మత్తులో చేసినదికాని, మనస్సుతో చేసినపని కాదు. మనసుంచిచేస్తే మాకోసం ప్రయత్నించేవాడు. తప్పుచేయటం తప్పు. అది సమర్థించుకోవటం అంతకన్న తప్పు. అయినా ఆమోదిస్తాను. లజ్జపడి అర్థించావు. నాచే జరుగకూడని పనులన్నీ జరిపించారు. ఆ పనికూడా ముగించిపోదాం. పద" అంటూ, మెల్లగా పెదవులు నొక్కుకుంటూ ఆమెను అనుసరించాడు సౌమిత్రి.

## సుగ్రీవుణ్ణిచూసి సౌమిత్రి నిష్ఠురంగా పలుకుట

రామానుజునియందు తన రాజనీతి పరాజయంపొందటంలో తారకు తలతిరిగింది. కాగుతున్న పెనంలోపడ్డ నీటిబొట్టులాగా ఆమె ఆలోచన అంతా అదృశ్యం అయింది. వచ్చినప్పుడు వదనంలోవున్న వెలుగుమాసింది.

అవమానభారంతో అంతిపురంలోనికి నడిచింది. పగగొన్న వ్యక్తి కనుపించినప్పుడు కాటువేసేనిమిత్తం భుజంగంపోయినట్లు ఆమె వెంటపోయి, అగచరపతిని చూచి తెంపుమిగులు వెనుతగ్గి, ఆభరణోజ్జ్వలాంగుడై, దుర్జయుడై, ప్రసన్నముఖుడై, దివ్యమాంబరుడై, దివ్యమాల్యుడై, మృదుతల్పగతుడై, సతీసమావృతుడైవున్న వానరేశ్వరుణ్ణి చూసి, కన్నులుచేపురింపు, కనలున అసహ్యంగా ఒక్కసారిచూచి సంయమసిగ్గుతో తలప్రక్కకుత్రిప్పుకున్నాడు. తన్నుచూచి తలత్రిప్పినట్టున్న ప్రళయకాలరుద్రునిపోలిన లక్ష్మణునికని కనులుమూసుకున్నాడు. అప్రతిహతతేజుడు, ఆగ్రహావిష్టుడు, పురుషసింహుడు, రోష వహ్నిప్రభాదీప్తుడు, మూసిన కన్నుల్లో కనుపించగానే, వ్యథితేంద్రియుడై, హరిధ్వజంలాగా, హేమాసనంనుంచి ఉలపైమూకాడు. చంద్రుని వెంటనంటే నక్షత్రాలవలె, మహాసమేతలైన అంగనామణులు తమతమ ఆసనాలపైనుంచి క్రిందికి దిగారు. అత్యంతమారంలో చేతులుజోడించి వడకుతూ, తడి ఆరి, నోటమాటరాక, గ్రుడ్లప్పగించి నిల్చున్న సుగ్రీవుణ్ణి లక్షించి, “మిత్రప్రసాదిత రాజ్యాధికారీ! కృతఘ్న చక్రవర్తీ! నేనెందుకు వచ్చానో నీకు ఇంతవరకుండే తెలుసు. వచ్చిన పనీ, నీకు తెలిసినపనీ వదలి నామాటలు నాల్గు కనుపించావు కనుక వినిపించి పోతాను. సత్యవాది, కృతజ్ఞుడు, విజితేంద్రియుడు, కరుణాహృదయుడు, అభిజన సంతోష కార్యకారి అయిన రాజే లోకంలో పూజ్యుడు. మేలు చేసినవారికి మేలు చేస్తానని చెప్పి, ఇచ్చిన మాటను విఫలంచేసే రాజుకంటే పాపి ఎవడో చెప్పు? ఆవులవిషయంలో అబద్ధమాడితే నూరు ఆవుల చంపిన పాపం వస్తుంది. ఆవుల్ల అబద్ధం చెబితే, వేయావుల చంపిన పాపం వస్తుంది. మార్గంతప్పి మిత్రునియడల అనృతం ఆడితే తననేకాక తన వారసులున్న వారిని కూడా చంపుతుంది. ఉపకారం చేసిన వారియెల్ల అపకారయుక్తమైన ఉదాసీనం వహించిన వారికి వధమే విధి విధించిన శిక్ష, స్వాయంభువు కృతఘ్నుణ్ణి క్షమించరాదని శాసించిన సంగతి నీకు తెలియదు కాని, కృతజ్ఞులకు తెలుసు. బ్రాహ్మణుని చంపినా, కల్లు త్రాగినా, దొంగి లించినా, గురుదార గూడినా, వ్రతం చెడినా, ప్రాయశ్చిత్తం చెప్ప బడింది కాని, కృతఘ్నునికి నిష్కృతి చెప్పబడలేదు. మా అన్నచే మేలు

ముందు పొంది, మేలుచేస్తానని మాటఇచ్చి తప్పినందుకు, మానహీనుడవూ, కుటిలుడవూ, అనార్యుడవూ, కల్లరివి నీవు. నీవు కృతమతివైతే ఇంతవరకూ మా వదినను అన్వేషించుటకి ఎందుకు పూనుకోలేదు? తృణచ్ఛన్న కూపానివనీ, మండూకపుత పన్నగమనీ, గోముఖవ్యాఘ్రమనీ అమాయకుడైన నా అన్న అర్థం చేసుకోలేక మోసపోయాడు. ఏ వరి, దైన్యంతో ఏడ్చే నిన్నుగని జాలినంది, భక్తి వినిర్జితత్రిశూలి, వాలిని వధించి, పాపకర్ముడా! సంప్రాపిత రాష్ట్రుని చేసిన రఘుపతి మాట పాటించని నిన్ను నీ అన్నను చేరబంపరాదు. వాలిపోయిన దారి ఇంకా మూతపడలేదు. నీతో మాయింటి తలచుకుంటే ఆ సంగతి చెప్పు. కాదా? సముపాలనంచేసి క్షమాభిక్ష కోరుకో. మేమై నిన్ను శిక్షింప రాలేదు. కబంధుని హితవచనం నమ్మి వచ్చాం. పావని పల్కులు మెచ్చాం. నీకు మాట ఇచ్చాం. ఇక నీ మైత్రిని త్రోసి పుచ్చాం. నిన్నిక త్రాగుడు రక్షిస్తుందో, తార రక్షిస్తుందో తేల్చుకో. నేను పోతున్నాను. జరిగిన సంగతి ఆ ధర్మమూర్తితో, జాయావియోగ క్లేశఖిన్నునితో చెపుతాను. ఆయన చిత్తం, నీ అదృష్టం" అని వెనుదిరిగి చరచర రెండడుగులు వేశాడు.

## తార సౌమిత్రిని శాంతపరచ యత్నించుట

కోపరస మనోజ్ఞ తనుధారియైన సౌమిత్రి గమనగతి చూచి తార నిండినఖేదంలో గుండెదడ, రొప్పుపాటులో అభిముఖియై అడ్డంగా నిల్చింది. "రామానుజా! ఆగ్రహం మాని నా మాటలు శాంతంతో విను. ఇది మిత్ర ధర్మంకాదు. సౌమ్యభావుడవైన నీకిది తగదు. మీ సోదరుని అవమానించి మృత్యువును కోరి తెచ్చుకునే అల్పబుద్ధులు ఇక్కడ ఎవరూ లేరు. నీ మిత్రుడు అకృతజ్ఞుడుకాడు. క్రూరుడూ, కుటిలుడూకాడు. హతుడు కాడు. అసత్యవాదికాడు. అన్నిటా శ్లాఘ్యమైన మహారణంలో రామానుగ్రహం వేత నిష్కంటక రాజ్యాన్ని, సమృద్ధ సంపదలనూ, రుమనూ భోగభాగ్యాలను పొందాడు. మిమ్మల స్మరించని రోజు లేదు. మీ మేలు మెచ్చని కాలం లేదు. మీ మేలు మరవలేదు. బహుకాలం దుఃఖభాజనుడయిన రవిసూనుడు మీ అనుగ్రహంతో అపారసుఖాలుపొంది గడుపరాదలేదు. కామవశుడంటూ గాధేయుడు ఘృతాచీ బాహుబంధంలో చిక్కి పదేండ్లకాలం పదినిముసాలుగా భావించలేదా?

చండప్రచండ తపోవిభవుడయిన విశ్వామిత్ర మహర్షియంతటివాడే స్మర
పరతంత్రుడయి, స్వీయనియమం, కాలగమనం గమనింపకపోతే ప్రాకృత
జనుల సంగతి ప్రత్యేకించిపలుకవలసిన పనిలేదుకదా? దాశరథీ! దేహ
ధర్మం దేహికి విడరాని బంధం. దానిపై మనసుపెట్టనేరాడు. పెడితేదాని
ఇచ్ఛాధీనంగానే నడిపిస్తుంది కాని స్వేచ్ఛలో వర్తించడు. చేసిందిదోషమే!
నీవువాన్ని క్షమించు. మీరు శరణాగతరక్షణ దీక్షాంకితులు. అందుకు
వేరే నిదర్శనం ఎందుకు? నీమిత్రుడు రవిపుత్రుడే సాక్షి. నీరుపోసి
మీరు పెంచినమొక్కను కొడవలితోనసే కోపంతోకోయవద్దు. వానరపతి
క్షమార్హుడేకాని శిక్షార్హుడుకాడు. అజ్ఞానంలో చేసిన అపరాధం సునిశిత మేధాసం
పన్నుడవైన నీవుక్షమించాలికాని, తొందరపాటు చెందవచ్చునా? ఆతనికి
మేంకాని, రాజ్యంకాని లోకసామాన్య ప్రీతిపాత్రాలే. రామకార్యం కంటె
అధికం మాత్రంకాదు. అవసరమని నీ అగ్రజుడు భావిస్తే వదలటానికి
వానరనాథుడు సర్వదా సంసిద్ధుడే. ఇంకొకటి చెప్తా విను.

## సుగ్రీవుడు కపులకు వార్తపంపిన సంగతిసౌమిత్రికి తార చెప్పుట

రోహిణితో చంద్రునివలె ఆహవంలో రావణుని జయించి
రామునితో సీతను రవిపుత్రుడు కూడుస్తాడు. శంకమాను. లంకానగరం
శత్రుప్రవేశ దుర్లభమైంది. నూరువేలకోట్లు, నూరువేలకోట్ల అయుతంబులు
అసురవరులు లంకారక్షణలో నియుక్తులైవున్నారు. వాళ్ళను చంపక
దశగ్రీవుని చంపటం సాధ్యంకాదు. తోడులేక వానరపతి ఒక్కడివేజరిగే
పనేనా? అపారబలసత్వుడు. అఖండ తపస్సంపన్నుడు. అద్భుత శివపూజా
దురంధరుడు. త్రైలోక్యనిర్జితుడు. ఈ సంగతి ఇంద్రపుత్రుడు నాకు
వినిపించాడు. కనుకనే వానరబలాన్ని రప్పించటానికి వార్త పంపాడు.
ఆయనపెట్టిన గడువు నేటితో ముగుస్తుంది. కొందరు వచ్చారు. కొందరు
వస్తున్నట్లు వార్తలందినై. అందరూ ఈ రాత్రికి సమావేశమవుతారు.
వాళ్ళను వెంటగొని రామదర్శనం చేయవచ్చుని ఆగాడు. అంతేకాని
మరపుతోకాదు. కొలదికాలం నీవిక్కడనిలిస్తే కోటానుకోటి కోట్ల
క్రోతిమూక నిన్నుసేవిస్తూ నిలుచుంటుంది. ఆడినమాట అబద్ధమా

నిజమో ఆగి నీవే చూడు. రామానుజా! శాంతించు. నీ జ్వాలాసంతుల్య నేత్రాలుచూచి కపిరాజు. కొంతలు బెదిరిపోయాడు. మాకు పూర్వంవున్న శంకమళ్ళీ పొటమరిస్తోంది. నీ మిత్రుణ్ణి చల్లనిచూపుల చేయ్యి" అంటూ వీసంగా వేడింది. "వనచరనాథమహిషీ! నీవన్నదంతా వాస్తవం కావచ్చు. నీవున్నావు కోపానికి అనుకూలమైనట్లు శాంతానికి అనుకూలం నీ బుద్ధి కాదని అపేక్షించావు. గుర్తుందా? మరి? ఇప్పుడు నీ బుద్ధో! భర్త ప్రాణం కాపాడటంకోసం పడినంత కాపత్రయం నా అన్నపట్ల పడదేం? ఏమో కల్లబొల్లి మాటలల్లి జరగబోయేది జరిగినట్లుగా చిత్రిస్తే సౌమిత్రి శాంతుడవుతాడా? తెలిసితేనో, తెలియకనో, ఆప్తుని ఒత్తిడితోనో ఘుణాక్షర న్యాయంగా జరిగింది. దానికి చిలవలూ, పలవలూ కల్పించి, అనుతనం అందులో ప్రసన్నరించి, అక్షరాలూ, పదాలూ చదువుతున్నావా? వ్రాసిన కావ్యంలో లేని అర్థాలు కవి బలవంతంగా వ్యాఖ్యానించి బుద్ధి మందుల బుర్రలు చెదగొట్టినట్లు, అనుకొందనీ పొరకపొందనీ మాటలతో మభ్యపెట్టుతున్నావా? నేనడిగే మాటలకు సూటిగా సమాధానం చెప్పగలవా? చేతనయితే చెప్పు.

అతి సంసారం అధమలక్షణం అవునా? కాదా? బాధ్యతగలవాడు బాధ్యతారాహిత్యంగా ప్రవర్తించవచ్చా? ఆప్తబాంధవులు హితంచెపితే త్రోసివేయటం ధర్మమా? నాఅన్న కార్యార్థం దేశదేశాలకు వార్తలు పంపగలవాడు ప్రక్కనే పదివారాల దూరంలోవున్న వారికి వార్త పంపే తెలివి ఎందుకు తెచ్చుకోలేడు? నేను వచ్చి ఎదుట నిలిచినా ఇంతవరకు నోరు విప్పి నన్ను పలకరించలేదేం? రాత్రి తపో ఒపో చేసిన పనిచెప్పక ఆయనతో అధికప్రసంగం చేయించవచ్చా? అరిందినవాడు, దానమిచ్చిన వాడు, పురస్కారంపొందినవాడు ఆతడా? నీవా? అతడు నీచెప్పు చేతలలోని వాడా? అయితే ఎప్పుడయినాడు? మాటెప్పుడు మాట ఇవ్వాడు? అటువంటి జనకుల సంబాహుడు ఇంత దుష్కార్యంచేస్తానని మాటఇవ్వవచ్చా? అందులో సకల లోకాభిరాముడు, సత్యసంధుడు, అమాయకుడు, ఉపకారి అయిన నా అన్నగారా? తల్లీ! తారాదేవీ! నీ ప్రేమభర్త ప్రాణాలు ఇంతవరకు మీచే అవమానించబడిన అభాగ్యుని అన్నే రక్షించాడు. దానికై నీ ప్రార్థనలో పనిలేదు. ముందు జరగవలసింది ఆయనే నిర్ణయిస్తాడు. నేనిక

నిమిత్తమాత్రుడను. ఇంద్రజాలికుడు జన సామాన్యాన్ని భ్రమగొల్పగలడు కాని, మరో ఇంద్రజాలికుణ్ణి మెప్పించలేడు. ఇప్పటికే వృథాగా కాల యాపన జరిగింది. ఆతురతతో అన్న ఎదురు చూస్తుంటాడు. మా పని చక్కబెట్టుకోలేని వాళ్ళంకాం అని మీకు తెలుసు. నీవుచెప్పే సమాధానం ఏదైనా వుంటే అన్న సన్నిధిలో చెప్పు. ఆయనకున్న శాంతం నాకు లేదు. తప్పకుంటే నాదారిని నేనుపోతాను" అని నిష్కర్షగా పలికి సౌమిత్రి ద్వారంవైపు నడిచాడు. అంతవరకు కళకళలాడుతున్న భవనం కళాహీనమయింది.

## సుగ్రీవుడు లక్ష్మణుని తృప్తిపరచుట

తార నిరుత్తర అయింది. సభికులను ముచ్చెమటలు పోసినై. వచ్చినవాడెవడో, తానెవరో, తానెవరో తలపునపాలింది. తాను చేసింది తప్పని తెలిసింది. సామంసాగలేదు. దానం పనిచేయదు. భేదం అసాధ్యం. దండం తలకుమించినపని. కాంచన కలితచిత్ర మాల్యాంబరాలుత్యజించి, మదం మసిచేసి, మత్తు మాయంకావించి సౌమిత్రి చరణాలపై సాగిల పడ్డాడు. అపరాధిని. క్షమించుమని వేడుకున్నాడు. అపహృతమైన రాజ్య శ్రీలు మీరు ప్రసాదించినవే అని మొరపెట్టుకున్నాడు. ఆ అతిలోక పరాక్రమవంతునకు; ఆ ఆదర్శకార్యాచరణునకు, ఆ దయా పాథోధికి, ఆ దివ్యాస్త్ర విద్యా వేత్తలను ప్రతికారంచేసి ఎవరు బ్రదుకుతాడు? నామిత్రుడు అనాయాసంగా అవనిజను పొందుతాడు. రావణుడయిన రావణుడు ఆయన బాణాగ్నిలో ఆహుతి అవుతాడు. అందుకు అవంతైనా శంకించ పనిలేదు. అగ్నికి వాయువువలె అనుసరించి నే వున్నాను. నేనుచేసే సాయమెంత? నేనెంత? కేవలనిమిత్తమాత్రుణ్ణి. ఆయన చేయబోయే దశకంధరకంఠదళి పాటన యజ్ఞంలో ఒక సామాన్య పరిచారకునిగా గ్రహించి నా జన్మ ధన్యం చేయి. ధరణీరుహ సప్తకాన్ని ఏక శరపాతంతో దారితం చేసిన మహాబలునకు వీరకోటి తేరిచూడరాని విక్రమశాలినివాలిని వధించినకోదండ ధారికి నేసాయం ఎందుకు? ధనుష్టంకారమాత్ర కామితార్థ గ్రహణునకు కోతి సాయం కావలెనా? మిత్రునిగా స్వీకరించాడు కనుక నాకాగౌరవ ప్రతిష్ఠలు కట్టిపెట్టతలచి నన్ను పంపాడు కాని శక్తిలేమికాదు. ఆయన వాంఛాంబుధిలో నేనొక బిందువునవుతాను. పాపపరిహారం చేసుకుంటాను.

"సౌమిత్రీ, నీవూ నాకొకటే" అని అన్న అనురాగ సముద్రుని వాక్యంలో తలతో పాటూ, నా అవజ్ఞతా పంకిలం క్షాళనం చేసుకుంటా. సోదరా! మానవుడయినాక తప్పుచేయని ప్రాణి ఈ లోకంలో లేదు. స్నేహ కాతరంగానో, విశ్వాసం చేతనో, జాతిలక్షణం వల్లనో భవద్దాసుడు ఉండుకంత తప్పిదం చేస్తే క్షంతవ్యుడవు కాడు కాని శిక్షార్హుడవు కావా? నీవన్నవి వినే వారికి పరుషవాక్యాలే కాని, నాకవి అమృతవాక్కులు. నాలోని బలహీనత నశింపచేసి కర్తవ్య నిష్ఠ బోధించినై. యమదండదండనం తప్పించినై. ఇప్పుడు నా హృదయం ప్రేమ కడిగిన ముత్తెంవలెనుండి మిత్రుని దివ్య మంగళ విగ్రహం దర్శిస్తూంది. నాకేమని నా స్వామి రామప్రభువు ఆదేశం పంపించాడు? ఈ విశ్వంభరకు ఆయన అధిపతి. అల్పమైన ఈ కిష్కింధలో ఆయన వాంఛించిందేమిటి? ఆయన అర్థించటం, నేను తీర్చటమా? పాపం శాంతించుగాక. ఆజ్ఞానువర్తి రవిపుత్రుడు. ఆయనను సంతృప్తి పరచే ఐహికమైన పదార్థం నావద్ద లేదు. ఆ కృపాంభో రాశిచరణసీమలో ఆత్మార్పణం చేస్తాను." అని సముద్రం తుపానులో పొంగినట్లు పశ్చాత్తాపంతో పవిత్రమైన హృదయం పొంగగా పలికాడు. హనుమదాదుల హృదయం ఆనందసాగరంలో ఓలలాడింది.

## లక్ష్మణుడు సుగ్రీవుని ప్రశంసించుట

మతాబాలో నుంచి వెలుగులు చిమ్ముతూ మహిమీదపడే అల్ప భాగాలవలె, సౌమిత్రి నేత్రాంచలాల్లోనుంచి ఆనందాశ్రువులు చిందినై. అన్న గుణగణాల ప్రశంసతో ఆగ్రహం అంతరితమైంది. అంతః పారిశుద్ధ్యంతో, పవిత్రదాసభావంతో, కర్తవ్యదీక్షతో, కాంతులు చిమ్ముతూ ప్రకాశిస్తున్న సుగ్రీవుణ్ణి ప్రియమార సౌమిత్రి ఆలింగనంచేసుకున్నాడు. అగ్రజునికీ, ఆతనికీ అభేదాన్ని భావించుకున్నాడు. "పూజ్యుడా! నిజంగా నీవు ధన్యుడవు. నీ మిత్రుడు రఘువంశభూషణుడు ఎంత నేర్పరియో చూచావా? తప్పు చేసిన నీ అన్నను వధించినట్లే, నా వాగ్బాణంతో నీలోని అహంకారాన్ని వధించాడు. అధర్మ వ్యవసాయాన్ని ఆయన సహించ లేడు సుమా. నీవిప్పుడు పునర్జీవితుడయినావు. గ్రహముక్త రవి బింబం వలె నీవు సహజ ప్రకాశుడవైనావు. వినయవంతుడవు, వివేకివి నీవు అండగా ఉండటంతో సనాథుడయినాడు అన్న. నీ ఆర్జవం, నీ ప్రభావం

నీ విశ్వాసం చూస్తే, వాలి లేనిలోపం వనచరలోకానికి తీరింది. ఇక నీ సాయంతో రావణుని రణరంగంలో రామచంద్రుడు నిర్జిస్తాడు. సహృదయులై ఆత్మదోషం అంగీకరించగల వినయసంపన్నులైనవారు నా అగ్రజుడూ నీవూ తప్ప నేనింకెవరినీ చూడలేను. శౌర్య బలపరాక్రమాల్లో నా అన్నకు సముడైన నీ చెలిమి దైవతంత్రంతో సమకూడింది. బంగారానికి పరిమళమబ్బింది. వహ్నికి వాయువు తోడయినట్లయింది. శూలికి కైలాసవాసమైనట్లమరింది. వర్షం గతించి శరత్తువచ్చినట్లు చెడుకాలంపోయి మంచికాలం మాకు ఆసన్నమైంది. వచ్చినందుకు కృతార్థుడనైనాను. ద్విగుణీకృతోత్సాహంతో, సోదర ద్వితీయులమై అన్న సన్నిధానానికి పోదాంపద. అన్న ఆగ్రహం నన్నిట్లాడించింది. అన్యథా తలంపవద్దు. ఏకాంతవాసంలో ఎంత చింతామగ్నుడయి అన్న వున్నాడో, మనంపోయి ఊరటకల్పించుదాం" అని సౌమిత్రి సంతోష ప్రసంగం సలిపాడు.

## మళ్ళీ దూతలతో కపులకు వార్తపంపమని హనుమతో సుగ్రీవుడు చెప్పుట

గ్రీష్మ భీష్మానికి తప్తమై వసివాళ్ళు వాడిన పైరులకు వర్షోదకం వలె సౌమిత్రి పల్కిన సరస వచనాలు ఉపకుతున్న వనచర లోకానికి అమృతాస్వాదనమైంది. మలయమారుతం వీచి అలరించింది. తారారుమాంగదుల సంతోషం పారంముట్టింది. అమాత్యులకు ఆనందం వెల్లి విరిసింది. హనుమ భక్తిపారవశ్యంలో మునకవేస్తున్నాడు. ఆహా! దైవలీల దురవగాహం. క్షణంలో ప్రమాదం, మరుక్షణంలో ప్రమోదం! ఏది ఎందుకు జరుగుతున్నదో తెలియదు. కీడు శంకించిన కిష్కింధావాసులు సమ్మోదసముద్ర వీచీ విహారం చేస్తున్నారు. హతాశుడయి, ఆగ్రహోదగ్రుడయి అరుగబోతున్న సౌమిత్రి కార్యసిద్ధికలవాడయినాడు. అసువులు అరచేతనుంచుకున్న అంబుజాప్త పుత్రుడు భక్తశ్రేష్ఠులలో ప్రథముడయినాడు. నలుగురిలో నిలవపెట్టి నిరుత్తర చేసినందుకు సిగ్గుతో కుంచించుకున్న తారలో మాయాయవనిక ఎత్తబడి రామలక్ష్మణమూర్తులు రంగస్థలం ప్రవేశించేశాయి. సూర్యసుతుడు చేయికట్టుకుని ఆజ్ఞఏమన్నట్టు

శిరంవంచి నిల్చాడు. హనుమంతుడు అంజలిబంధంతో, పూర్ణనిమీలిత నేత్రాలతో రామచరణ పీఠికపై మోకరించివున్నాడు. అంగదుడు రాముని పాణిపల్లవ శిరఃస్పర్శకు ప్రాధేయుడైనాడు. ఏకాంతవాసుడయిన రాముడు అక్కడ ఏలావున్నాడో. అవి సజ్జనులకు సుఖకాలం. దుర్జనులకు అసుఖ కాలం.

ప్లవగ సమ్రాట్టు వాయుసుతునివంక పరికించాడు. ఒడలుమరచి ధ్యాననిష్ఠుడయి యున్నాడు. "ఆత్మప్రియా! హనుమా!" అని పిలిచాడు. సమాధి చాలించి స్వామి సమీపవర్తియైనాడు. "జానకీమాత అన్వేషణకూ, రావణ సంహారానికీ సంకల్పం చేశాను. హిమవంతం, మహేంద్ర వింధ్యాలు, కైలాసమందర శైలాలు, తరుణార్క కాంతులతో సాగరగర్భంలో వున్న పర్వతాలు, పశ్చిమాశాద్రులు, జలజాప్త నిలయం, పద్మతాళవనం, అంజననగం, సర్వపర్వశ్రేష్ఠమైన స్వర్ణగిరి, మనశ్శిల, మేరువు, ధూమ్రగిరి, మహోదయం, మొదలైన పర్వతవాసుల కాననములు, ఆశ్రమములు, నదీనదముల వసించే వారిని. శేషభూమిలో సంచరించేవారిని, భీమబలులూ, మైదేయపాయులూ, దుర్వార మహాజవులూ, కామరూపులు, కార్యసాధనపటులైన కపిపుంగవుల, సామ దానభేద దండోపాయాలతో సత్వరం రమ్మని వార్తలు పంపించు. పూర్వం దూతల పంపాం. అయినా మళ్ళీ చండవేగులైన వారిని పంపించు. కామాసక్తులూ, సోమరులూ, దీర్ఘసూత్రులూ, అయిన కపులకు ముందుగా కబురుపెట్టు. ఆజ్ఞాపత్రంలో ఎవరు సుగ్రీవాజ్ఞ ధిక్కరిస్తాడో వాడికి బ్రతుకుబత్తెం పట్టిపోతుందని లిఖించు. కావలసిన గడువు పది దినాలు మాత్రమే. నూర్లు, వేలు, కోట్లుగా వనిముఖులను, ఆకాశయానంచేసే వాళ్ళనేకాక, దావులు తెలిసిన తరుచరులను కూడా పంపు. గడచినకాలం కలిసిరావాలి. కాలయాపనం ఇకకాకూడదు." అని ఆదేశించాడు. ఆ మాటలువిని హనుమ ఇంతవాడంత వాడయ్యాడు. తత్క్షణం రాజశాసనం ప్రకటించబడింది. వార్తాపత్రికలు లిఖించబడినై. దూతలపేర్లు ప్రకటించబడినై. పతాకాలుగాలిలో రెపరెపలాడినై. మంగళతూర్యారావాలు మ్రోగినై. కిష్కింధ కార్యకర్తల సంచలనంతో గ్రక్కదలి పోయింది.

# వానరసేనలు దక్షిణంవైపు వచ్చుట

స్వర్గంలో చింతామణీ పీఠంపై వజ్రపాణి కొలువు తీరాడు. సచివులు, దండనాథులు, సేనాపతులు నియమితాసనాలలో నియుక్తులైనారు. గురుదేవుడు గురువు ప్రత్యేకాసనంమీద ప్రథమ ప్రక్క ఉపవిష్టుడయినాడు. మహర్షులు ఉన్నతపీఠాలను కైకొన్నారు. అప్సరసలు లయగతికై కాచియున్నారు. అష్టదిక్పాలకులు ఆహూతులై వచ్చి ఆసన స్వీకారం చేశారు. నారదతుంబురులు వీణాధరులై మహతీ మండలమున ఆసీనులైనారు. దేవేంద్రుడు గంటమ్రోగించాడు. నారదుడు లేచి సభవంక చూచి, వినయంతో "సభాయైనమః" అని అభివాదంచేసి "ఆహూతులైన సభాసదులారా! నేటి సమావేశం ఎందుకో స్పష్టంగా వివరిస్తాను. శ్రీ మహావిష్ణువు మాయామానుష విగ్రహుడయిన రాముడుగా అవతరించిన సంగతి అందరకు విదితమే. ప్రతిపక్షులైన దానవులకు నాయకుడయి దేవలోకాన్ని అల్లకల్లోలం చేశాడు. దిక్పాలురను అవమానించి సింహాసన సోపాన పంక్తి కావించాడు. మునులను బాధించి యజ్ఞయాగాలను పాడుచేయించి హవిర్భాగాలు అందకుండా చేశాడు. ఎవడో మీరు చెప్పగలరా?" అని ప్రశ్నించి ఆగాడు. మహాసభలోని వారంతా "రావణుడు. లోకవిద్రావణుడయిన రావణుడు" అని అరిచారు. "అవును కదా. ఆ ప్రమాదకారిని అంతంచేయటానికై, పుట్టిన రాముని పట్టభంగం చేశాము. అనంతరం అడవులకు కూడా పంపాం. అక్కడ మహోగ్రులైన ఖరదూషణాది రాక్షస సహస్రాన్ని చంపించాం. కిష్కింధకు చేర్చాం. మిత్రపుత్రునితో మైత్రికూర్చాం. ఇప్పుడు సుగ్రీవుడు రామ కార్యార్థియై కపుల రప్పింప కబురు పంపాడు. ఎవరెవరి అంశలతో ఏ జాతి సృష్టియైందో వారువారంతా వారి దివ్యతేజశ్శక్తులను ఆ జాతికి అనుగ్రహించాలె. రావణవధ దేవకార్యం కాని, మానవకార్యం కాదు. దేవనాథుడూ, దిక్పాలకులూ, తమ విధులను తాము నెరవేర్చాలి. రాముని అరణ్యవాసకాలం సమీపించింది. అది ముగిసేలోగా మన పనికూడా ముగించాలె. ఆ విషయం చెప్పటానికే మిమ్మల్ని రప్పించింది. రావణుడికీ విషయం తెలియరాదు. రహస్య గోపనం అవసరం. ఇక విధి

నిర్వహణ కోసం అంతా అదృశ్యులకండు. సంక్రమణుడు రేపేవేళ అయింది. అతని ఆహారంలో లోపం రానీయకుండా చూడండి" అంటూ నారదుడు అంతర్హితుడయినాడు. ఆ వెంటనే అంతా అదృశ్యమయింది. దృశ్యం మారింది. చందనాసనుడయిన దండధరుని చేతి దండం వంటి సుగ్రీవుని ఆజ్ఞ దిశదిశలను క్షణాలమీద వ్యాపించింది. వాయుపుత్రుని సంకల్పబలంతో వాయువే ఆ వార్త కపులకందించాడు. అందింది సుగ్రీవుని ఆజ్ఞ. చేయవలసింది రామకార్యం. అహో! ఆశ్చర్యం. నేల కదిలింది. ఆకాశం ద్రవించింది. సముద్రాలు స్థలంకోసం సంకుచితాలైనై. వీచినాయి, భ్రమరసంచారం, విహంగశ్రేణి విలాసం. మృగవిన్యాసం. ప్రాకసత్వగర్జనం. సృష్ట్యంతంలో జలప్రళయం. సృష్టిమధ్యలో ప్లవంగ ప్రళయం. ఆ దృశ్యం భావుకునకే కాని పామరునికి గోచరించదు. కిష్కింధకు దశయోజనాల వరకు విడుదులు విస్తరించబడ్డాయి.

అంజనవిహారులైన అగచరులు అంజనాద్రినుంచి మూడుకోట్లు వచ్చారు. అస్తాచలంనుంచి హాటక దేహులు ప్లవగులు పదికోట్లు వచ్చారు. గిరీశాలయంనుంచి హరికేసరద్యుతులు వేకోట్లు వచ్చారు. శీతశైలంనుంచి కందమూలాలు తినే కపులు వేవేలకోట్లు వచ్చారు. వింధ్యమునుంచి కోటి, గంధమాదనంనుంచి కోటి పంచకం అంగారకాభులు హరివరులు వచ్చారు. క్షీరవారిధి తీరగులూ, నారికేరభుజులూ, కీశులు రెండుకోట్లు వచ్చారు. ఇంకా సరిదవనీ కందర కాననచరులైన శాఖామృగశ్రేష్ఠులు లెక్కకు మిక్కిలి దిక్కులు పట్టకుండా రామకార్యార్థం వచ్చారు. అడవుల్లో వుండే కపులను పిలవబోయిన దూతలు మహేశ్వరుడు మహాధ్వరం చేసిన ప్రదేశం చేరుకున్నారు. ఆ సవనంలో ఆహుతి చేసిన ఆజ్యహారంచే తడిసిన ప్రదేశంలో పుట్టిన కందమూల ఫలాలను సంగ్రహించారు. అవి భుజిస్తే నెలరోజులవరకు క్షుత్పిపాసలుండవు. అన్వేషణ కార్యంలో అవసరం కావచ్చని కొదవలేకుండా కూర్చుకుని రవిపుత్రునికి కానుకగా కొనివచ్చారు. "మీ ఆజ్ఞ సర్వే సర్వత్ర చాటబడింది. అపారంగా వానరులు వరుసకట్టి వస్తున్నారు. అప్పుడే మూడువంతులు వచ్చారుకూడా. ఇక మాకేమాజ్ఞ" అని నిల్చున్న దూతల ప్రీతితో

సత్కరించి నియామాలు చేయవలసిందిగా నిర్దేశించాడు. వారు సంతోషంతో సాగిపోయారు.

## సుగ్రీవసౌమిత్రులు కపిసేనకూడి రాముని చేరపోవుట

సుగ్రీవుడు సౌమిత్రి చేయికొని గిరిశిఖరం మీదికి కొనిపోయాడు. అంగదాదులు అనుసరించి వెళ్ళారు. శిఖరాగ్రంచేరి "సోదరా! సౌమిత్రీ! చూచావా రామచంద్ర కార్యార్థంగా వచ్చిన వానరసముద్రం? కంటికి కనుపించినంతవరకూ కపులే కనుపిస్తా"రని అన్నాడు. లేచిపారచూచి లక్ష్మణుడు మిత్రుని హృదయం ఎంతవిశాలమో, ఆయన ఆజ్ఞ అంతకఠోరం అని మెచ్చుకున్నాడు. "ఇక్కడ పని చక్కబడింది కనుక అన్నను దర్శించటం అవసరంకదా" అన్నాడు. "అంతకంటేనా? మీ ఆజ్ఞకి అన్యథాత్వంటూవానా? ఇప్పుడే ప్రయాణం చేద్దాం. క్రిందికిపోదాంపద" అంటూ గిరిదిగి, రాజసౌధం చేరుకున్నారు. పరిచారకులు సమీపించగానే, ప్రస్రవణ గిరికి ప్రయాణం కమ్మని సేనంతకు తెలుపుమని పావనితో చెప్పండి. రాణులంతో, రవిపుత్రుడు సకలకల్మష పరిహారార్థం స్నానాలయ ప్రవేశం చేయబోతున్నాడు. సకలాభరణ భూషితలై సమస్త పూజా ద్రవ్యాలను సమకూర్చుకుని సిద్ధంగా వుండమని చెప్పండి. "హాం"అని అనతిఇచ్చి, "మీరూ శీఘ్రంగా రం"డని సౌమిత్రితో స్నాన మందిరం చేరుకున్నాడు. అంగనలు సింగారించుకుని శిబికలపై రాజ ప్రాసాదం చేరారు. కపికులతిలకులు స్నానం ముగించి, ఆహ్నికాలు తీర్చి, బహిఃప్రదేశానికి వచ్చారు. చతురంతయానం సిద్ధమైనది తెల్పగానే వాహకులు ముందేతెచ్చి వుంచిన మణులు తాపినబంగరు పల్లకీతెచ్చి ముందుంచారు. సుగ్రీవుడు సౌమిత్రిని చేయిగొని అందులో ఎక్కించి తానుకూడ ఆసీనుడయినాడు. భేరీ ఘంటారావాలు, శంఖారావాలు, సింగణా ఘోషణాలు కలిసి, దిక్కులశ్రవణబధిరంగా ఒక్కసారి మ్రోగినై. వేద విదులు స్వస్తివాచనాలుచేసి, "శీఘ్రమేవ సంకల్ప కార్యసిద్ధిరస్తు. విజయం పొందూరా" అని ఆశీర్వదించారు. పుర ముత్తైదువలు పసిడి పళ్ళెరాల్లో జ్యోతులు వెలిగించి "మా రాజుకూ, రామునకూ, సర్వమంగళ, సర్వమంగళాలను ప్రసాదించా"లని దీవిస్తూ, హారతులిచ్చి, అక్షతలు పూలతో కలిపి తలపైచల్లారు. దూతలు శస్త్రపాణులై, ఉభయ

పార్శ్వాలు రక్షించగా, మార్గదర్శకులు బంగరుపొన్నుల దండాకర్రలు ధరించి ముందునడువగా, శృంగారాంగనలు చామరాలువీవగా, రాజభటుడు శ్వేతాతపత్రం పట్టగా ఆనందలక్ష్మి అవతరించినట్లు ప్రస్రవణ గిరికి ప్రయాణం చేశారు.

తమ్ముని పంపిన దాశరథి దినమొక వత్సరంగా కాలంగడుపుతున్నాడు. ఆ నాటి సాయంవేళ కొండపైకి వచ్చి చూస్తున్నాడు. ఏకాంతవాసుడయిన సీతాకాంతుని హృదయంలో సీతాచింత మెలగింది. ఎన్నో ఊహలు సుళ్ళుతిరిగినై. "తమ్ముడుపోయి పదిదినాలయింది. కపిపతి అవతరించాడో లేదో. కోపంతో ప్రుంగిపోతున్న తమ్ముడు సమయోచిత ప్రసంగం నడిపాడో లేదో. ఇన్ని దినాలు తమ్ముడు నిష్కారణంగా వుంటాడా? క్షణం నన్నువదలి వుండలేనివాడు ఇన్ని రోజులు వున్నాడంటే కార్యసాధన యత్నం కొనసాగుతున్నదని తోస్తోంది. దక్షిణనేత్రం స్పందించి శుభం సూచించింది. శుభవార్తతో సోదరుడు రావచ్చునని అనిపిస్తోంది. ఉన్నత వంశంలో పుట్టి, ఉన్నత విద్యలు నేర్చి, ఉన్నతాశయాలు కలిగి, ఉన్నత సోదరులతో ఒప్పి, ఉన్నత దాంపత్యం కలిగి, కలలోనైనా కలుషపథం చింతించని నాకు అనూహ్యంగా అపకారం జరిగిందంటే దైవనిర్ణయం ఎంత బలీయమయి దాటరానిదో, ఎంతవిచిత్రమైనదో అవగతమైంది. ప్రతిపక్షి పేరు తెలిపితే కాని, ఆతడున్న ప్రదేశం కాని, అక్కడికి చేరేమార్గం కాని ఏమాత్రం ఎవరూ చెప్పరేం? తెలిసిన మిత్రుడు కూడా దాచాడెందుకు? తన కార్యసాధనం కోసం అలాచేశాడా? అతడు కాపట్యంగలవాడు కాడని మారుతి చెప్పాడు కదా? ఇక ఎందుకు దాచినట్లు? గురుతు వచ్చింది. చోటు తెలిసినంతమాత్రాన ప్రయోజనంలేదనీ, సీత క్షేమవార్త తెలియటం ముఖ్యమనీ అన్నాడు కదా? ఆ మాటలో ఎంతో అర్థం వుంది. శత్రుక్షయం జరుగుతుందే కాని, సీతా పరిగ్రహణం జరగదు. ఆ అన్వేషణ కార్యం పూర్తిచేస్తానని మాట ఇచ్చాడు కనుక సంశయించవలసిన పనిలే"దని చింతిస్తున్నాడు.

దిక్కులన్నీ ధరాధూళితో కారుక్రమ్మినై. స్పష్టంగా తెలియరాని ఏదో భయంకర కలకలారావం వినవస్తోంది. మధ్య మధ్య

తూర్యత్రికాలూ, మంగళవాద్యాలూ కర్ణగోచరమవుతున్నై. లేచినిలిచి కిష్కింధానగర మార్గంవైపు చూచాడు. సముద్రం ఘూర్ణిల్లుతూ పొంగి చెలియలికట్ట అతిక్రమించినట్లు వస్తున్న వానరసైన్యం కానిపించింది. బంగరు పల్లకి సూర్యమండల కాంతిని పరిహసిస్తూ వస్తూంది. వెనువెంట చిత్ర చిత్రాలంకారాలతో పసిడి పనితనంకల మేనాలువస్తున్నై. అటూ ఇటూ కానెరింగిన వారు కొందరున్నారు. ఆ వానర సమ్మర్దానికి దూరంగా హనుమంతుడు గదాధారియై కన్పించాడు. క్రమంగా ఆ వానర యాత్ర రామున్న పర్వత ప్రదేశాన్ని లక్ష్యంగా చేరవస్తూంది. కాంచనమయకాంత యానం పర్వత పాదంచెంతకు వచ్చింది. అందులో నుంచి రవిచంద్రుల్లాగా రామలక్ష్మణులు దిగారు. రాముడు క్రిందికి దిగాడు.

## శ్రీరాముడు సుగ్రీవునికి నీతిని తెలుపుట

క్రిందికి వస్తున్న శ్రీరాముని పాదాలపైపడి సుగ్రీవుడు "పాహి మాం రామప్రభో పాహిమాం. రక్షమాం రవివంశమండన! రక్షమాం. అపరాధిని. ఆర్తుడను. ఆదరించు. అనుగ్రహించు" మంటూ కన్నీటి ధారలచే కాళ్ళు కడిగినాడు. ధర్మాత్ముడైన ప్రశస్తమైన హస్తంతో లేవనెత్తి ఆలింగనం చేసుకున్న రామునిచరణ సరసిజాలను వానరీవానర శ్రేష్ఠులు క్రమంగా స్పృశించి భయభక్తులతో ప్రక్కకు తగ్గి నిల్చున్నారు. అపారంగా వచ్చిన అగచర సముదాయాన్నిచూచి హర్ష పులకితగాత్రుడయినాడు. భానుజుని హన్మంత నియమించి రామ రామానుజులు ఆసీనులైనారు. అంగదజాంబవంతాదులు ఆపోవని చూపులతో సోదమలంసూ, అంతవాడయిన సుగ్రీవుణ్ణిచూస్తూ కొంచెం ఎడంగా కూర్చున్నారు. పావని రాముని పదములకు దగ్గరగా మోకాళ్ళ మంచిపై కూర్చుండి ధ్యానసమాధిలో మగ్నుడయినాడు. అంతఃపురస్త్రీలు తారారుమాదేవులతో కించిద్వీక్షణావరోధంగా ఆసీనులైనారు. అందులేని కపిసైన్యం వుండిన చోటనే వుండి ఆ త్రిమూర్తులంచూస్తూ వుంది. సీతాపతి మధురమంద్రధ్వనితో "మిత్రమా! రవిపుత్రా! ధర్మార్థకామాలను విభజించి, తగినట్లుగా ఉచితవేళ తెలిసి పొందేవాడినే ప్రాజ్ఞులు, ప్రాకృతులు ప్రభువుగా సేవిస్తారు. ధర్మార్థాలనువదలి కేవలం కామంలోపడి కాలం గడిపేవాడు చెట్టుకొమ్మ చివర నిద్రించి నేలబడి మేలుకున్న పురుషుని పోలుతాడు.

అటువంటివాడు రాజైనా తరాజుగా చూస్తారు. శత్రువులను మర్దిస్తూ, మిత్రుల సమర్థిస్తూ మెలగి త్రివర్గఫలం పొందే రాజును ధర్మం ఆశ్రయిస్తుంది. అతని పాలనలో ఈతిబాధలుండవు. అకాలమరణాలుండవు. అపమార్గసంచారులుండరు. అవినీతిపరులుండరు. రాజద్వేషులుండరు. ప్రమాదాలు మానవులకు తప్పవు. సకాలంలో తెలిసి సరిచేసుకొనుటమే యోగ్యుల లక్షణం. కార్యానుకూలకాలం వచ్చింది. ఉద్యోగానికి ఉపక్రమించటం మంచిది. సభ ఏర్పరచి సచివులతో మంత్రాంగం నడుపుదాం" అని అన్నాడు.

## సుగ్రీవుడు రామునితో వానరుల రప్పించుట వచించుట

"రామచంద్రా! ఇప్పుడు మంత్రాంగంతో పనిలేదు. చేయవలసినంతా చేసే నీదర్శనార్థం వచ్చాను. భోగలాలసుడనయి పూజ్యమిత్రుని కిచ్చిన గడువు ఉల్లంఘించి చేయరాని అపరాధం చేశాను. ఆ పాపలోపం పది రోజులలోనే పరిహారం చేసుకున్నాను. చతుస్సముద్ర ముద్రితమైన విశ్వంభరాగల కపులకు వార్తలు పంపాను. వారంతా దేవగంధర్వ పుత్రులు. ఘోరదర్శనులు. కామరూపులు. కాంతారమార్గ విజ్ఞానవిశారదులు. మహేంద్రపరాక్రములు. హాటక వింధ్య సుందర హిమశైల మందిరులు. తమతమ సేనలతో నూర్లు, నూరువేలు, నూరులక్షలు, అయుతలు, శంకువులు, అర్బుదములు, ఖర్వమహాఖర్వ మధ్యాంతారై నీ కార్యం కోసం వచ్చారు. రావలయిన రావణుని ఉగ్రరణంలో ఉసురులుకొని నీ దేవిని, మామూలను నీ అంక పీఠిపై నెలకొల్పుతారు. నీవు ప్రేమతో నీ మిత్రునికి చూపిన అవకాశం సద్వినియోగం చేసుకుంటాడు. నేనిందులో నిమిత్తం మాత్రమే. మీ సోదర శరచాపాలే సర్వం సాధింపుతై. నా అజ్ఞానం నశించింది. కన్నుల పొరలూడినై. నీ పాద పరాగ పవిత్రీభూత శిరోధారినై జీవితశేషం పూరిస్తాను. నా జీవంతో ఈ సర్వస్వం నీవిచ్చింది నీకే అంకితం చేస్తున్నాను. ఈ అంతరా కర్తవూ, భర్తవూ నీవే. నీ పరివారంలో నేనొకణ్ణి. నీ ఆజ్ఞాపాలనం నాకు నాకలోకభోజనం. నీ దర్శనం నాకు ముక్తి. కాంతాచరణ స్పర్శనం. నీ సేవ నాకు బ్రదుకుత్రోవ. నీవుచేసే దుష్టదైత్యుల సంహార సవనంలో ప్రముఖుడనవుతాను. రామప్రభూ! అనుశాసించు. పనిగొను."

మంటూ సుగ్రీవుడు భక్తి తన్మయుడయి మళ్ళీ రాముని పాదాల వ్రాలాడు.

## రాముడు సుగ్రీవుని అభినందించుట

అసలే శ్రీరాముడు శిరీషకుసుమ సుకుమార మానసుడు. ఆశ్రిత రక్షణుడు. కరుణాపయోధి. పుటంపెట్టిన బంగారంవలె పశ్చాత్తాపంతో పవిత్రుడయి, భక్తితో భాసించే మిత్రునిలో భరతుణ్ణి చూచాడు. పరమానందం పొందాడు. తనకిప్పుడు నలుగురు తమ్ముళ్ళనుకున్నాడు. చిరుహాసంచేసి, "మిత్రభక్తుడా! లేచి నా సరసను కూచో. నీవు విరాగివయి నీ మిత్రుణ్ణి సరాగుని చేస్తున్నావా? నేను సరాగుడనే కనుక నా వాళ్ళు నాలాగే వుండాలి. సామాన్యులకు గృహస్థ ధర్మంకంటే మించింది లేదు. నా మిత్రుడవై నీవు సన్న్యసిస్తే సీతా, నేనూ, నా తమ్ములూ నిన్ను చూడదలచివస్తే, పక్షులెంగిళ్లు తిన్న ఫలమూలాలే తిన పెడతావా? మేం అయోధ్యలో వుండగా నీవువస్తే మేమిచ్చే ఆతిథ్యం కందమూలాలవలే అని భావంచేసుకో మంటావా? ఇంతకూ తారా రుమా దేవుల అనుమతిపొంది వచ్చే అంటున్నావా?" అనేసరికి అందరూ ఫక్కున నవ్వారు. ఆపుకోలేక సుగ్రీవుడు కూడా నవ్వాడు. "భాస్కరుడు చీకటిని చీల్చటం చిత్రమా? లోకానికి ఇంద్రుడు వర్షించి సంతోషం కూర్చటం చిత్రమా? రాత్రిని చల్లచేయటం చంద్రునకు అసహజ లక్షణమా? నీ వంటివాళ్ళు మిత్రులకు మేలుకూర్చుట అసంభవమా? మిత్ర ప్రోత్సాహంతో నేనిప్పుడు ధైర్యుడనైనాను. నీవు నా మాట దాటనని మాట ఇచ్చావు కనుక నీ విచ్చింది మళ్ళీ పుచ్చుకో. నీ వంటి వాళ్ళు సాంసారికం పరిహరిస్తే ధర్మదేవత పాదాలు విరుగుతై. లోకంలో సజ్జనులకూ, సన్మిత్రులకూ కరువు వస్తుంది. ఈ రాజ్యంలో నీవు ముందు. నీ వెనుక మేం. నిన్ను రాజా అలంచేసుకునే చెలిమి చేశాను. నీ కోరిక తీరింది. నా కోరిక తీరనుంది. సీత జాడ తెస్తానని మాట ఇచ్చింది నీవు. కనుక నీ మాట నీవే చెల్లించు. నా మాటను తమ్మునిపై పెట్టానా? సీతాన్వేషణలో రావణ రంధ్రాన్వేషణ కూడా చేయించు." అని రాముడు తన పాత్రను అభినయించాడు. ఆ సరస భాషణాలకు అందరు ముగ్ధులైనారు.

తెలిపేవారుగా పై వాహికమందిరంవలె యాతాయాత వానరసంచార సమాకీర్ణమై ప్రస్రవణ పర్వతం నేత్రోత్సవం కావింపుతూంది. వచ్చిన మహాయోధవరుల పేరుపేరుగా రఘురామునకు రవిజుడు విశదపరచి, ప్లవగ ప్రముఖులతో "మీ మీ పరివారాన్ని కొనితగిన స్థానాలను నిర్ణయించి నేను ఆనపెట్టేవరకు విశ్రాంతి తీసుకోవలసిం"దని చెప్పి మురలి యున్నాడు.

## శ్రీరామునికి సుగ్రీవుడు తనసేనలను తెలియచెప్పుట

సుగ్రీవాజ్ఞచే దూరాగతులయిన కపివరులు తమకు నిర్దేశించిన విడిది పట్టులకు జని విశ్రాంతి పొందారు. అనంతరం సుగ్రీవుడు రామచంద్రుని చూచి "రామప్రభూ! మిత్రరూపంగా వచ్చిన నా ఆత్మవిభూ! అవధారు. వృద్ధవాల విభేదం లేకుండా నీ కార్యంలో పనిగాని జన్మ చరితార్థం చేసుకోటానికి నామాట పాటించి స్వరాష్ట్ర స్వసుఖ స్వాలయముల వదలి వానరానీకం వచ్చింది. వీరంతా సమగ్ర శక్తిమంతులు. అప్రకగతులు. దురవారాపులు. సంచితక్షములు. ప్రశస్తబలులు. కామరూప సంపాదిత స్వామికార్యధురంధరులు. గగనజలధారుణీ సంచారులు. మడమ త్రిప్పని, మాటమీరని మహాత్ములు. నీ కోసం, నీ సేవకోసం అసంఖ్యాకంగా వచ్చి వున్నారు. ఈ వానర మహానౌకకు కర్ణధారివి నీవు. నీ ఇచ్ఛాధీనంగా నడిపించు. నేను ఈ ప్లవగ ప్రభువుల పట్ల అత్యుక్తి కాని, అసత్యం కాని చెప్పలేదు. చెప్పిన దానికంటే చేవ మెండుగా గలవారు. వీరికి విధి ఏదో విధించు. నా పని ఏదో ఆజ్ఞాపించు" అని చేతులుమోడ్చి, వినయించి నిలుచున్నాడు.

ఇనవంశ్యుడు ఇనజుని చెంతకు చేర్చుకుని చేతితో నిమురుతూ, "నెచ్చెలీ! నీ సామర్థ్యం దశదిశల ప్రస్ఫుటమైంది. నీ వివేకం మిత్రకోటికి విశదమైంది. నీ మిత్రధర్మం మిన్నుముట్టింది. నీ సంకల్ప సమూహం విజయ సూచకమైంది. నీ ఈ రాక, క్రూరరావణుని గుండెకు కాక అయింది. నా అర్ధాంగికి పున్నమిరాక అయింది. మాకు పూచిన మనుపోక అయింది. పూర్వం నీవూ నాతో చెప్పినదే సరియైనబాట. ముందు సీత సజీవంగా ఉందో లేదో, ఎక్కడ వుందో, ఏ స్థితిలో ఉందో తెలుసుకోవటం ముఖ్యం. అందుకు అన్వేషణం అవసరం. ఆ పనికినీవే

అద్భుతవు. నేనుగాని, తమ్ముడుగాని లగం. నీవు సర్వలోక సంచారివి. భూమ్యంతరిక్ష పాతాళాల్లో నీ వెరుగనిచోటులేదు. వచ్చిన వానర పుంగవుల్లో ఎవరెవరు ఏ పనికి అర్హులో నీవెరుగుదువు కాని మాకు తెలియదు. కనుక కార్యభారం నీభుజస్కంధాలపైనే ఉంది.సీతాసమాగం అయ్యేవరకు సకల సైన్యానికి, మాకు నీవే సర్వాధికారివి. నీ సంకల్పంలో వికల్పం లేదు. విజయం తథ్యం. అవసరమేరాదు. వస్తే మేంకూడా తోచినమార్గం చెప్పి తోడ్పడుతాం. ఇదివరకు నాకు మిత్రుడు ఒకడే వున్నాడు. అతడు గుహుడు. నాకు మొదటివాడూ, చివరివాడూ అతడే. ఇప్పుడు ఇద్దరైనారు. వామదక్షిణ భుజాలవలె వుంటారు. నేత్రద్వయంలాగా ప్రకాశిస్తారు. విజయానంతరం ఆ స్థానాల్లో మీరు రాముని హృదయంలో చెరగని ముద్ర వేసుకుంటారు. ముందు చేయవలసిన పనికూర్చి నీవే నిర్ణయించు" మని అన్నాడు. సౌమిత్రి "అన్న రెండు మాటలు, రెండు బాటలు కల వాడుకాడు. ఆయన చెప్పినట్లు చేయటం మన విధి" అని బలపరిచాడు. అంతా "రామచంద్రునకుజై. రవిపుత్రునకుజై." అని ఆనందకోలాహలం అంబరమంటి గావించారు.

## సూర్యసుతుడు తూర్పుదిక్కుకు వినతుని నియమించుట

ఇంద్ర ధ్వజంలాగా ఇనజుడు లేచి, మేఘ ఘోషుడూ, అద్రి తుల్యుడూ ఐన వినతుణ్ణి ఆహ్వానించాడు. సముద్రం చీల్చుకుంటూ తిమింగిలం వచ్చినట్లు వానరానీకిని పాయలుచేస్తూ వచ్చి నమస్కరించి నిలుచున్నాడు. "సూర్యచంద్ర ప్రసాదంతో ప్రవృద్ధమైన వనచరనేతా! వినతా! నీవు తూర్పుదిక్కు వెదుకు నిమిత్తం వెళ్ళు. రావణాగారాలనూ సీతాసాధ్వి వున్న చోటులని అనుమానించే ప్రదేశాలనూ ముందుచూడు. ఆపై శైలకానన నదీనదాలను విడవకుండా వెదకు. సరయువును.గంగను కౌశికిని, మనోహారిణిని, సింధువును, సూర్యజను, యమునను, సరస్వతిని వెదకు. కాలమహీ బ్రహ్మమాల, వేగవతి, విదేహ, మాళవ, కాశీ, మగధ, కోసల మొదలైన మహానగరాలను, పట్టణాలను, గ్రామాలను పరిశీలించు. సముద్రగర్భస్థ శైలాలు, మందరాంతర్భాగాలు, ముక్కిడులు, ఓష్ఠకర్ణకులు, వుగ్రలోహముఖులు, ఏకపాదులు, జవనత్వరులు, పురుషాదకులు, కర్ణచూడులైన నరులుండే చోట్లు నిర్భయులై అన్వే

లించాలి. ఆ తర్వాత నౌకలలో ప్రయాణించి ఏడు ఖండాలలో, యవ, స్వర్ణ రూప్యకం అనబడే దీవులుచేరి ఆ పరిసరముల అన్నింటినీ ప్రాలు మాలికలేకుండా శోధించండి. అది గడవంగానే శోణనది వస్తుంది. అదిదాటి సముద్రంలో ప్రవేశించి, ద్వీపాలు, ద్వీపకల్పాలు చూడండి. సముద్రంలో రాక్షసులు బ్రహ్మవరంతో ఛాయాగ్రాహులై జీవిస్తుంటారు. ఆ ప్రదేశాలు ముందుగా తెలిసి అంబరమార్గంలో అతిగమించండి. ఆ పైన పక్షిగృహం చూడండి. మందేహాలనే దైత్యులు కొండ చివర్లలో వ్రేలాడుతూ బ్రహ్మతేజంతో భాస్కర గమనాన్ని అడ్డగిస్తుంటారు. బ్రాహ్మణులిచ్చే అర్ఘ్యప్రదానంతో హతులవుతూ, మళ్ళీ జీవిస్తూ వుంటారు. అదిదాటి, క్షీరోదం చూడండి. సముద్ర మధ్యంలో ఋషభం అనే పర్వతం వుంది. దాని చూచి, సుదర్శన సరస్సుకు చేరండి. పిమ్మట మళ్ళీ అంబుధి వస్తుంది. అందులో బడబానలం ఉద్ధృతంగా వుంటుంది. ఆ ప్రదేశానికి పదియోజనాల వరకు ప్రాణికోటి చేరదు. ఆ అగాధకూపారంలో భయంకర జీవులు ఆ వేడికి ఘోషపెడుతూ వుంటై. ఆ వసతి దాటితే పదమూడు యోజనాల దూరంలో స్వర్ణగిరి వుంది. అక్కడ వేశిరస్సుల అనంతుని చూడండి. ఆయనకు కేతువుగా కనక తాళకేతువు వుంది. అది మూడు కొమ్ములతో పూర్వదిగవధిగా, మర్త్యులకూ, దేవతలకూ మధ్య నిలిచింది. ఆపై ఉదయగిరి వస్తుంది. అది శతయోజన పరిమితి కలది. యోజనోన్నతమయింది. దశయోజన శృంగం సౌమనసం అనబడేది వుంది. పూర్వం వామనుడు ప్రథమ పాదం దానిపైమోపి ద్వితీయపాదం మేరుపర్వతానికి చాచాడు.

సూర్యుడు జంబూద్వీపంలో ఉత్తరాయనగతుడై ఆ గిరిశృంగం పైకి వచ్చి దక్షిణదిశావాసులకు దర్శనం ఇస్తుంటాడు. ఆ గిరిలో వాలఖిల్యాదులైన మహర్షులు, వైఖానసులు వుంటారు. దాని ప్రక్క సుదర్శన ద్వీపం వుంది. ఆ ద్వీపవాసులకు పూర్వకుధర శిఖరంపైకి రవిరాగానే వెలుతురు వస్తుంది. ఆ కాంతి అరుణవర్ణంగా భాసిస్తుంది. భూమికీ, భూనివాసులకూ, సృష్టి ప్రథమంలో విధాతద్వారంగా రాకపోకలు నియమించటంచేతా, సూర్యగమనం ఆ దిశ నుంచే మొదలు కావటంచేతా అద్యమై పూర్వదిక్కు అనబడింది. అదిదాటితే దేవతలుండే

చోటు వస్తుంది. అక్కడ సూర్యచంద్రదీప్తులు ప్రసరించవు. అంతులేని చీకటి నిండివుంటుంది. అంతవరకు మానవులు పోగలరు. ఆపై అసాధ్యం. అంతవరకుపోయి సీతామాతను, రావణుని వృత్తాంతం తెలుసుకుని మాసంరోజులలో మరలిరండి. సమయాతిక్రమణం మరణానికి కారణం. సిద్ధకార్యులై, కీర్తిమంతులు కండు.

## దక్షిణ దిశకు హనుమదాదుల పంపుట

ప్రాగ్దిశాన్వేషణకు వినతుని నియమించిన పిమ్మట, అగ్నిపుత్రుడైన నీలునీ, వాయుపుత్రుడైన హనుమంతునీ, బ్రహ్మపుత్రుడైన జాంబవంతునీ, గజ, గవయ, శరగుల్మ, శరారి, సుషేణ, ఋషభ, గవాక్ష, ఋషు, మైంద, ద్వివిద, గంధమాదన, ఉల్కాముఖ, అంగదాదులనూ పిలిచి "వానరశ్రేష్ఠులారా! ప్రధానమైనదిక్కునకు మిమ్మల్ని పంపుతున్నాను. తూర్పు, పడమర, ఉత్తర దిక్కులు కార్యలోపం లేకుండా, శంకకు తావీయకుండా పంపటం జరుగుతుంది. ద్రోహి అయిన రావణుని నివాసం లంకా ద్వీపం. కనుక కార్యసాధకులుగా మీపై భారం మోపి పంపుతున్నాను. భావి అంతా మీ మీద ఆధారపడి వుంది. రామ రవి పుత్ర చరిత్ర స్వర్ణాక్షర లిఖితం కావాలె. మీరు పోవలసిన మార్గం చెపుతా వినండి. మహాగహన సంకీర్ణం, భయంకర కాలాహికుల సంకులం అయిన వింధ్య పర్వతం, నర్మదానదీ, గౌతమి కృష్ణవేణీ, వరదా, మేఖలా, ఉత్కలా, దశార్ణవ, అశ్వవంతీ, అవంతీ, విదర్భ, మహిష, ఋషిక, వంగ, కళింగ, కాశీ, దండక, గోదావరీ, ఆంధ్ర, పుండ్ర, చోళ, పాండ్య, కేరళసహ్యాద్రులను శ్రమ అనుకోకుండా సీతామాతను అన్వేషించాలె. కావేరి, మలయాద్రుల గాలించండి. మలయాద్రిపై దివ్యఋషిశ్రేష్ఠుడైన అగస్త్యులవారు వసించారు. ఆయనను నమస్కరించి, ఆశీర్వాదానుగ్రహాలుపొంది, తామ్రపర్ణి దర్శించండి. ఎలప్రాయంగల సతి పతిని కలిసినట్లు, చందనవన సంఛన్నమై ద్వీపసహస్ర యుతమై జలధిని చేరుతుంది. అదివాటి పాండ్య దేశకవాటం అని తగిన సస్యశ్యామల ప్రదేశాలనుచూచి అంబుధితీరం చేరండి. దాని తరించే మార్గం ఆలోచించండి. ఆ సముద్రంలో మహేంద్రశైలం అగస్త్యుని అనుగ్రహంతో మునిగిమునగనట్లుంది. ఆ గిరిపై యక్షచారణ గంధ

ర్వాదులు ఎప్పుడూ సంచరిస్తుంటారు. పర్వదినాల్లో దేవతలు కొలువ ఇంద్రుడు సేవించవస్తాడు. ఆ జలనిధి మధ్య భాగంలో మానవులకు అగమ్యమై శతయోజన విస్తీర్ణమై, దశయోజనాయతమై లంకా ద్వీపం వుంది. అదే మనవైరి, రామవైరి, సీతాపహారి రావణుడుండే ప్రదేశం అక్కడ ప్రతి అణువూ శోధించాలి. ఆ ద్వీపం చేసే మార్గంలో అంగారక అనే రాక్షసి ఛాయాగ్రహణశక్తితో భూతవ్రాతాన్ని పొరిగొంటుంది. లంకలో లేదని నిశ్చయంగా తేలినపిమ్మట, యోజనదూరంపోతే పుష్ప గిరి వుంది. అది దేవతా సంచారయోగ్యమైంది. దక్షిణాయనంలో కనక శృంగాన్నిరాస్తూ కమలహితుడు, రజత శృంగాన్నిరాస్తూ కమల విరోధి ప్రకాశిస్తారు. కృతఘ్నులూ, కూళలూ, నాస్తికులూ ఆ పర్వతం చూడలేరు. మీరా శైలానికి శిరంవంచి మ్రొక్కి ముందుకు సాగండి. పద్నాలుగామడల దూరంలో సూర్యవంతమనే పర్వతం వుంది. అది వైద్యుతం. అక్కడ కందమూలఫలాలు ఆరగించి, తేనెలు గ్రోలి పథిశ్రమ పాయంగా విశ్రాంతి పొందండి. ఆవల విస్తీర్ణంగల కుంజర పర్వతం చేరండి. అందులో భోగవతిపురం వుంది. ఆ నగరంలో రహస్యాగారాలు ఎన్నో వున్నై. అక్కడ పరిశీలించి, ఋషభాచలంపైన వెదు నించి ఆ గిరి శోధించండి. పద్మశ్యామల వర్ణంగల చందనం అక్కడ లభిస్తుంది. దాన్ని చూడండి కాని ముట్టవద్దు. బభ్రు శైలూష శుభ్ర గ్రామణి శిగ్రువులనే అయిదుగురు గంధర్వులు కాపలా కాస్తుంటారు. అక్కడ పుణ్యకర్ములు నివసిస్తుంటారు. వారికి ప్రదక్షిణించి పొండి. దాని తర్వాత పితృలోకం వస్తుంది. సజీవంగా మర్త్యులు అక్కడకు పోలేరు. అంతవరకు మీకు సాధ్యం. ఆపై అసాధ్యం. నేను చెప్పినవే కాక మీకు తోచినవి కూడా పరిశీలించండి. సగరపుత్రులు యజ్ఞాశ్వం నిమిత్తం భూమిని ప్రక్కలించినట్లు జానకీమాతకై సర్వం వీక్షించండి. నెలరోజులు గడువు. చూచానన్నవాని తలనే చూస్తాను. చూడలేదన్న వాడి తలతీస్తాను. మీరు విక్రమసంపన్నులు. సద్వంశజాతులు. సద్గుణాధారులు. కృతయత్నులై జానకీ క్షేమోదంతం తీసుకురండి. మీకు శుభం కలుగుతుంది. మీరు పొండి.

## సుగ్రీవుడు సుషేణుని పడమరదిక్కుకు పంపుట

ప్రధాన ప్రదేశానికి కపిలోక ప్రధానుల నియమించి, పశ్చిమదిక్కుకు పంపగా, అరివీరభయంకరుడూ, మామా, తారాజనకుడయిన సుషేణుని రావించాడు. వినయ పురస్సరాంజలి ఘటించి, శౌర్యదర్పగమనాల పరీవృతమైన మరీచి సుతుల మారీచుల లక్షించి "ప్లవగకుల జలధిమణులారా! మీరు పశ్చిమాభిముఖులై పయనించండి. కావలసినంత పరివారం తీసుకొనండి. చేసేది సీతాపతి కార్యం. కనబోయేది లోకమాత సీత. తోచినరీతిగా కాకుండా క్రమపద్ధతిలో చెప్పినవని వివరంగా వెదకండి. ముందు సురాష్ట్రం, బాహ్లీకశూర భీమదేశాలూ, పురాణ ప్రసిద్ధమైన జనపదాలూ, పున్నాగ, పొగడ, మొగిలి కాంతారాలూ, పశ్చిమంగా పారే నదులూ, మునివాటికలూ, కొండలూ, గుట్టలూ, మరుభూములూ, శిలామండలాలూ, కోనలూ, గుహలూ చూచుకుని పడమర సముద్రం చేరండి. వారిధితీర స్ఫుటకేతకీవనంలో, గానుగతోపుల్లో, కొబ్బరితోటల్లో విశ్రాంతి పొందండి. ఆ ప్రదేశాలన్నీ వెదకి మురచీపురం, జటీపురం, అవంతీ, అంగలోపం, పరికించి సింధునది సముద్రంలో కలిసేచోటు వెదకి, హేమగిరిచేరి, అక్కడ గాలించి, పారియాత్ర పర్వతానికి గమించండి. దానిపై నాలుగుకోట్ల సంఖ్యలో కనకవర్ణులు, సత్యగరిష్ఠులు, కామరూపులుంటారు. ఆ గంధర్వుల దారివదలి, అక్కడి మధురఫలాల భుజించక స్థిరులై వెదకండి. ఆపై వజ్రధరం కనండి. నూరామడల వైశాల్యం గలిగి పక్షి వృక్ష లతాగుల్మ సంఘటితమై వుంటుంది. అది వదలిపోగా, జలధిచతుర్థ భాగంలో చక్రవంతశైలం వుంది. అందులో సహస్రారచక్రం విశ్వకర్మ నిర్మితమైవుంది. అది మేధకందని నిర్మాణం. దాన్ని రక్షించే హయగ్రీవుడనే దానవుణ్ణి చంపి మురారి శంఖ చక్రాలు పొందాడు. ఆ సానుకందరాల్లో జాగ్రత్తగా జానకమ్మను, రావణుని వెదకండి. అరవై ఆమడల ప్రదేశం ఆక్రమించిన వరాహ పర్వతం వైపు పొండి. సముద్రంలో వుండి మానసముల్లంఘం అయింది అది. ఆ పర్వతంలో ప్రాగ్జ్యోతిషపురం నరకుడనే రాక్షసుడు పాలిస్తున్నాడు. తరువాత సర్వసౌవర్ణ పర్వతం చూడండి. అక్కడే దేవతలు ఇంద్రుని

అభిషేకించారు. దాన్ని మేఘవంతుని కూడా అంటారు. దాని శిఖరాల అరవై వేల కొండలున్నాయి. అవన్నీ మనసుమెచ్చుటగా వుంటై. ఆ పర్వత పంక్తి నడుమ ఉత్తమమేరు పర్వతం వుంది. ఆ పర్వత శోభకు మెచ్చి "ఇక్కడ నివసించేవారు దేవతలు కనకవర్ణ తనువులై ప్రకాశిస్తారని పద్మినీప్రియుడు వరమిచ్చాడు. మీరందరు చేరగానే సువర్ణమూర్తులౌతారు. విశ్వదేవతలు మరుత్తులు ప్రముఖులు, నిర్జరులు అపర సంధ్యావేళ సూర్యుణ్ణి సేవించవస్తారు. పదివేల ఆమడల దూరం అర్ధయామ కాలంలోపలే దినకరుడు అస్తాద్రి చేరుకుంటాడు. ఆ పర్వత శిఖరంలో విశ్వకర్మనిర్మితమై వివిధాలంకారశోభితమై వరుణనివేశ్మం వుంది. అస్తగిరి మేరుగిరుల అంతరంలో సువర్ణమయమూ, చిత్రవేదికమూ, దశశిరమూ అయిన తాళవృక్షం లోచనోత్సవం కలిగిస్తుంది. తపోనిధుడూ, ధర్మిష్ఠుడూ, బ్రహ్మతుల్యుడైన మేరుసావర్ణి అనే ఋషి తపం చేసుకుంటుంటాడు. ఆయనను మ్రొక్కి రావణుని గూర్చి, జానకి గూర్చి, ప్రశ్నించండి. నిశాంతంలో సూర్య జాత్తుడు ఆ శైలం అధిగమిస్తాడు. లోకం తిమిరావృతం అవుతుంది. ఇక అంతా అగమ్యం, అగోచరం అవుతుంది. కనుక మీరు అస్తాద్రి దాకాపోయి వెదకిరండి. మీకు వ్యవధి నెలదినాలు. గడువు మీరి ఎవరూ రావద్దు. అతిక్రమిస్తే ఆ క్షణమే అతడు వధ్యుడు. మీకు మార్గదర్శకుడుగా, అధినేతగా, మా మామ సుషేణుడు వుంటాడు. ఈయన నేతృత్వంలో సీతాసతి జాడ తెలిపి శ్రీరామానుగ్రహపాత్రులు కండి. సముచితంగా ప్రవర్తించే అవకాశం మీకిచ్చాను. పోయిరండి" అని వారిని పంపించివేశాడు.

## సుగ్రీవుడు శతవలిని ఉత్తర దిక్కునకు పంపుట

అనంతరం, బలనిర్జిత బలిమైన శతవలిని రప్పించాడు. "సుమకటాక్ష సంపత్ప్రభవిష్ణువైన నీవు నీ యూధంతో ఉత్తరదిశగా నీవుపోవలె. ఈ కార్యం చక్కచేసి రామచంద్రుని తృప్తిపరిస్తే, ఋణముక్తులమై, అర్థనిధులము, కృతకృత్యులము, ఉత్తములమై వుండగలం. మనకు పూర్వమే ప్రియం చూశాడు. ప్రతిప్రియం చేయటం మన విధి. జన్మ చరితార్థం అవుతుంది. ఉపకారం చేసినవానికి ఉపకారంచేస్తే జన్మ

సాఫల్యం వస్తుంది. ఉపకారికి ఉపకారం చేయటం కూర్చి చెప్పే
దేముంది? ఇది మీ మనస్సులో వుంచుకుని సీతాన్వేషణం, రావణరంధ్రా
న్వేషణం చేయండి. ఎల్లభూతాలకు ఈశుడైన పూజ్యుడు. అహితజనపురం
జయుడు. దయాపయోనిధి. భగవత్సముడు. మీకుదారి చెప్తా వినండి.
మ్లేచ్ఛ శూరసేన పుళింద, ప్రస్థల మద్ర భరత కురు కాంభోజ యవనశక,
బాహ్లిక ఆరట్ట పౌరవటంకణ యుగ్ధిక దేశాలూ, చీనపరమ చీనసీహార
దరదప్రాగ్దేశపంభాగాలూ, దేవదారు, లోధ్ర పద్మక వనాలూ, సోమా
శ్రమం, కాళం, శ్రద్ధమతులై వెదకండి. హిమగిరి, సుదర్శన పర్వతం,
దేవసఖాద్రీ చూడండి. ఆ తర్వాత నూరామడల దూరం, అగ్రాపం, అవ్వై
వారినీవృక్షజం, సర్వత్రశూన్యంగా వుంటుంది. ఆ ప్రదేశం దాటి కైలాసనగం
చేరండి. కిర్మిషపంకం కదగండి. కనకమండితం, పాండురాభ్రం,
కల్హారేందీవర కైరవ సుమశోభితం, హంస బక చక్రవాకసంచరితం
అయిన సరస్సు కన్నుల పండువు కాస్తుంది. అప్సరసప్పైకంటులు
అనుదినం సాయంకాలం విహారంకోసం వస్తారు. యక్షులు సేవించగా
కుబేరుడు అందులో క్రీడిస్తాడు. ఆ చోటంతా వెదకండి. ఆపల క్రౌంచా
ద్రిలో ప్రవేశించండి. అతివరం దుష్ప్రవేశం. ప్రమాదం లేకుండా వెద
కండి. దేవార్చితులు, అర్కసములు, దివ్య మహాత్ములుంటారు. వారికి
దూరంనుంచే నమస్కరించండి. మిగిలిన గుహలు, చరులు మిక్కిలి
లెక్కకు మిగిలివున్నై. అక్కడ వృక్షాలుండవు. ఆ ప్రాంతంలోనే కామ
శైలం, మానససరోవరం వున్నై. అవి మానవులకు చొరరాని చోటులు.
పార్శ్వ భాగాలల్లో వెదకండి. అక్కడనుంచి మైనాకం, సిద్ధాశ్రమం
చేరపోండి. మయమందిరం అందాలు చిందుతుంది. హయగ్రీవవైనలంగన
లుంటారు. వాలఖిల్యాదులు, సిద్ధులక్కడ తపంటారు. వారంతా వందనీయులు.
వారిని వానకసన్మ శేషవార్త అడగండి. వాలఖిల్యులున్న చోటికి దాపులో
వైఖాన సరస్సు వుంది. అందులో రాజహంసలు విహరిస్తుంటై. కుబే
రుని ప్రియవాహనం సార్వభౌమం కరిణులు కొలువగా నిత్యం చరిస్తుం
టుంది. ఆ చోటు చూడతగిందే. ఆ సరోవరం దాటితే అవతల నష్ట
చంద్రదివాకరమూ, నతారకమూ, నిష్పయోదమూ, నిశ్శబ్దమూ అవు
తుంది ఆకాశం. అక్కడి మునులు స్వయంప్రభులు. సూర్యవివరె

ఆజ్ఞగా భావించవద్దు. నిన్నాజ్ఞాపించే అర్హత నాకు లేదు. నీవు అభిమానించి నన్ను అనుసరిస్తున్నావు. అంతేకాని నా ఆధిక్యం కాదు. ఆ గౌరవం చేతనే చెప్ప సాహసిస్తున్నాను. నీ మేధాబలం వల్లనే అపూర్వ మిత్రత్వం లభించింది. నీ హెచ్చరిక వల్లనే రామానుజునిచే కాపాడ బడ్డాను. ఇకముందు కూడ అన్నమాటను నిలబెట్టుకోటం నీవల్లనే జరగాలి. నీవు నిపుణ కపిప్రవరుడవు. అగ్ని జలాకాశాంబువుల నీవు చొరరాని ప్రదేశం లేదు. నా మిత్రుని కార్యానికి ఎలా తిరుగులేదో నీ సంకల్ప గమనాలకు అలాగే తిరుగులేదు. నీ వొక కారణ జన్ముడవు. బ్రహ్మాస్త్రం నిన్ను బంధించదు. మరణదేవత నీ చరణసీమకు రాదు. సచరాచర జగత్తులో నీకసాధ్య పదార్థం లేదు. రామకార్యార్థం రూపాంతరం పొందిన వాయుదేవుడవే. నీకు సాటి నీవే. తేజోజవలాఘవ గమనాల్లో నీ తండ్రియే కనిపిస్తాడు. అంతశ్శక్తులటుంచి బాహ్యమైన తేజం చూచినా భూతకోటిలో పోల్చదగింది లేదు. మనోజవుడవు. మారుతతుల్య వేగుడవు. జితేంద్రియుడవు. బుద్ధిమంతుడవు. వరిష్ఠుడవు. వాతాత్మజుడవు. వానరయూథ ముఖ్యుడవు. అస్తోకపరాక్రమశక్తి, గుణదోష విచారణయుక్తి, దేశకాల పరిజ్ఞాన ప్రవృత్తి నీసొమ్ము. కార్యసాధనకు నిన్ను పొగడటం నా అభిమతం కాదు. అవి నీమీద ప్రోక్కేదారి. ఒకవేళ పొగడికే అనుకుంటే, నా ప్రస్తుతి సహస్రాంశంకూడ కాదు. మునులిచ్చిన శాపంవల్ల నిన్ను నీవు తెలుసుకోలేవు. అది గుర్తు చేయటమే నేనిప్పుడు చేసినపని. అంతా నీకు తెలిసిన విషయమే. ప్రత్యేకంగా చెప్పతగిందేమీ లేదు. రాము దేవేరిని సాధించి మరలతెచ్చే సహాయం నీవే చేయాలి. ఆ భారం నీపై వుంచాను. ఇంతకాలం నా అన్నబారినుంచి ఎలా రక్షించావో, ఇప్పుడు కూడా నా మిత్రునికిచ్చిన మాట దక్కించి అలా రక్షించు" అని అన్నాడు. విన్న మారుతి వినయ విశ్వాసాలు విరియుస్తూ, "వానరేశ్వరా! వాలివంటి బలవంతుడవు కాకున్నా, అంతకుమించిన వినయ వివేకవంతుడవు. ధర్మపరుడవు. విశ్వాసపాత్రుడవు. ఎన్నడూ నా మాటను కాదనలేదు. నేనొక మాట చెపుతా. రామకార్యం అంటే స్వామికార్యం, స్వకార్యం. దానికింత ప్రస్తావం అక్కరలేదు. కార్యభారం నాపైఉంచినా పై అధికారం నాకు వద్దు. అది యువరాజు అంగదునికి అప్పగించు"

అని అన్నాడు. అందుకు సుగ్రీవుడు హర్షం వెలిబుచ్చి అంగదునికి ఆజ్ఞాధికారం అప్పగించాడు. అమాత్యులు హనుమంతుని ప్రశంసించారు.

## శ్రీరాముడు హనుమంతునకు తన ముద్రిక నిచ్చుట

రామచంద్రుడు మౌనంగా కార్యక్రమం గమనించాడు. కపినేత ఇందరు కపిశ్రేష్ఠులుండే కార్యభారం హనుమంతునిపై పెట్టటం ఆలోచనకు తావిచ్చింది. "నిశ్చితార్థుడు సుగ్రీవుడు. కార్యసాధనంలో నిశ్చయాత్మకుడు గాడ్పుపట్టి. ఇది ముమ్మాటికీ నిశ్చయం. పూర్వకృత కార్యాలచే, పేరూ, నమ్మకం కలిగి, ప్రభువు మెచ్చినవాడు కాబట్టి కార్యఫలం ఇతనిచేతనే కలుగుతుంది. అందరితో చేసిన భాషణం ఇతనితో చేసిన భాషణం వేరుగా వుండటమే ఇందుకు కారణం. ప్రభువు చేసిన పొరపాటు వెలితి రానంత తెలివితో తప్పించాడు. పరిచయ ప్రారంభంనుంచీ పరిశీలిస్తున్నాను. అనుబంధం అధికమైనకొలది హనుమ అగాధమూర్తిగా కనుపిస్తున్నాడు. ఎందుకో నాకు కూడ ఈ మహాభాగునివల్లనే జానకి వార్త తెలుస్తుందని విశ్వాసం కలుగుతూంది. మనఃప్రబోధం వ్యర్థం కాదు." అని భావించి మరొకమారు ఆపాద మస్తకం వీక్షించాడు. ఆ చూపుల్లో "నా సర్వాశలూ, నా సర్వశక్తులూ, నాభవిష్యత్తు నీ మీదనే ఆధారపడివున్నై" అన్న భావం నిండివుంది. తన కార్యార్థం పోతున్న పావని విజయుడై రావాలనుక, తనలోని శక్తులను అతనిలో ప్రతిక్షేపించాడు. సాదర పూర్వకంగా దగ్గరగా రమ్మన్నాడు. సన్నిహితుడైన హనుమను స్పృశించి "పూజ్యుడా! ఇదిగో ముద్రిక. దీనిపై నా నామాక్షరాలున్నై. ఇది సీతకు శంకా నివారణంచేసి నీవు నా దూతవని నమ్మకం కలిగిస్తుంది. లేకపోతే చెప్పవలసిన చాటుమాటలు చెప్పు. ఆమె హృదయం తెలియక ఏ పనీ చేయకూడదు. ఈ కార్యానికే కాదు, ఏ కార్యానికైనా నీవే సమర్థుడవని ఆత్మ చెప్పింది. నీ మహిమనే ఆజ్ఞ ఈయలేకపోతే నేనీయగలనా? నీకు మా ఆజ్ఞానుగ్రహాలతో పనిలేదు. నీ సంకల్పం వజ్రతుల్యం. తిరుగులేనిది. ఈ ముద్రిక చూపించిన నిన్ను సీత పుత్రనిర్విశేషంగా వాత్సల్యం వర్తిస్తుంది. ఆమె చెప్పిన వార్తవిని "అన్నీ ఆ విధంగానే నీ పతి ఆచరిస్తాడనీ, ఆపై నిన్ను పరిగ్రహిస్తాడనీ, అంతవరకు కష్టంతో

నైనా నాది వేధిస్తుందనీ" నా పలుకులుగా చెప్పు. ఆమె ఏదయినా ఆనవాలిస్తే అందుకుని రా. ఆ చిహ్నం ఆమె సజీవంగా వుందనీ, నా యుద్ధంకోసం నిరీక్షిస్తున్నదనీ, నాకు కాంతీ, కార్యోత్సాహం కలిగిస్తుంది. ఇదిగో ఉంగరం. గ్రహించు" మంటూ కుడిచేతి అనామికాంగుళి నుంచి నవరత్నఖచిత కాంచనాంగుళీయం తీసి, అంగుష్ఠ, తర్జనుల మధ్య పట్టుకున్నాడు. హనుమనయనాలు నిమీలితాలై వున్నాయి. హస్తద్వయం అంజలిఘటించింది. రాముడు ముద్రికలో తారకం, జగత్తారకం, సంసారసాగరోత్తారకం, ఈషణత్రయతాప నివారకం, మోక్షలక్ష్మీ విహారక్షేత్రం అయిన ఓంకారశక్తిని పూరించి, కోటానుకోటి శక్తి కోటుల కామితార్థ ప్రదాతగా దీవించి అంజలిలో వుంచాడు. హనుమ దేహం సహస్ర భానుమండలోదయ ప్రభాభాసురమైంది. అమూల్య రత్నాంగుళీ రంజితమైన అంజలి కనులకద్దుకొనబడింది. మూర్ధంపై పెట్టుకొనబడింది. పులకితమై రామచంద్రపద పంకజాల చెంత శిరః పురస్సరంగా చేయబడింది. జడ చైతన్య విశ్వం పులకరించింది. సమస్త వానరలోకం భక్తిలో పరవశించింది. రామలక్ష్మణ సుగ్రీవనయన మేఘం ఆనందాశ్రుధారం వర్షించింది. ముక్తాప్రాకారం ప్రకృతిసిద్ధమైంది.

## వానరులు సీతను వెదకబోవుట

రంగస్థల దృశ్యం మారింది. సుగ్రీవుడు వానరసంఘం చేరించి "కపివీరులారా! ఇక మీ నియుక్త కార్యార్థులై పొండి. మాసం గడవకుండా రండి. మీవారి కుశలవార్త తెండి. సీతాదేవికి ప్రియం కూర్చండి. మానవ కార్యం సాధనం చేసేందుకు కీర్తిపొందండి. విజయీభవ." అంటూ ఆదేశించాడు. కడలి పొంగులారినట్లు కపిపుంగవులు కార్యోన్ముఖులైనారు. వినతుడు ప్రాగ్దిశకూ, పశ్చిమదిశకు సుషేణుడూ పయనించారు. శతబలి ఉత్తరంగానూ, అంగదుడు, హనుమ, తారుడు, జాంబవంతుడు దక్షిణదిశకు బయలుదేరారు. పావని నిర్మలాకాశంలో చుక్కల నడుమ చందమామవలె వానరుల మధ్య వెలిగిపోతున్నాడు. ప్రస్రవణగిరి వర్షం కురిసి వెలిసినట్లయింది. పరిమిత

కపిసేన తప్ప అసంఖ్యాక వానరానీకం అదృశ్యమైంది. తలచిన పని నిర్విఘ్నంగా, ద్విగుణీకృతంగా జరిగినందుకూ, సాధని చేరి శుభ సూచనగా అంగుళీయం ఆనవాలుగా ముద్రికిచ్చినందుకూ, తన యెడ రామచంద్రుడు ప్రసన్నుడైనందుకూ రవిపుత్రుడు బరువుదించుకున్న బాటసారి పగిది నిట్టూర్చి 'అమ్మయ్యా' అనుకున్నాడు. అమాత్యులను కిష్కింధను పాలనార్థం పంపించి, రామసేవకు తానక్కడ నిల్చిపోయాడు. రామలక్ష్మణులు రవిపుత్రుని సాంగత్యంలో దుఃఖం మరచి వర్తమాన భవిష్యత్తులను గూర్చి చేయవలసిన కార్యం గూర్చి చింతనచేస్తూ, మధ్య మధ్య మారుతి ప్రస్తావనతెస్తూ, ఆతని కార్య సాధకమునా చూస్తూ. నగరవాసుల పరిస్థితులు తెలుసుకుని సచివులద్వారా నడిపిస్తూ కాలక్షేపం చేస్తున్నారు. అన్వేషణార్థం వెడలిన అగచరులు "సీతను నేనే తెస్తా, రావణుని నేనే నాశనంచేస్తా" నంటూ, ఉచ్చా వచనాలుచేస్తూ, మహీతలం దండువలె దెసలకు వ్యాపించారు. అరుస్తూ, పండ్లు కరుస్తూ, అద్రులు మ్రోగేలాగా కూస్తూ, తోకలు ఝాడిస్తూ, సింహగర్జనాలుచేస్తూ, పరుగులుతీస్తూ, ఉత్సాహం ఉరకలు వేస్తుండగా అన్వేషణం చేయసాగారు.

"ఇందరెందుకు శ్రమ? మీరింటే వుండండి. నేనొక్కడనేపోయి దైత్యుని దండించి సీతమ్మను తెస్తా"నని ఒక వానరమంటే, "నీవల్ల ఏమవుతుంది? నేను పోతాను. నన్ను చూచి రావణుడు ఆదరించి సీతమ్మ జాడ చెప్తాడు. ఆమెను చంకగొని ఆకాశంమీద వస్తా"నని వేరొక క్రోతి అంటూంది. "మీ కోతలు చూస్తే క్రోతి జాతికే అవమానం కలుగుతుంది. చెప్పినంత చేయటం కష్టం. నేనుపోయి నిర్ఘాతంవంటి నా పిడి గ్రుద్దుతో ప్రక్కడి రక్కసుణ్ణి మూర్ఛలో ముంచి, తెలివి వచ్చేవేళకు జానకమ్మను తెస్తా"నన్నాడు ఇంకొక కపి. "ఆ దుర్మార్గుడు అంత తేలికగా లొంగుతాడా? భూమినీ, పాతాళాన్నీ, ఆకాశాన్నీ కలచి, గాలించి, నిగ్గుతేల్చి, నావాలంతో రావణుని కంఠం చుట్టి, సీతమ్మను చంకనుపెట్టి శతయోజన దూరాన్ని జవంతో అవతరించి తడి ఆరేలోపల తరుణీమణిని సమక్షంలో వ్రాలతా"నని పల్కాడొకమున్మాద ప్లవగుడు. ఈ విధంగా తమ ఏలికలు మెచ్చుకునేట్లు కపులు గర్వప్రకటంచేస్తూ కదలిపోయారు.

# సుగ్రీవుడు తాను భూమి చుట్టిన విధం రామునకు చెప్పుట

ఒకనాడు విశ్రాంతి సమయంలో రాముడు రవి తనూజునిచూచి "మిత్రమా! నీవు వానరులను పంపుతూ దిఙ్నిర్దేశం చేశావుకదా? ఇంత భూమండలం ఎందుకు చూశావు? ఎవరైనా లోకంలో ఏదో కొంతభాగం చూస్తూండటం జరుగుతుందికాని అవనీతలం అంతా అణువణువూ ఇంత స్పష్టంగా, గుణదోష సహితంగా, దిగంతాలవరకూ నీవు చూడటం వింతగానే వుంది. కర్ణానందంగా నీవు చూచింది శ్రవణానందంగా మాకు ఆ గాథ వినిపిస్తావా?" అని అడిగాడు. ఆ ప్రశ్న విని సుగ్రీవుడు "మిత్రమా! ఆ గాథ తలచుకుంటే గుండెల్లో బరువు వస్తుంది. "అంత కాలం ఆపదల్లో ఎలా గడిపామా?" అని ఆశ్చర్యం కలుగుతుంది. మళ్ళీ జన్మ ఎత్తినట్లనిపిస్తుంది. ఆనాటి సంచారం ఒకందుకు జరిగినా, ఈనాడది అనుకోని ప్రయోజనకారి అయింది. చెపుతా వినండి. మన స్నేహ ప్రారంభంలో "వాలితో ఎందుకు వైరం నీకువచ్చిం"దని నీవు అడిగినప్పుడు దుందుభి చరిత్ర చెప్పాను కదా? ఆ సందర్భంలో నన్ను బాధించి వెళ్ళగొట్టిన సంగతి కూడా చెప్పాను. పట్టణంవదిలి పారిపోతున్న నన్ను చాలా దూరం వెన్నంటి తరిమాడు. అతని బారినుంచి తప్పించుకొనటం కోసం నన్నునుసరించి వచ్చిన సచివులతో కలసి పరదేశాలకు పారిపోయాను. ఎవరూ అతనికి భయపడి ఆశ్రయం ఈయలేదు. అప్పుడు నాలుగుదిక్కుల్లో వుండే రాజుల కడకుపోయి నా కష్టం చెప్పుకున్నాను. వారూ ఆదరించలేదు. అనుకూల ప్రదేశం నిమిత్తం అప్పుడు అవనీతలమంతా వెదకాను. ఎక్కడున్నా తెలిస్తే వాలి ప్రాణాలుతీస్తాడు. ఆశ పూర్తిగా నశించింది. ప్రాణత్యాగమే మేలనిపించింది. ఆ సమయంలో హనుమ నన్నుచూచి మతంగమహర్షి శాపంవల్ల వాలి ఋశ్యమూక పర్వతానికి రాడు. వచ్చినట్లయితే వాని శిరం వ్రక్కలై పోతుంది. అది ఇప్పుడు నాకు స్ఫురించింది. ఇంతవరకు, ఆపదలోవున్ననిన్నెట్లా వుద్ధరించాలా? అన్న ఆలోచనా పథంలోనే వున్నాను. గత్యంతరం కానరాని సమయంలో స్మృతికి వచ్చింది. బ్రదికివుంటే శుభంపడయవచ్చు" అని చెప్పాడు. అది విని నాకూ ఆ సంగతి గుర్తువచ్చి

అయ్యో! ఫలితంలేని బాధలు పడవలసివచ్చింది. ఇకనైనా ధరణీ ధరంమీద తలదాచుకుందామని ఇక్కడకు వచ్చాం. తరవాత నీ ఆదరానుగ్రహాలను పొందేవరకూ ఇక్కడనే వుంటున్నాం. అప్పుడు చేసిన భూసంచారంలో ఇవన్నీ చూశాను." అని చెప్పాడు.

## వినతాదులు సీతను కానక వచ్చుట

సీతాన్వేషణకై పోయిన వనచరులు, దుర్గాలు, అద్రులు, నగరాలు నదులు, సరస్సులు, నదము. పొదలు, అడవులు పగలల్లా వెదకి, రాత్రి వేళ ఒకచోట గూడి, కందమూలాలు, పండ్లు భక్షించి ఉదయం యథా ప్రకారం వెదుకుతూ దిగంతాలదాకా పోయారు. ఎక్కడా సీత జాడ తెలియరాలేదు. చేసేదిలేక, దిగులుపడి, భయపడి వెనుదిరిగి నెల ముగిసేనాటికి, తూర్పు పడమర ఉత్తరదిశలకు పోయిన వినత సుషేణ శతవలులు తమ సైన్యంతో ప్రస్రవణగిరి చేరారు. ప్రభువునుగాంచి తమ పర్యటనానుభవాలు విన్నవించి జానకిజాడ తెలియలేదని తెలుపు కున్నారు. సుగ్రీవుడు ఈ దిక్కుల్లో ఆమెజాడ తెలియదని ముందే తెలి సినవాడు కనుక, వారినందరినీ యథాగౌరవాలతో సత్కరించి ఆజ్ఞ ఇచ్చేవరకూ స్థలాలకు పోవద్దని కట్టిపెట్టాడు. ఉదారుడూ, ధీరుడూ సత్త్వరుల ముందువాడూ అయిన మారుతి దక్షిణాపథమై పోయి గడువు గడచినా తిరిగిరానందున, అన్వేషణలో అంతరాయం కాక, కడముట్టక పోవటంకానీ జరిగి వుండవచ్చుననీ, ప్రధానమైన దిశ అదే కనుక అదంతా రాక్షస రక్షితం కనుక, వాళ్ళంతా మాయావులు కనుక మర్మ భేదనం చేసుకుంటూ, అన్వేషణచేయాలె. పైగా సముద్రం నూరుయోజ నాలు లంఘించి లంకాన్వేషణం చేయాలె. ఆయువుపట్టంతా అక్కడే వుంది కనుక ఆలస్యం అవుతుందనీ, జానకీ వార్త తెలియకుండా జగ త్ప్రాణసూతి రాడనే నమ్మకం వుంది కనుక, నిరాశమాని, దాశరథులకు ధైర్యంచెప్తూ మారుతి ఆగమనం కోసం నిరీక్షిస్తున్నాడు. రాముడు గడువు దాటినందుకు చింతపడలేదు. కాలం వ్యర్థంగా పోతున్నట్లుగా భావించలేదు. గడచిపోతున్న ప్రతినిముషం సీతాన్వేషణలో సిద్ధిపొందు తున్నట్లు తలంచాడు. లక్ష్మణుడు భూమ్యంతరిక్షాలు నింపిన వాయు.

తనూజుని వానరాకారం ఆత్మసమాధిలో దర్శించి అతను ఆకాశంలో పోతున్నట్లు కనుగొన్నాడు.

## హనుమంతుడు అంగదాదులతో వింధ్యలో సీతను వెదకుట

మారుతి తారాంగద సంగతుడై దక్షిణదిశ పయనించి, చెట్టు చెట్టు, గుట్ట గుట్ట, పుట్టపుట్ట, గుహలు, కారడవులు, కొండలోయలు, నదులు, నదాలు, భూరంధ్రాలు విడువక పరిశీలిస్తూ వింధ్యాద్రికి చేరారు. పండ్లు మెక్కుతూ, నీరు గ్రోలుతూ ఆకలిదప్పుల పాపుకుంటూ, అగచరులు ఆచోటంతా వెదకారు. ఆపైకిపోయి, ఆకులు, పూలు, పండ్లు లేని చెట్లూ, నీరులేని ఏరూ, ఏనుగులు, దున్నలు, పులులు, సింగాలు, పక్షులు కనబడక పాడుపడిన విశాల ప్రదేశం చూశారు. అది ఒకనాటికాలంలో విపినిగా మృష్టదేశంగా, అగాధపేగ నదీజలపూర్ణంగా, అనేక భయంకర మృగ సంకులంగా మహారణ్యాకారంతో వుండేది. కండుమహర్షి షోడశ వర్షప్రాయుడైన తనకొడుకు ఆ అడవిలో తప్పిపోయి మరణించినందుకు ఆగ్రహించి శపించిన కారణంగా దానికి ఆ గతి పట్టింది. అక్కడ వెదకి నిరాహారులై, మరొకచోటికి పోతుండగా, దారుణకాయుడైన దనుజు డొకడు తారసిల్లాడు. వానినిచూచి వనచరులు దృఢముష్టులై నిలుచున్నారు. ఆ రాక్షసుడు "ఎవరురా మీరు? వానరసిద్ధులు నాకంట పడ్డారా? చంపుతా చూడం"డని ముష్టి బిగించి పైబడినాడు. అతడే రావణుడేమో అని భావించి, అమాంతం లంఘించి అంగదుడు అరచేతితో దవడపై చరచగా పండ్లూడి, నెత్తురుగ్రక్కి భూపతితుడైనాడు. రావణుడంత దుర్బలుడు కాడనీ, వీడు సామాన్య రాక్షసుడనీ తలచి, ఆ ప్రదేశం అంతా చూచి, వేరొక అడవిలో చొచ్చి అక్కడా జాడ తెలియక పెనువృక్షం నీడచేరి అంతా విశ్రాంతి పొందారు. వారిలో నిరుత్సాహం నిండిపోయింది.

## అంగదుడు కపులను ఉత్సాహపరచుట

కాలం దొర్లుతున్నా కపులు కదలకమెదలక ఉన్నచోటనే ఉన్నారు. వారి వదనాల్లో కళలేదు. ఉత్సాహంలేదు. ప్రాణాశలేదు. చలనం లేక పడిఉన్నారు. అప్పుడు మహామతిమంతుడు, సువిక్రాంతుడు,

# హనుమదాదులు ఋక్ష బిలం ప్రవేశించుట

హనుమంతుడు తారాంగదులగూడి, సింహశార్దూలాలుండేగుహలు, ఆ వనాలు, శిలలు, గుహలు వెదకి, కొండకొమ్మును చేరేసరికి గడువు దాటింది. అన్యోన్య నికటవర్తులుగా, మైందద్వివిదాంగదగజ సుషేణ గవయ గవాక్ష శరభ గంధమాదనులను నిల్పి శైలజాలావృతమైన శమన దిశను గలుగు దేశాలు రోయగా క్షుత్పిపాసలు అంతకంత ఎక్కువై సొమ్మసిల్లి నీళ్ళకోసం వెదుకుతుండగా, తీగలచే కప్పబడి, దానవులచే రక్షింపబడుతున్న బిలం చూచారు. ఆ బిలంలోనుంచి తడిసిన రెక్కలతో, పద్మపరాగ రక్తాంగకాలై, క్రౌంచసారసహంస చక్రవాక పక్షులు వెలికి రావటం చూచారు. చేరువకేగి పరిశీలించారు. ప్రసూన సంతాన సురభిళంగా వుండికూడా చొరశక్యంకానికి విస్మయ వ్యగ్రచిత్తుడైనాడు. దాహపీడితులైన కపులందరూ ఆ బిలాన్ని చూచి దీర్ఘ నిశ్వాసంవదలారు. వనకోవిదుడైన పావని కపులకంటాడు “దక్షిణభాగంలో వున్న వనాలన్నీ చూచాం. జానకీమాత జాడ తెలియరాలేదు. ఆకలిదప్పులతో అలసిపోయి వున్నాం. ఈ బిలంలో నుంచి జలసిక్తపక్షాలతో జలవిహంగాలు వెలికి వస్తున్నై. లోపల కూపమో, సరస్సో, తటాకమో తప్పక వుంటుంది. బిలముఖంలో పచ్చని వృక్షాలున్నై. మనం ఈ బిలంలో ప్రవేశించి కడుపార నీరు గ్రోలి, పరిశ్రాంతులమై ముక్కి వద్దాం.” అనగానే అందరూ అగాధ భూవివరం లోపలికి ప్రవేశించారు. పథమధ్యంలో, సింహశరభ శార్దూలాది భీకర మృగాలనూ, సారంగ శశమార్జాలాది సాధుసత్వాలనూ, బహువర్ణ పక్షిసంతతులనూ, కాంచి, అద్భుతం పొందారు. వాయువేగమునో వేగాలు కుంఠితంకాగా, తొందరతొందరగాపోతూ, ఒక కపి చేలు ఇంకొక కపి పట్టుకొని, దిక్కు తెలియక, లక్ష్యంలేక, అలసటతో మతి తప్పి, జీవితాశలుమాని, చేవదొరగి బిలాప్తులై యోజన దూరంపోయారు. ఆ దేశం ప్రకాశాభిరామంగా, పాదపశ్రేణులు, కాంచనప్రాయములు, రాగరంజితములు అయిన కర్ణికార రసాల తమాల చంపక నాగవంజుల కకుభ పున్నాగ తరులతో వెలుగొందుతూంది. రజత స్తంభాలు, రత్నకిసాలములూ, లలిత పద్మభూషణ భూషితాలూ, విదూరజకృత వేదికలూ, తరుణారుణ విలసనాలూ అయిన బంగారు వృక్షాలపై బంగరురంగు పక్షులు నిండుగా నిండి

వుంది, పసిడిచేపలూ, పసిడి తాబేళ్ళూ, నిర్మలజలంతో ఈదులాడుతుండే కన్నుల కరువుతీరుస్తూ కాసారాలు కనుపించినై.

ముత్తెములతో హర్మ్యసజాలయంతో అపరంజిగవాక్షాలు వింతలీనగా, పసిడి, వెండి, మణులతో శిల్ప చాతుర్యం వెల్లివిరియుండే సన్నద్వారాలతో, హేమప్రాసాద సంతతి కనువిందు చేసింది. పవడపు చెట్లు, మణి స్ఫటికకాంచనాసనాలు, అపరంజిరేకు తీగలు అమరించిన పాదుకలు కనుపించినై. స్వర్ణ రజత కాంస్య భాజనాలూ, అగరు చందన సారాలూ, భక్ష్యభోజ్యాలూ, ఫలాలూ, పానీయాలూ, తీయతీయని తేనెలూ, దివ్యాంబర కంబళాజిన సమూహాలూ, అందందు అగ్నివలె వెలిగే పసిడి రాసులూ, కపులు చూచారు. నిరాశా నిస్పృహల నడుమ ఆశ్చర్యచకితులైనారు.

## హనుమంతుడు స్వయంప్రభతో సంభాషణచేయుట

ఇంకా ముందుకుపోగా, చీరకృష్ణాజినాంబరధారిణి స్త్రీ మూర్తి గోచరించింది. ఆమెనుగాంచి త్రస్తచిత్తులై వానరులు దూరదూరంగా నిల్చున్నారు. హనుమంతుడు సమీపించి, భయభక్తితో ప్రణామంచేసి, "అమ్మా! నీవెవరవు? ఈ బంగారం, ఈ బిలం, ఈ మణుల మందిరాలు ఎవరివి? మేం ఆకలి దప్పులతో అలమటనులై, కన్నులు చీకట్లుక్రమ్మగా, ఈ బిలంలోనుంచి తడిసిన రెక్కలతో పులుగులు వస్తుండే జలార్థం ఇందులో ప్రవేశించాం. ఇక్కడి ఈ వింత ప్రకృతి కని నివ్వెరపడ్డాం. ఈ ప్రదేశమంతా బంగారుమయంగా వుంది. పక్షులు, వృక్షలతాక, జల చరాలు సైతం బంగారంతో మెరిసిపోతున్నై. ఏ మహాత్ముని తపోబలం వల్ల ఈ అనూహ్య జగత్తు ఇక్కడ నిర్మాణమైంది? తాబేళ్ళూ, చేపలూ కలిసి తిరుగుతున్నై. నిన్నూ, నీ మహిమనూ మాకు తెలిపి, విరాగులైన తపస్వులకు ఇహలోక సుఖ కారణాలైన విచిత్ర పదార్థ సంచయం ఎందుకు కావలసి వచ్చిందో ఆ వివరంకూడ వినిపించి మమ్మల్ని ధన్యుల చేయవలసిం"దని ప్రార్థించాడు. ఆ మాటలు విని సమాధి చాలించి ఎదురుగా నిల్చిన హనుమంతుని ఎగాదిగ చూచింది. "కపీశ్వరా! నీ వినయ విధేయతలు నన్నెంతో అలరించినై. నా అనుభవంలో ఇంత గాంభీర్య

...తం తపిని కాంచలేదు. మీరు క్షుత్పిపాసలతో మిక్కిలి సోలి ఉన్నారు. కమ్మని ఫలాలు భుజించి, కడుపారా నీరు గ్రోలి విశ్రాంతి తీర్చుకొనండి. పిమ్మట మీ వృత్తాంతం తెలుపుదురు" అని ఫల జలాలను సంకల్పమాత్రంగా సమకూర్చింది.

## స్వయంప్రభ హావనికి ఋక్ష బిల వృత్తాంతం తెలుపుట

ఆ యోగిని అపారకరుణతో అగచాట్లు ఆకలిదప్పుల నుండి విముక్తులైనారు. హనుమంతుడు ఆమెను సమీపించి నిల్చున్నాడు. సాధు నిష్ఠ, సర్వభూత హితాత్మిక, సాధుశీల ఆంజనేయుని కని "వానర పుంగవా! దీనిని ఋక్షబిలం అంటారు. పూర్వం దైత్యులకు విశ్వకర్మగా ప్రసిద్ధిగాంచిన మయుడనే దైత్యవిభుడు దీనిని సృష్టించాడు. ఆతడు దివ్యసహస్ర వర్షాలు తపస్సుచేసి ధాతను మెప్పించి, దనుజ గురువైన శుక్రుని స్వాపతేయమైన శిల్పమంతా వరంగా గ్రహించాడు. ఆ వరబలంతో అపురూపమైన ఈ బిలం కల్పించి, దీనిలో సర్వ కామేశ్వరుడు కావటంచేత, అందానికీ, అనుభవానికీ, ఆనందానికీ పొత్తు కలిపే ఈ చారువనం చేర్చాడు. బహుకాలం ఇందులో భోగాలు అనుభవించాడు. ఒకప్పుడు దేవదానవులకు యుద్ధంరాగా, ఇంద్రుడు వజ్రాయుధంతో మయుణ్ణి వధించాడు. అనంతరం ఆయన కుమార్తె హేమకు సంక్రమించింది. ఆమె నృత్తగీత విశారద. నాకుకూర్మి చెలి. ఇదంతా ఆమె ఆస్తి. నేను బ్రహ్మచారిణినై యోగసిద్ధి పొంది ఇక్కడే దీని కాపాడుతూ, తపం చేసుకుంటుంటాను. నా పేరు స్వయంప్రభ. మేరుసావర్ణికి ప్రియపుత్రికను. ఈ బిలవృత్తాంతం, నావృత్తాంతం ఇది. మీరు ఆహారపానీయాలుగొని సుఖులైనారు కదా? ఇక మీ వృత్తాంతం తెలుపండి. నేనూ వింటాను." అని అన్నది.

## స్వయంప్రభ హనుమంతుని కపులవృత్తాంతం అడుగుట

ఆ యోగిని చెప్పిన అద్భుతగాధ అంతా విన్నాడు. ఆమె కోరిన ప్రకారం తాము వచ్చిన కార్యం యథాతథంగా, క్లుప్తంగా, మారుతి చెప్పసాగాడు. "అమ్మా! మహాతపస్వినీ! మమ్మల్ని మృత్యువువాత నుంచి రక్షించావు. రాజులలో పేరెన్నికకన్న దశరథ పుత్రుడు రామ

చంద్రుని కార్యార్థం వచ్చాం. ఆయన తండ్రి పంపగా, అనుజునితో, భార్యతో దండకాటవికి వచ్చాడు. ఆయనలేని సమయంలో మాయావియైన రావణుడు ఆమెను దొంగిలించి కొనిపోయాడు. ఆమెను వెదుకుతూ, ఋశ్యమూకం చేరాడు. అక్కడ వానరపతి సుగ్రీవునితో చెలిమి కలిసింది. మిత్రసహాయార్థం కపిరాజు పంపగా ఆమెను వెదుకుతూ వచ్చి, క్షుత్పిపాసలకులోనై, ఈ మాయాబిలంచొచ్చి నీ చేత కాపాడబడ్డాం. మేమంతా నీకు కృతజ్ఞులం. నీ మేలుకు మారుమేలు చేయాలని కీశప్రవరులు కోరుతున్నారు. దయతో సెలవిస్తే చేస్తారు." అని చెప్పాడు. ఆమె మందహాసంచేసి, "నాయనలారా! నాకు మీరు చేసే మేలేముంటుంది? ఏదికోరితే అది చేయగలశక్తి నాకుంది. నేను సర్వ కామేశ్వరులం. నాకు కోరికలే లేవు. దారితప్పి వచ్చిన మీకు సుఖంగా గృహంచేరటమే నా కోరిక. మీకేమయినా కోరికవుంటే అది నేను తీరుస్తాను. చెప్పండి." అని అన్నది. అది విని కపులు పరస్పరముఖావలోకనం చేసుకున్నారు. విధి చింతన చేయరావటంతో హనుమంతుడు సద్యః ఫలితార్థంగా ఆమెను కోరుకొనదలంచి "తల్లీ! నిజంగా నీకేమి కావాలి? కోరదగినవన్నీ ఇదివరకేవున్నై. ఐనా కోరికనే ఇయ్యవచ్చిన మహాయోగినివి. నీ వనుగ్రహిస్తే, మేమొకటి అర్థిస్తాం" అని.

## స్వయంప్రభ బిలంనుంచి కపుల విముక్తుల చేయుట

"ప్లవగపుంగవా! అదేమిటో చెప్పు. ఇప్పుడే తీరుస్తాను. సంకోచం ఎందుకు?" అని ఆదరంగా ఆమె అడిగింది. హనుమంతుడు చేతులు జోడించి, "తల్లీ! మా ప్రభువైన రవిపుత్రుడు పంపుతూ మాకు మాసం గడువిచ్చాడు. ఆ గడువు ఈ బిలంలోనే గడచిపోయింది. మేమంతా గతాయుషులం. ఈ బిలంనుంచి మమ్మల్ని మళ్ళీ వెలికిచేర్చు. మాకై మేం పోయేశక్తి లేదు. ఎన్నో పనులు చేయవలసి వుంది. ఏమీ చేయలేక ఇక్కడ చిక్కుపడ్డాం. మాకు పూర్వం వున్న జవసత్వాలు కుంచించుకున్నై. మేమంతా నీ యనుగ్రహానికి పాత్రులం. మాతా! నీ ఇష్టం. నీటముంచినా పాలముంచినా సరే. ఈ బిల రహస్యం ఇన పుత్రుడు కూడా చెప్పలేదు." అని వేడుకున్నాడు. స్వయంప్రభ "వానరు

లారా! క్లిష్టమైన కోరిక కోరుకున్నారు. ఈ బిలంలో ప్రవేశించి శరీరంతో పోవటం సాధ్యంకాదు. మాయాశక్తి పూరితంగా మయుడు కల్పించాడుకదా? అయినా దీనికి మార్గం వేరే వుంది. కన్నులు తెరచి చూస్తూ పోరాదు. మీరంతా కన్నులు మూసుకొనండి. నా యోగబలంతో ఇక్కడనుంచి మిమ్మల్ని ఉద్ధరిస్తాను." అని చెప్పింది. హర్షపులకిత గాత్రులై, మృత్యుముఖంనుంచి సజీవంగా బయటపడ్డట్లు భావించి చేతులతో రెండు కన్నులు ఎవరికివారు మూసుకున్నారు. ఆమె యోగబలంతో నిమేషమైన కపులను భూవివరంనుంచి ఉద్ధరించి "ఇక కన్నులు తెరువండి" అని చెప్పి, ఇదే వింధ్యాద్రి. ఇదే ప్రస్రవణం అనే పర్వతం. అదే అంబుధి. మీ కోరిక సిద్ధించుగాక. నేనిక స్వస్థలం చేరుకుంటాను" అని అంటూ అంతర్ధానమైంది. కన్నులు తెరచి కపులంతా, గతగాధ కలగా భావించి, ఎదుట ఘోరతరంగాభీలమూ, అపారమూ, అభిగర్జితమూ, వరుణాలయమూ, ఘోరమూ అయిన సాగరాన్ని దర్శించారు.

## అంగదుడు గడువుదాటినందుకు విచారించుట

అనంతరం కపులంతా వింధ్య పర్వత పాదతలంలో కూర్చుండి, పూచిన తీగలూ, మాధవీ వనిజాలాలూ చూచి "వసంతం వచ్చింది. ఫాల్గునం గడుస్తూంది. ఎక్కడి కార్తీకం? ఎక్కడి ఫాల్గునం? ఇచ్చిన నెల గడువెక్కడ? మన బ్రతుకెక్కడ? రవిపుత్రుని ఆగ్రహం ఎక్కడ?" అంటూ ఆక్రోశించి స్మృతిహీనులై పడ్డారు. ఆ సమయంలో అంగదుడు వృద్ధులూ, శిష్టులూ అయిన వానర వీరులను నమిపించి ఓదార్పు మాటలతో "ప్లవగపతులారా! మనమందరం రాజశాసనం మేరకు రామ కార్యార్థులమై వచ్చాం. ఒక మాసం బిలంలో గతించింది. కాలాతీతమైందని మనం ఎవ్వరం గుర్తించలేము. ఇంకా వెదుక తగిన ప్రదేశాలు చాలా వున్నై. ఏది కార్యం మీరే ఆలోచించి చెప్పండి." అని అన్నాడు. అంతా మౌనంగా విని వూరుకున్నారు. మళ్ళీ "నీతికోవిదులూ, సమర్థ బంట్లూ, హితాచరణులూ, సమస్త కార్యనిర్వహణ ధూర్వహులూ, ఖ్యాత పరాక్రములూ, రాజాజ్ఞగాని మీరంతా నన్ను పెద్దచేసి జానకమ్మను వెదకటం కోసం వచ్చారు. శక్తివంచన లేకుండా శోధించాం. మరిప్పీవల్ల

మాయా బిలంలో దారి దాపు తప్పి కన్నులొట్టపోయినట్లు ఎట్లో బయట పడ్డాం. ఇంత చేసినా అకృతార్థులమైనాం. మరలిపోతే శకలీకృతమస్తకుల మవుతాం. తీవ్రకరుస్సుగ్రీవుని శాసనం తీవ్రం కదా ? నాకు తోచిన యోచన చెపుతున్నాను. ఇష్టమైతే చేయండి. కష్టమైతే మానండి. మన కందరకూ ప్రాయోపవేశం ఒకటే పరిష్కారమార్గం. అన్య మార్గం నాకు తోచటంలేదు.

## అంగదుడు ఖేదోపహోక్తులు పల్కుట

మన ప్రభువు స్వభావంచేతనే తీక్ష్ణుడు. పైగా ఇప్పుడు రాజు. రామపత్ని వార్తను కొనిపోకుంటే అపరాధం మోపి అసువులు తీస్తాడే కాని క్షమించడు. ఆ విధంగా చావటంకంటే ఇక్కడ మనమే చస్తే మంచిది. ఇక్కడ మనంమాత్రమే చస్తాం. అక్కడికిపోతే ధనదార సుతాదులతో కలిసిచస్తాం. ఆయువు ఉన్నంతవరకు వాళ్ళయినా బ్రతుకుతారు కదా ? ఈ యువరాజ పట్టం ఇచ్చింది. నా పినతండ్రి కాదు. గుణభద్రుడైన రామభద్రుడు. పూర్వ వైరం తలచుకుని సమయం దొరికినందుకు నన్ను చంపితీరుతాడు. నా అనంతరం బ్రతికినవాళ్ళు మిత్రులు వగవటం ఎందుకు? పుణ్యప్రదమైన సాగరసన్నిధానంలో ప్రాయోపవేశంచేసి ప్రాణాలు విడుస్తాను." అని చెప్పాడు. ఆ పల్కులాలకించి కపులంతా కరుణరసం పొర్లగా దుఃఖించసాగారు.

## అంగదుని వాక్యాలు వనచరులంగీకరించుట

ఎట్టకేలకు తెప్పరించుకుని కపులైకకంఠంగా "మనరాజు కఠోర స్వభావుడు. అన్నంతపనిచేస్తాడు. దయగలవాడైనా రామచంద్రుడు సతిబాసిన శోకంతో ఉదాసీనంగా ఊరుకుంటాడు. ఆయన దృష్టికైతే మనలనందరినీ చంపుతాడు. అపరాధంచేసి ఎవరూ ప్రభు సన్నిధానానికి పోరాదు. ఓపిక ఉన్నంతవరకు వెదుకుదాం. ఆమెవార్త తెలిస్తే కిష్కింధకూ, తెలియకపోతే సంయమనికీ పోదాం." అంటూ అన్నారు. వెనువెంటనే తారుడులేచి "ఎందుకు విలపిస్తారు? ఎందుకు భయపడతారు? క్షేమంగావుండే ఉపాయం నేను చెపుతా. ఇప్పుడు మనం

వచ్చిన బిలంలోనికి పోదాం. అక్కడే వుందాం. ఆహారపానీయాలకు లోటులేదు. ఆమె మనమంటే ఎంతో ప్రీతి చూపుతుంది. ఈ బిలం సంగతి సుగ్రీవునికి కూడా తెలియదు. అందులోవుంటే లక్ష్మణుడుకానీ, రాముడేకానీ, ఇంద్రుడేకానీ రాలేరు. ఏమంటారు? మన మిక్కడ సుఖంగా వుంటాం. మన వాళ్ళంతా అక్కడ సుఖంగా వుంటారు." అని పక్కి రాయడు కూర్చున్నాడు.

## హనుమంతుడు అంగదుని సమాధానపరచుట

అంగదుని హితబోధా, కపుల సమ్మతీ, వారిని సమస్తా హనుమ గుర్తించాడు. వయసులో చిన్నదైనా వ్యవహారంలో అంగదుడు వాలి అంతటివాడని గ్రహించాడు. మున్ముందు వాలిని సాయంతో రవి పుత్రుని రాజ్యం అపహృతమవుతుందని ఆశంకించాడు. పద్నాల్గు గుణాలూ, అష్టాంగాలూ కలిగిన మేధావిభవం, బలసంపద, మైత్రీ సంపాదనాచతురత్వం సమృద్ధిగావున్నవాడని మెచ్చుకున్నాడు. శుక్లపక్ష సుధాంశునివలె దినదిన ప్రవర్ధమానమవుతున్న తేజంగలవాణ్ణి, జనక తుల్యుని, బుద్ధిలో బృహస్పతివంటివాణ్ణి, శుక్రనీతిని వినే ఇంద్రునివలె తారుని మంత్రాంగానికి చెవి ఒగ్గేవాణ్ణి సర్వశాస్త్ర విశారదుని స్వామికార్యంలో విముఖత కలవాణ్ణి అంగదుణ్ణి సమీపించాడు. తారాంగదుల మాటలకు అనుకూల ప్రతికూల వాదాలతో తర్జన భర్జనలు చేస్తున్న కపులను చూశాడు. అంగదుడు ప్రయోగించిన భేదోపాయం బాగా పని చేసిందనీ, కార్యభంగానికి కారణమైనదనీ విషయం, మొలకలోనే త్రుంచాలికాని ముదిరితే ప్రమాదమనీ, కోపంతోనూ, ఉపాయంతోనూ కూడిన పలుకులు భీషణ ఘోషణంగా, "అంగదా! తండ్రికి మించిన యోధుడవు. తండ్రివలె కపిరాజ్యం పాలించే నేర్పు కలవాడవు. నీవు కూడా నీ తండ్రివలనే పొందదగ్గ కలవాడవు. నీవు వీరంతా సర్వనాశనానికి ప్రయత్నిస్తున్నావా? అస్థిర స్వాంతులు. గోడమీది పిల్లులు. వీరి సహాయ సంపత్తి ఎంతకాలం? పెళ్ళాం బిడ్డల వదలి నిన్ను నమ్మిస్తూ కొండగుహలో వుంటారా? వారికింత ఎందుకు? ఎదుటనే విప్పి చెప్తాను. సుహోత్రుడూ, జాంబవంతుడూ, నీలుడూ సుగ్రీవుణ్ణి ఏవిధంగా విడువరో నేనూ ఆ విధంగానే ఆలేనిని

విడువను. నీ రాజనీతి చపలత్వంతో మున్ముందెన్నడూ వశపరచుకోలేవు. అది నీ తండ్రికే సాధ్యం కాలేదు. బలహీనుడితో పగ పెంచుకుని బలవంతుడు బ్రతుకగలడుగాని, బలవంతుడితో బలహీనుడు పగబట్టి బ్రతుకగలడా? రాముడు బిలంలో సురక్షితంగా వుండవచ్చుని చెప్పటం విన్నాను. ఇది ప్రవంచనం. రాజాజ్ఞాతిక్రమణం. ఇది నీపోటికి తగదు. ఇది స్వార్థం కోసం ఇతరులు నేర్పితే, నీవే రాజువైతే నీ పట్లకూడ అదే ప్రయోగిస్తారు. మీరు బిలంలోకాని పృథ్విలో ఎక్కడ వున్నా లక్ష్మణుని ఉగ్రశరాగ్ని కింధనంకాక తప్పదు. ఇంద్రుడు మాయాబిలాన్ని వదలి మయుణ్ణి మాత్రం చంపి తెలివితక్కువపని చేశాడు. లక్ష్మణుడు మీతో పాటు బిలాన్నికూడా తగులబెడతాడు. ఆయన అస్త్రపాటవం మీకేం తెలుసు? రామచంద్రుడే అతడు. రూపభేదం మాత్రమే. బిలంలో దాగి బలంతో పినతండ్రిపై పగతెచ్చుకున్నావంటే, కాలక్రమంలో నీ దుర్బలత్వాన్నీ, నీ అసహాయతనూ చూచి, ఆబద్ధిస్థలంపై వెంగలోనూ, అన్యోదకాలకు మొగంవాచి అర్థాంతరంగా నిన్నువదలి కపులంతా వెళ్లిపోతారు. నీ శ్రేయస్కాములూ, హితులూ, బంధువులూ విడిచిపోతే, మతిచెడి సదాగతికి పడికే తృణంలాగా అయిపోతావు. స్వామిద్రోహివైన నిన్ను సుగ్రీవుడు మన్నించినా లక్ష్మణుడు మన్నించడు. అతడు నీపట్ల ఎంతో ప్రేమతో వున్నాడు. అన్నదమ్ములు ధర్మాత్ములు. ముందుకాలంతో నీకపకారం రాకుండా శాస్త్ర సమ్మతంగా, బంధుహితంగా పౌరామాత్యుల సమక్షంలో యువరాజ పట్టం కట్టించాడు. కుటిలుడవై సుగ్రీవుడు ద్రోహం చేస్తే మేం మన్నిస్తామా? ఆ పూజ్యభ్రాతలు మన్నిస్తారా? ద్రోహచింత మాని, రామకార్యం పూర్తి చేసి కపులలో ఖ్యాతి పాత్రుడవుగా కీర్తినిక్కై కొమ్ము." అని చెప్పాడు. ఆ పలుకులు కపులంతా విన్నారు.

## అంగదుడు సుగ్రీవుని గుణాలను నిందించుట

ఆ బోధ అంగదుని మార్గం మార్చలేకపోయింది. ఆగ్రహం తెప్పించింది. హనుమంతునిచూసి "ఆర్యా! నీవు నా హితంకోరి చెప్పినవన్నీ నిజం. నేనెవరిపై పగపెట్టుకోలేదు. రవి పుత్రుని గుణాలనుగూర్చి నీవు

నమ్మకమంత నే మనస్సులో. నీవాగ్రహిస్తే నన్నేంచేయలేను. నీవుచెప్పినట్టు ఉంటాను. నేను శక్తిహీనుణ్ణి. నీవు మహానుభావుడవు. నిజం చెప్పవలసివస్తే నీ మొగంచూచి నా మనస్తృప్తికి మేలు చేశావేకాని ఆయన మాటలు విశ్వసించినావు. ఆయనలో ఉన్న మంచిగుణాలేమిటి? సౌందర్యం, శౌచం, ఆర్జవం, ఆశ్రితరక్షణం, శౌర్యం, పరాక్రమం ఆతనికి లేవు. దీనయుక్తుడైన అన్నవాక్యాలు, మాతృదేవతపంపినాన్ని గ్రహిస్తాడా? బిలంలోకి పోతూ బయట కాపుండమంటే బండరాతితో బిలంమూసి కిష్కింధకు వచ్చి జరిగిన సంగతి చెప్పకుండా నాస్తాడా? చేతిలో చేయివేసి ప్రమాణంచేసి, నీ తిరింతర్వాత పానమత్తుడై కార్యం మరచి, హెచ్చరించవచ్చిన సౌమిత్రిని అవమానించి, ఆడువానివాటున బ్రతికమూసినవాడు గుణవంతుడా? కృతజ్ఞుడా? సత్యవ్రతుడా? ధర్మాత్ముడా? విశ్వాసపాత్రుడా? అన్వేషణార్థం మనుష్యుల్ని పంపటం సౌమిత్రి భయంతోకాని బుద్ధిపూర్వకంగా కాదుగదా? నేను నాలుదనే కావచ్చు. మీరు పెద్దరే కావచ్చు. నేను మీరంగీకరించిన యువరాజునేకదా? ఈ దండన నీవు చెప్పేవరకూ నాయుకలప్పం నాకిచ్చాడా? స్వామీ! నేనాతని నమ్మను. అతడు చలచిత్తుడు. దుష్కుడు. మధుపానమత్తుడు. క్షుద్రస్వార్థుడు. నేనాతని పాలనలో ఉండలేను. మీరెంతకాలం నన్ను రక్షిస్తారు? జీవించినంతకాలం మరుల అనుగ్రహంపై ఆధారపడివుండటం నాకు నచ్చకతంటాడు. ఏదో యుక్తిపన్ని నాతలతీస్తాడు. అతని బిడ్డలకు రాజ్యం అప్పగించక నాకప్పగిస్తాడా? ఏతంత్రీ అవిధంగా చేయలేదు. నా మనస్సులోని భావం అంతా నీకు చెప్పాను. నీవాతని మిత్రుడవూ, అమాత్యుడవైనా స్వతంత్రుడవు. ఇంద్రియజేతవు. నిష్కపటివి. ధర్మచింతనుడవు. సత్యవాదివి. నేనింతవరకు రాజుపట్ల ద్రోహం తలపెట్టలేదు. ఇకముందు తలపెట్టను. నేను జీవించి తల ఎత్తుకుని తిరగాలని రక్షించేప్పుడుంటే మార్గం నాకు దొరుకుతుంది. అనుపుర్ధుడనై పోయి అతని మరాగ్రహానికి ఆహూతికాను. గడువు దాటివస్తే ఖండిస్తానని ముందే చెప్పాడు. కనుక ఆమాటవాటున ఆతని అధర్మప్రవృత్తి ధర్మంగా మారుతుంది. నాకై నేనే రామకార్యంలో ప్రాణత్యాగం చేస్తే పుణ్యలోకాలైనా ప్రాప్తిస్తై. వనచరులారా! నా నిర్ణయం ఇది. ఇకనేను రాను.

# సంపాతి అంగదాదుల చూచుట

కొండలు ప్రతిధ్వనిస్తున్న గోలకు సంపాతి ఉలికిపడి కన్నులు తెరచి చూచాడు. కొండ బిలంలోనుంచి బయటికి వచ్చి చూచాడు. నేల ఈనినట్లు వానరులు శోకిస్తూ, ధర్మపాలనార్థం దర్భలపై ప్రాయోపవేశం చేయటం గోచరించింది. ఇంత కపికోటికి ఈ అకాల మరణకారణం ఏమిటో తెలుసుకోవాలని బుద్ధి కలిగింది. కొండ దిగి వాలున్న చోటికి మెల్లమెల్లగా చేరవచ్చాడు. వృద్ధుడనైన నాకు ఆహారం దైవం కూర్చాడు. లేకపోతే ఇందరిక్కడికి ఎందుకు వస్తారు? ఈ కోతులను దినమొకటిగా తింటాను. దైవం దుర్బలులకు రక్ష కదా? ఆకలితో పోతున్న నా ప్రాణాలను నిల్పటం కోసమే దగ్గరగా ఈ కపులను దైవం తెచ్చాడు అని బిగ్గరగా అంటూ సమీపించాడు. అది విన్న అంగదుడు ధ్యాననిష్ఠుడై వున్న హనుమంతుని పిలిచి "ఆహారార్థం వచ్చిన ఈ భయంకర పక్షిని చూచావా? సీతాన్వేషణం మాని శ్రీరాముని కపచారం చేసినందుకు యముడు కోపించి ఈ పక్షిరూపంలో వచ్చాడు. మేం ప్రాయోపవేశ దీక్షలో వున్నాం. అస్త్రశస్త్రాలు ధరించరాదు కదా? నీవు తప్పించుకుని మాకు సహజమరణం కలిగేటట్లు చూడు" మని గట్టిగా అరిచాడు. "పావనీ! రామకార్యం చేయలేము. రాజాజ్ఞ నెరవేర్చలేము. ఇంతలో ఈ కీడు దాపురించింది. జానకికి ఆ పాడు రక్కసుడు ద్రోహం చేసి, దొంగవలె కొనిపోతుంటే ఆమె రక్షణకోసం జటాయువు అనే పక్షిరాజు పోరి ప్రాణాలు వదిలాడు. ఆమె కోసం ఆ మహాత్ముడు ప్రాణాలు విడిస్తే, ఆయన కోసం మనం ప్రాణాలు విడుస్తున్నాం. స్నేహ దయలు కల్గి పశు పక్ష్యాదులైన జీవకోటి రాముని కోసం ప్రాణపరిత్యాగం చేస్తుంటే మనం కూడ శక్తివంచన లేకుండా తోడ్పడదామని శైలకానన నదీనదాలన్నీ వెదకి చివరకు జీవాంతానికి సిద్ధపడి ప్రాయోపవిష్టులమైనాం. ఇంకా చావుకు వగపెందుకు? జటాయువులాగా మనం కూడా చావటం మంచిది. మనకంటే జటాయువే అదృష్టవంతుడు. ఘోర యుద్ధంలో రావణునిచే ఖండిత పక్షుడై, రామునిచే దహన సంస్కారాలుపొంది ఉత్తమలోకాలు చూరగొన్నాడు. అతనికి కాలనిర్ణయం లేదుకనుక కపిపతి భయం వంటి భయంలేదు. కైకేయి వరాలు, దశరథుని మృతి, రాముని అరణ్యవాసం,

జటాయువు చావటం, సీతాపహరణం, సుగ్రీవాజ్ఞ కలసి మనకు జీవన్మరణ సమస్య సృష్టించినై" అని చెప్పాడు.

## సంపాతి అంగదాదులతో భాషించుట

దర్భశయనులై చావసిద్ధంగావున్న సమయంలో సంపాతి రావటం, ఆహారంగా తమ్ము కైకొనసెంచటం తలచి ఆక్రోశంతో అంగదుడాడిన పల్కులువిని సంపాతి సకరుణంగా వారితో సంభాషించసాగాడు. "ఎన్ని దినాలకు తమ్ముని పేరు విన్నాను. వాడు నాకు ప్రాణాలకన్నా అధికుడు. అతడు మరణించిన వార్త విని నా మనస్సు శోషిస్తూంది. దండ కాటవిలో రావణునికీ, వాడికీ ఎందుకు సమరం జరిగింది? ఆ సంగతి ఎత్తి వేస్తున్నావు వాడికి సీతా అనుబంధమేమైనా వుందా? చెప్పు. వానరా! ఈ పర్వతం నుంచి నన్ను దింపండి. అతని సుగుణాలను మీ నోళ్ళ బహుకాలానికి విన్నాను. సీతాపతి తండ్రి దశరథునకు అతడు సఖుడెట్లా అయినాడు? ఖరకరుని కరదీప్తులచే దగ్ధపత్రుడను కావటంచేత దిగిరాలేక పోతున్నాను. ఆ కథంతా వినాలని వుంది. మీకు ఈ ముసలిపక్షిపై దయవుంటే మీరున్నచోటికి నన్ను చేర్చండి." అని పల్కాడు. అంగదుడు ఆ మాటలాలించి, ప్రాణాపాయం ఎవడి వల్ల వస్తుందని ఎంచాడో, వాడే తన సాయం కోరటం భగవదనుగ్రహంగా భావించాడు. కపులనుద్దేశించి "గృధ్రపతిని మీరేగి తీసుకొనిరండి." అని చెప్పాడు. కొందరు "ఇది రాక్షసమాయ కావచ్చు. కాకపోతే మనలను తినటానికివేసిన ఎత్తు కావచ్చు. మీరు పోవద్దు. కోరి మృత్యువును తెచ్చుకోవ"ద్దని అన్నారు. కొందరు "ముసలిగ్రద్ద చావ సిద్ధంగా వుంది. మనలనేం చేస్తుంది? అంత మించివస్తే హనుమంతుడు లేడా? భయం ఎందుకు? తీసుకురం"డని చెప్పారు. అంగదుడు "ఆ వృద్ధపక్షి మనలనేం చేయదు. దాని వాలకంచూస్తే మంచిదిగానే వుంది. ఎలాగూ చావబోతున్నాం. అది కోరినకోర్కె తీర్చి ధన్యులం కావచ్చు"నని ధైర్యం చెప్పాడు. వెంటనే కొందరుపోయి పక్షిని కొండ శిఖరంనుంచి క్రిందికి దింపారు. శరీరంలో జవసత్త్వ పాటవాలు నశించి, జీర్ణావస్థలోనున్న పక్షిరాజునుచూచి "విహంగశ్రేష్ఠా! నీ

జరిగిన విషయం వివరిస్తాను విను. బ్రహ్మతో సమానుడైన ఋక్షరజు డనే వరీముఖుడు వానరపతిగా వుండేవాడు. ఆయన అనంత విక్రముడు. సద్గుణాలకు ఆలవాలం. మహాతపస్సంపన్నుడు.

ఆయనకు ఇద్దరు కుమారులున్నారు. వారు ఉగ్రపరాక్రములు. దేవతలను కూడ లెక్కచేయరు. జ్యేష్ఠుని పేరు వాలి. కనిష్ఠుని పేరు సుగ్రీవుడు. జ్యేష్ఠుడైన వాలిపుత్రుణ్ణే నేను. పేరు అంగదుడు. దశరథ పుత్రుడు రాముడు తండ్రి యాజ్ఞమేరకు భార్యాసోదరయుతుడై దండకలో వసించ వచ్చాడు. రామా, తమ్ముడూ లేనిసమయంలో జనస్థానంలో ప్రవేశించి రావణుడు ఒంటరిగా ఆశ్రమంలోవున్న ఆయన అర్ధాంగి సీతను వంచించి కొని పోతుండగా, ఆమె ఆక్రందనం విని దశరథ మిత్రుడైన జటాయువు తలపడి ఘోరంగా పోరు సల్పి రథాన్ని నుగ్గునూచం చేశాడు. మార్గం లేక మాయావి రావణుడు మోసంతో రెండు రెక్కలు ఖడ్గంతో ఖండించి ఆకాశమార్గాన ఆమెతో కూడా పారిపోయాడు. వెదుకుతున్న సోదరులకు కొంత వృత్తాంతం తెలిపి ఆ పూజ్యుడు మరణించగా రాముడు సంస్కరించి పొందరాని వైకుంఠవాసం పొందించాడు. పిమ్మట రాముడు నా పినతండ్రితో చెలిమిచేసి, నా తండ్రిని వధించాడు. స్నేహితుని సాయంతో ప్రభువైన పినతండ్రి ఆయన భార్య సీతను వెదకగా మమ్మ నియమించాడు. మేము దక్షిణదిక్కంతా వెదుకుతూవచ్చి, ఇక్కడ ఋక్ష బిలంలో చిక్కి వెలుపలికి రాలేక గడువుదాటాం. రాత్రిళ్లు భాస్కర దర్శనం కానట్లు మాకు సీతమ్మ దర్శనం కాలేదు. సమయం దాటిపోతే ప్రభువు చంపుతాడు. అందుకని మేం ప్రాయోపవేశం చేస్తున్నాం" అని చెప్పాడు.

## సంపాతి కపులతో జటాయువు తనతమ్ముడని తెలుపుట

అప్పుడు సంపాతి అంగదునిచూచి "ప్లవగవరులారా! నీవు పేర్కొన్న జటాయువు నా తమ్ముడు. రావణునిచే హతుడైనాడని విని కూడ, దగ్ధపక్షుడనూ, మిక్కిలి వృద్ధుడనుగాన వూరకున్నాను. లేకపోతే మిత్రుడు లేకుండా దైత్యుణ్ణి వధించి, తమ్ముని ఋణం తీర్చి, జానకమ్మను రామునిచెంత చేర్చేవాణ్ణి. ఇంద్రుడు వృత్రాసుర వధ చేయక

సంగతీ, దేవదానవ సంగ్రామమూ, అమృతానికై క్షీరసాగరాన్ని మథించటమూ, నేను కనులారా చూశాను. అప్పుడు నేను దేవతలకెంతో సాయం చేశాను. కల్పాంతాలు గడిచినై. పైగా పక్షహీనుణ్ణి. ఇప్పుడు ఇతరులపై ఆధారపడి జీవించవలసి వస్తున్నది. ఒకనాడు ఆహారంకోసం కొండపైనుంచి దిక్కులు చూస్తుండగా, రావణుడు ప్రాయంలో వున్న దాన్ని, కనులవెంట నీరు దొంతరలై కారుతున్న దాన్ని, పెనుగులాడుతున్నదాన్ని, ఒడలిపైనున్న ఆభరణాలను తీసి క్రిందికి పడవేస్తున్న దాన్ని కొనిపోతుండటం చూశాను. గిరిశిఖరంపై భాస్కరకిరణ ప్రసారం వలె, మేఘంలో మెరుపువలె ఆమె కౌశేయం అతనిపై ఎగురుతూంది. ఆమె "రామా, లక్ష్మణా" అంటూ ఏడుస్తూంది. ఆమె ఇప్పుడు మీరు చెప్పిన సంగతులవల్ల సీత అనుకుంటున్నాను. ఆ దైత్యుని సంగతి వినండి. విశ్రవసుని కొడుకు. కుబేరుని తమ్ముడు. పేరు రావణుడు. అతడుండేది లంక. జలధిలో శతయోజన దూరంపోతే ఒక ద్వీపం వస్తుంది. అది పూర్వం దైత్య భర్త విశ్వకర్మ నిర్మించింది. దానినే లంకా ద్వీపం అంటారు. రావణుడు ఆ నగరానికి రాజు. పసిడివాకిళ్ళూ, బంగరు పంచటరుగులూ, కనకగోపురాలూ, కమనీయోద్యానాలు కలిగి ఆకాశం అంటుతూ అతని అంతఃపురం వుంటుంది. అందులో దైన్యంగ నలుపక్ష శోకంలో ఆమె వున్నది. సముద్రం దానికి వెవమిచ్చిన అగడ్త. మీరందరూ సముద్రం తరిస్తేగాని అక్కడ చేరలేరు. ఇక దిగులుమాని ఇక్కడికి దక్షిణంగాపోయి సముద్రందాటి, లంకలో సీత జాడ తెలిసి, రావణునిచూచి కార్యసిద్ధి పొందండి. రండరపదండి. మీకిక ప్రాయోపవేశం, సంహరణం అక్కరలేదు. జ్ఞానదృష్టితో చూస్తే కార్యసిద్ధికలవారై, మళ్ళీ తిరిగి స్వరాష్ట్రం పోతారని తేలింది. నీకింత దూరం చూసేశక్తి ఎక్కడిదని వింతపడవద్దు. ధాన్యంతినే కులింగాది పక్షులకు మొదటిగతి, ఫలాదులు తినే వాయసాలకు రెండవ గతి, క్రౌంచాది విహంగాలకు మూడవగతి, శ్యేనాలకు నాలవగతి, గ్రద్ధలకు అయిదవగతి, చక్రాంగాలకు ఆరవగతి. వైనతేయునికి విశేషగతి విధిబద్ధం. వైనతేయుని సంతతి వాళ్ళం మేము. మేం ఇక్కడనుంచే సీతనూ, లంకేశుణ్ణి చూడగలము. సౌపర్ణ దివ్యాక్షి శక్తి మాకుంది.

సహజంగా తినే ఆహారాన్ని పక్షి బలంతో అనాయాసంగా, నూరామడల దూరంలో వున్నా చూస్తాం. దూరంగావుండే ఆహారం తిని బ్రదకటం మాకు జన్మ సిద్ధమైంది. సమీపంలో వుండే ఆ పని మా గోళ్లే చేస్తై. అది అవసరం అక్కడలేదు. గర్హిత కార్యం చేసి బర్హిష్కృతవైరి అపరాధి అయినాడు. నా తమ్ముని నిబర్హణానికి ప్రతికృతిగా మీ కృతి నిలిచి నిర్మలకీర్తి గడిస్తుంది. జలధి తరించే ఆలోచన చేయండి. తరించి తరుణీరత్నమైన దాశరథి అర్ధాంగిని అన్వేషించండి. “జై రామభద్రా! జై రవిపుత్రా” అంటూ కిష్కింధకు చేరి ఆమె క్షేమం తెలిపి రాముని మురిపించండి. చచ్చిన తమ్మునకు నేను నీళ్ళు విడవాలె. నన్ను సముద్రం వద్దకు కొనిపొండి.” అని చెప్పాడు. కపులంతా ఆతని కోరిక ప్రకారం సముద్రజలంతో సహోదరుడికి తర్పణం చేయించి యథాస్థానం చేర్చారు. జానకమ్మ వార్త శ్రవణ గోచరం కావటంతో కపులు గంతులు వేశారు.

## సంపాతి జాంబవంతునితో సీత వృత్తాంతం చెప్పటం

సంపాతి వాక్ప్రవాహ సంపాతంవల్ల వనచరులు హర్షోత్ఫుల్ల మనస్కులుకాగా, జాంబవంతుడు లేచి వైనతేయునితో అన్నాడు. “ఖగపతీ! నీవు దయతో చెప్పింది విన్నాం. సీతమ్మ జాడ, లంకేశుని వునికీ విన్నాం. కాని వివరంగా బోధపడలేదు. సీత ఎక్కడ వుంది? ఆమెను ఎవ్వరు చూశారు? అపహర్తయైన అసురపతి ఎక్కడ వుంటాడు? ఎంతటి వాడు? నీ మాటలవల్ల అంతా నీకు తెలుసునని తోస్తుంది. మరుగు లేకుండ విషయం వివరించి మాకు హర్షం కలిగించు. ఆ మూర్ఖునికి రామబాణం సంగతి తెలియక పోవచ్చు. ఇక తెలుసుకుంటాడు.” అని. “కపులారా! సీతాపహృతి గురించి నేను విన్నదీ, చెప్పినవాని సంగతీ, ఆమె వున్నచోటూ మళ్ళీ చెపుతాను. నేను రెక్కలు కాలి హీనుడనై ఇక్కడే జీవిస్తున్నానని చెప్పాను కదా? నా పోషణకు సుపార్శ్వుడనే నా కొడుకు తోడ్పడుతున్నాడు. ధాతసృష్టి అగమ్యంగా వుంటుంది. అతికామం గంధర్వులకూ, అతికోపం అహిచయానికీ,

అతిభయం మృగాలకూ, అతిమాత్ర పుష్టి మాకు పుట్టుకతోనే వచ్చె-
ఒకనాడు ఆకలి దహించివేస్తుండే సూర్యాస్తమయందాకా ఆహారాన్వేష-
ణంచేసి మెల్లగా నా ప్రాణాస్తమయ వేళకు కొడుకు తిరిగి వచ్చాడు.
వృద్ధుడనన్నూ కోపనస్వభావుడు కావటంచే నోటికి వచ్చినట్లుగా నిందిం
చాను. అతడు ఆకలిమంటలో అన్నమాటలుగా భావించి, ఇలా అన్నాడు.
నేను మహేంద్ర పర్వతం మీద గోళ్ళతో గట్టిగాపట్టి తలక్రిందుగా
సముద్రంలో తిరిగే జంతువుల కోసం ప్రేలాడసాగాను. ఆ సమయంలో
కాటుక కొండవంటి వాడు ఒక కోమలిని కొనిపోవటం చూచాను.
ఆహారం దొరికిందని నేను సంతోషించి అడ్డుకున్నాను. వెంటనే విన
యంతో దారి ఇమ్మని వేడుకున్నాడు. సరే పొమ్మన్నాను. నీచుడైనా, తన
వద్దకువచ్చి వేడుకుండే అపకారంచేయడు కదా? ఇక నా వంటివాడు ఆ
పనిచేస్తాడా? చెప్పు. తనతేజంతో గగనాన్ని వెంటకొని పోతున్నాడా?
అన్నట్లుగా వాడి దారిన వాడు పోయాడు. వాడు దాటి పోగానే ఆకాశ
చరులు నన్ను చూసి "అదృష్టవంతుడవు. అడుగంగానే దారిఇచ్చి బ్రతికి
పోయావు. ఆ యుక్తుడైన రక్కసి తన దారిలో వాడు పోయాడేకాని,
నీ నిరోధానికి ఓర్చి ఆలోచించాలనుకోలేదు" అని అన్నారు. "మీ
రెవ్వరు? వాడెవ్వడు? ఆ కాంత ఎవ్వతె? నన్ను చంపగల శౌర్య
వంతుడా?" అని అడగనట్లే వాళ్ళను నేనడిగాను. "మేం విన్నాం. అతడు
రావణాసురుడు. రాక్షసుల రాజు. రామచంద్రుని భార్యయైన సీతను
బలాత్కారంగా తీసుకుపోతున్నాడు. రామలక్ష్మణులు వస్తారేమోయన్న
భీతితో నిన్ను దారి వదలగానే వెళ్ళాడు. అతనివెంట తీసుకుపోతున్న
ఆమె సీత" అని ఆహారంతో తిరిగివచ్చిన నా బిడ్డ ఆలస్యానికి కారణం
చెప్పాడు. అది వినికూడ శక్తి లేక ఊరకున్నాను. ఆవిధంగా నాకొడుకు
చెపితే సంగతులు తెలుసుకున్నాను. అవి అన్నీ మీకు చెప్పాను. ఏది
రాముని కార్యమో అది నా కార్యం. మీరు బలవంతులు. మేధావులు.
కపిపతి ఆజ్ఞతో వచ్చినవాళ్ళు. సమరంలో దురాసదులు. దశకంఠుడు
సామాన్యుడుకాడు. మూడు లోకాలను జలధిలో ముంచెత్తగలడు.
అతనితో వైరం దేవతలకేప్రాణగొడ్డమైంది. అయినాజంకవద్దు. దీక్షతో
సాధించరానిదేదీ లేదు. ఇంకొక విషయంకూడా చెపుతా వినండి.

## సంపాతి నిశాకరమునికీ, తనకూ జరిగిన సంభాషణ చెప్పుట

నేనూ తమ్ముడూ ఆకాశం అంటే ఎగురుతున్నప్పుడు సూర్యతాపానికి రెక్కలు దగ్ధమై ఇక్కడపడి ఆరు దినాలు మూర్ఛలో మునిగి, పిమ్మట తెలివిరాగా, దిక్కులు చూశాను. సాగరం, శైలతటినీ సరస్సులు, జలధివేల గోచరించింది. కందరకూట పక్షిగణాకీర్ణమైన దక్షిణాబ్ధితీరం, వింధ్యపర్వతం ఇది అని తెలిసింది. వెనుక ఇక్కడ నిశాకరుడనే ముని ఘోరంగా తపస్సుచేశాడు. అతడు స్వర్గంచేరి ఎనిమిదివేల యేండ్లయింది. ఆ మహర్షి నన్నూ నా తమ్ముణ్ణి ఎంతో ప్రేమగా చూచేవాడు. అప్పుడు నేనున్న మనసులో అతని సాయంగోరి చూడాలని ఎగుడుదిగుడు బండలతో, కరుకూ, మురుకూ కల దారివెంట క్రిందికిచని, వాడి కత్తులవంటి దర్భలున్న ప్రదేశానికి చేరాను. వాసనలేని పూలూ, ఫలించని వృక్షాలూ ఆ ఆశ్రమంలోలేవు. నేనొక చల్లని చెట్టునీడ విశ్రమించి ఆయన రాకకై వేచి వున్నాను. కొంతసేపటికి తాపసుడు స్నానంచేసి, ప్రహ్లాదుడై ప్రాణికోటి వెంటరా వ్యాఘ్రసింహ సరీసృప భుజంగ సంతానం చుట్టిరాగా, రాజు సౌధంలోకిపోతే అమాత్యులు నిష్క్రమించినట్లు ఆయన ఆశ్రమంలోపలికి పోగానే అవన్నీ మరలిపోయినై. లోనికేగిన ముని వెంటనే వెలికి వచ్చి నన్ను చూచాడు. "రెక్కలు లేకపోవటం, ఒళ్లంతా గాయంతో రక్తసిక్తంగా వుండటంచేత గుర్తింపలేకపోయాను. నీవు జటాయువు అన్నవైన సంపాతివికావా?" అని ప్రశ్నించాడు. అప్పుడు నేను జరిగిన సంగతి జరిగినట్లుగా,

## సంపాతి రెక్కలు కాలినవిధం తాపసికి తెలుపుట

"తాపసవరా! ఏమని చెప్పమనేది? మీవంటివారి చెలిమికలిగి కూడా గర్వం కమ్ముకొనుటచేత మా బలాన్ని మేం తెలుసుకోలేక, కైలాస కూటమందున ఋషులు చూడగా, సూర్యుడు అస్తగిరి చేరేలోపల దానిని చేరాలని పందెంవేసి, ఒక్కసారి మింటికెగసి పోతూంటే నగరాలు బండి కంచంతగా కానవచ్చాయి. అక్కడక్కడ వాద్యబ్రహ్మస్వరాలు వినబడ్డాయి. లోహితవాసస్సంగతలైన అంగనలు సంగీతం పాడుతుండే చూస్తూ క్రమంగా రవి మార్గాన్ని చేరాం. అక్కడినుంచి భూలోకంవైపు

చూస్తే అడవులన్నీ పచ్చికబయళ్ళుగా, పర్వత ప్రదేశాలు గులకరాళ్ళు పేర్చిన గుట్టలుగా, నదులు నూలుపోగులుగా, మేరు మందరాదులవంటి మహా చలాలు మడుగుల్లో నిల్చిన మాతంగాలుగా, కనిపించినై. శరీరం స్వేదసిక్తంకాగా, మనస్సు శోకంతో నిండింది. కళ్ళు గిరగిర తిరిగినై. "ఉత్తరం ఇది, పశ్చిమం ఇది" అని దిక్కులు తెలియకుండాపోయింది. అంతా శూన్యంగా తోచింది. ప్రళయ కృశానుకీలా మాలికా దగ్ధమైన లోకాల చందంగా గోచరించింది. చివరకు దృఢ ప్రయత్నంతో, రవి మండల సమీపానికి చేరాం. ఛత్రప్రమాణమంత సూర్యబింబం కనిపించింది. ఒక పలుకైనా చెప్పకుండా నా తమ్ముడు క్రిందికి పడిపోతున్నాడు. చకచక నేను పడుతున్న తమ్ముడికి నా రెక్కలు నీడగా కప్పాను. సూర్యకరదీప్తికి నా రెక్కలు కాలిపోయి ఈ కొండమీద నేను పడ్డాను. అతడు జనస్థానంలో పడ్డాడని అనుకున్నాను. వానికి ఎటువంటి అపాయం జరగలేదు. నేనిక్కడ పడినప్పటినుంచీ, తమ్ముడూ, రాజ్యం, పరాక్రమం పోయి మొద్దులాగా బ్రతకడం దుర్భరం అని కొండ పైనుండి ఇల పైబడి చావాలనుకున్నాను." అని ఏడుస్తూ ఆ మహా పురుషునితో చెప్పాను. ఆయన కళ్లు మూసి ధ్యాననిష్ఠుడైనాడు.

## నిశాకరుడు సంపాతికి రెక్కలుమొలిచే ఉపాయం చెప్పుట

ముహూర్తకాలం ధ్యానంలో వుండి, కళ్ళు తెరచి "పుత్రుడా! నీకు రెక్కలు వస్తాయి. కళ్ళూ, రెక్కలూ, విక్రమం పూర్వంలాగా వచ్చి నీవు లోక పూజ్యుడవవుతావు. నేను దివ్య దృష్టితో త్రికాలాలను దర్శించాను. ఇక్ష్వాకువంశంలో దశరథుడనే రాజు జన్మిస్తాడు. ఆయనకు రాముడనే మహాపురుషుడు పుడతాడు. ఆయన తండ్రి ఆజ్ఞ చొప్పున లక్ష్మణుడనే పేరుగల తమ్ముడినీ, సీత అనే అర్ధాంగినీ వెంటపెట్టుకుని అడవికి వస్తాడు. జనస్థానంలో వుండగా రాక్షసరాజు ఆయన సతిని హరించుకొనిపోయి ఎన్నో ఆశలు చూపుతాడు. ఆసాధ్వి అవి అన్నీ నిరాకరిస్తుంది. ఆమెను అన్వేషిస్తూ వానరులు ఈ ప్రదేశం వస్తారు. వారితో నీకు పరిచయం దైవకృపవల్ల కలుగుతుంది. అప్పుడు నీకు తెలిసిన

సీతవార్త ఆ కపులకు వినిపించు. నీకు రెక్కలతో పూర్వస్థితి వస్తుంది. ఈ దశలో నీవు ఎక్కడికీ పోలేవు. పోవద్దు కూడా. నీకిప్పుడే రెక్కలు వచ్చేటట్లు నేను తపశ్శక్తి ధారపోసి చేస్తాను. మళ్ళీ ఆ శక్తి కోసం వేల సంవత్సరాలు తపస్సు చేయాలి. నీవు లోకహిత కార్యం చేయ వలసివున్నందున నాకు సంకల్పం కలిగింది. నీవు చేసేపని ఇంద్రునకూ మునులకూ, మానవులకూ, దేవతలకూ, పూజ్యులైన రాజులకూ, సాధు సన్మార్గులైన వారలకూ ప్రీతి కలిగిస్తుంది. నాకు కూడ లోకాతీత మూర్తులైన రామ లక్ష్మణుల దర్శించాలని వుంది. అంతకాలం శరీర ధారణం చేయటం ఇష్టంలేదు. నీకు ఈ రహస్యం వివరించి రామకార్య సాధనకు తోడ్పడిన పుణ్యం నాకు చాలు. దీనితో ఇక తపం చేయవలసిన అవసరం తీరింది. ఇక నేను దేహత్యాగం చేస్తాను. నీవు శోకం మాని దొరికిన పదార్థంతో జీవయాత్ర సాగిస్తూండు. నీ బిడ్డ నీపోషణభారం వహిస్తాడు."

## సంపాతికి మళ్ళీ రెక్కలు మొలచుట

అని ఎంతో జాలితో ఆదరించి ఆహారం సమకూర్చి ఆశ్రమం లోనికి పోయాడు. ఎంతో కష్టంమీద మళ్ళీ కొండపైకి చేరి రోజులు గడుపుకుంటూ, మీ రాకకోసం ఎదురుతెన్నులు చూస్తున్నాను. ఇప్పటికి ఎనిమిదివేల ఏండ్లయింది. మహర్షి మాటపై విశ్వాసం నన్నింత కాలం నిలిపింది. ఈనాడు ఇంత మంది వానరులు ఈప్రదేశం చేరటం, వచ్చినవారు కేవలం వానరులుకాక దేవతాశక్తులు కల్గిన మానవాకారులు కావటంచేత, మీ మాటల్లో అవ్యక్తంగా రామనామం, రావణ నామం వినపడ్డంచేత, ఆమునిచెప్పినఅవకాశం వచ్చిందనేఆశతో మీతో భాషించాను. మీ సాయంతో క్రిందికివచ్చి, ధన్యాత్ముడైన తమ్ముడికి ఉదక క్రియలు కూడా ఇచ్చి సీతోదంతం చెప్పి కృతార్థుడనయ్యాను." అని చెప్పి ముగించేసరికి ప్లవంగ పుంగవులు ఆశ్చర్యపడంగా, పక్షిరాజుకు పక్షాలు మొలిచినై. అరుణకాంతులవలె పక్షాలు రావటంతోటే పూర్వం కోలుపోయిన జవసత్వాలు మళ్ళీ వచ్చినట్లు అనిపించింది. ఆతని ఆనందానికి మేరలేదు. "కపులారా! విషయం విన్నారు. ముని వచనానుసారం నాకు రెక్కలు మొలిచినై. ఇక మీకు సీతమ్మజాడ తప్పక తెలుస్తుంది. ఏ మాత్రం సంశయింప పనిలేదు. ప్రయత్నం చేయండి.

నాకు రెక్కలు వచ్చినందున వెనకటిలాగా మింటికి ఎగురగలనేమో ప్రయత్నిస్తాను. మీరంతా దయతో అనుజ్ఞ ఇస్తే ఎగిరిపోతాను. మీకు నా హృదయపూర్వక వందనం" అంటూ సంపాతి ఆకాశానికి లంఘించాడు. ఆ పక్షి సంచలనానికి చెట్లూ, చేమలూ ఒక్కసారి కంపించినై. సంపాతి చనగానే వానరులంతా దక్షిణంవైపు నడిచారు. వారిలో పోయిన ధైర్యం, ఉత్సాహం, ఆశా పొటమరించినై.

## వానరులు సముద్రతీరం చేరుట

మహాశక్తి సంపన్నులై కూడ చేసేదిలేక నిర్వీర్యుల్లాగా, ప్రాణ త్యాగంకోసం సిద్ధపడిన కపిబృందం సంపాతి చెప్పిన మాటలకు సంతోషం పట్టలేక గంతులు వేశారు. ఘోర సత్త్వంతో పొంగారు. అవనిజాన్వేషణార్థం అపాంపతి తీరం చేరుకున్నారు. అన్ని లోకాలకు ప్రతిబింబంలాని చెప్పదగిన దక్షిణవారిధితీరం ఉత్తరభాగంచేరి అక్కడ నివిష్టులై అంబుధి వంక పారచూశారు. మహానాదంతో, మింటికి మంటికి సరిపడునట్లున్న నోళ్ళు తెరుచుకుంటూ, సముద్రగర్భం సంక్షోభితంకాగా సంచరించే భయంకర సత్త్వాలతో సంకులమై, భంగాభంగతరంగాలతో, ఒకచోట సుప్తంగానూ, ఇంకోచోట క్రీడాసక్తంగానూ, వేరొకచోట పర్వతాకారంగానూ, మరొకచోట పాతాళ తలవర్తిగానూ వుండి, వారివాద్యంవోలె మహాద్భుతంగా సంభ్రమాశ్చర్యాలను కల్పిస్తున్న సాగరం చూశారు. గుండెల్లో ఎక్కడలేని దడ ప్రవేశించింది. "ఇప్పుడేం చేయాలి? దీనినెట్లా దాటాలి? కష్టానికి ఫలితం దక్కినట్లు సీతమ్మ జాడ తెలిసిందికాని, అందుకు సంతోషించాలో, ఈ మహార్ణవంచూచి ఎట్లా దాటటం అని ఏడ్వాలో తోచటంలే"దని వానరులంతా భయంతో వాపోసాగారు. శోక సంతోషాలమధ్య తట్టుమిట్టాడుతున్న తమచరులను అంగదుడు చూశాడు. "ఎందుకు ఇంత దుఃఖపొందుతారు? పగబట్టిన సర్పం కాటువేసి మనిషిని చంపినట్లు, దుఃఖం పౌరుషశక్తుల పాడు చేస్తుంది. పరాక్రమం చూపించవలసిన సమయంలో ప్రాజ్ఞులూ, బలవంతులైన మీరు శోకిస్తూ, పురుషార్థాలను మానంగావద్దు. ధైర్యసాహసాలు కార్యసిద్ధికి ముఖ్యకారణాలు. కపిలోకంలో ఉన్నతోన్నతులైనవారిని పరీక్షించి ఈ దిక్కుకు ప్లవగేశ్వరుడు పంపాడు. మనవల్ల ఈ కార్యం నెరవేరుతుందని కపి ప్రభువు

చెప్పలేదా? దుఃఖం వదలి, ధైర్యం ధరించి, కార్యనిర్వహణకు ఉత్సాహం చూపండి" అని వారికి ధైర్య వచనాలు చెప్పాడు. సాయంసమయం ఆసన్నమైంది. ఆరాత్రికి వారంతా భోజనార్థమై, కాయలూ, దుంపలూ, పండ్లూ భుజించి శ్రమసహిత శరీరాలకు ఎట్లో విశ్రాంతి కల్పించారు. సూర్యోదయం కాగానే వాలి పుత్రుని వానరులంతా చుట్టుముట్టారు. దేవతల నడుమవున్న దేవేంద్రునిలాగా, బుద్ధిమంతుడైన అంగదుడు ప్రకాశించాడు. అందరూ అంబుధి తరణోపాయాన్ని గూర్చి ఆలోచించ సాగారు.

## అంగదుడు కపులను వార్ధి దాట ప్రేరేపించుట

అనంతమంగా కనుపిస్తున్న అర్ణవతరంగాలవలె అంతులేని ఆలోచనలు పుట్టి గిట్టుతున్నై. కాని ఏదీ కుదురుకోవటం లేదు. కాలం గడుస్తున్నా ఎవరూ మాటలాడలేదు. అంతా అంగదునివైపూ, జాంబవంతునివైపూ, హనుమంతునివైపూ చూస్తున్నారు. అంగదుడు హరివృద్ధులనూ, చమూపతులనూ చూచాడు. అనంతమైన వాక్కులతో, సంతోషం, ఉత్సాహం కల్పిస్తూ, "ఈ మహావానర ప్రముఖుల్లో, ఈ మహా సాగరాన్ని ఏ తేజస్వి దాటి కపి పుత్రుణ్ణి సత్యసంధుణ్ణి చేస్తాడు? ఏ బలసంపన్నుడు మహామహ జలధి లంఘించి ప్లవగుల భయం బాపగలడు? ఏ వయోమూర్తి ఈ కార్యం నెరవేర్చి ఆనందపరచి ఆనందించే యోగం కపులకు ప్రసాదిస్తాడు? ఎవని విజయంతో జానకీ వార్త కొని రామలక్ష్మణ సుగ్రీవుల అనుగ్రహం వానరులు సంపాదిస్తారు? అటువంటి శక్తి సంపన్నులెవరైనావుంటే లేచి మాఅందరికీ అభయదక్షిణ ఇచ్చి ఆదుకోవలసిందని ప్రార్థిస్తున్నాను" అని అన్నాడు. ఆ మాటలకు అగచరులంతా ఒకరిమొగం ఒకరు చూచుకుంటున్నారేకాని ఒక్కడూ లేచి ఆపని నేను చేస్తానని చెప్పినవాడులేడు. వానరవాహిని, నీరవనిశ్శబ్దంగా వుండటంతో మళ్ళీ అంగదుడన్నాడు. "కేసరులారా! మీరు మన కపి లోకంలో చుక్కల్లో చంద్రునివంటివాళ్ళు కదా? మీకు పోలేని తావు లున్నవా? సమయాసమయాలున్నవా? మీరంతా మౌనంగావుండే కార్యం నెరవేరేదెలా? సీతజాడ తెలియకముందు తెలియలేదనీ, ఇప్పుడు సముద్ర తరణం ఎలాగనీ విచారించటంతోనే మన పని పూర్తవుతూంది.

పోనీ, నేనొక మార్గం చెప్తాను. అది బాగుందేమో ఆలోచించండి. మీరంతా గగనపథులే కదా. ఎవరెంత దూరం వారి లంఘిస్తారో తమతమ పరిమితి చెప్పండి. దానిపై ఏం చేయాలో ఆలోచిద్దాం" అని.

## అంగదునితో కపులు తమ లంఘన శక్తులు చెప్పుట

ఆ మాటలకు అందరూ ఉత్సాహం చూపారు. కాని, కొందరు మాత్రమే లేచి ముందుకు వచ్చారు. గవయ గవాక్ష సుషేణ ద్వివిద మైంద గజ గంధమాదన శరభులు "యువరాజా! మా శక్తి ఈ కార్యానికి చాలదని మిన్నకున్నాం కాని, దేహ భ్రాంతితో కాదు." నేను పది ఆమడల దూరం పోగలనని గజుడనగా, ఇరవై ఆమడలదాకా అరుగగలనని గవాక్షుడన్నాడు. నేను ముప్పైదాకా పోతానని గవయుడంటే, నలభైదాకా నాకు సాధ్యమని శరభుడు చెప్పాడు. గంధమాదనుడు ఏభయివరకు నేను దాటగలనన్నాడు. మైందుడు అరువది వరకూ నాకభ్యంతరంలేదని చెప్పాడు. డెబ్భై ఆమడలదూరం లెక్కలేకుండా పోతానని ద్వివిదుడు చెప్పాడు. సుషేణుడు ఎనభై ఆమడలవరకు ఎటువంటి ఆటంకం వుండదన్నాడు. జాంబవంతుడు లేచి "పూర్వం గతివిక్రమంలో నాకు మంచి ఖ్యాతి వుండేది. అర్కవంశజుడు, అర్కసంభవుడు మన మీద ఎంతో ఆశపెట్టుకుని పంపారు. అందుచేత ఇప్పటి నా శక్తికి తగినట్టు తొంభై ఆమడలు పోగలను. నా గమనశక్తి ఇదివరకు ఎలావుండేదో వినండి. బలీంద్రుడు సవనం చేస్తూ వామనునికి మూడడుగులు దానంచేసినప్పుడు, ఆ మహామూర్తి త్రివిక్రముడై భూమ్యంతరిక్షాలు ఆక్రమించినప్పుడు ఆయనచుట్టూ ప్రదక్షిణించివచ్చి పాదాలకు వందనం చేశాను. ఇప్పుడా వయస్సూలేదు. ఆ జవంలేదు. ఎంత సాహసించినా అంతకన్న పైకి పోయే ధైర్యం కలగటంలేదు. ఎలా ఈ కార్యం సానుకూల పడుతుందా? అని ఆలోచన చేస్తున్నా"నన్నాడు. జాంబవంతుడు వృద్ధుడైనా స్వామికార్యంలో చూపిన ఉత్సాహానికి అంగదుడు సంతోషించాడు. "తాతా! భల్లూకపతీ! నీ స్వామిభక్తి నాకెంతో తృప్తికూరుస్తోంది. నేను నూరామడల దూరం నిశ్శంకగా దాటగలను. తిరిగిరాలేననే అనుమానం బాధిస్తోంది. లేకపోతే నేనే పోతానని చెప్పి మీకు సంతోషం కలిగించే వాణ్ణి."

అని వానరనాయకులనగానే "యువ ప్రభూ! నీవు సంశయించినా మాకు నీ శక్తిపై సంశయంలేదు. నీకు శతయోజనాలే కాదు, సహస్రయోజనాలైనా ఒక లెక్కలోనివి కావు. నీ తండ్రి గమనంలో త్రిలోకాల్లో వున్న వేగవంతులనందర్నీ మించిపోయాడు. అంత శక్తి నీకూ వుంది. అయినా, నీవీ కార్యం చేయరాదు. నాయకుడు పనిచేయించేవాడే కాని చేసేవాడు కాడు. ఇంత భృత్యకోటి వుండి నిన్ను పంపటం మాకు ఎంత మాత్రం ధర్మం కాదు. మాకు స్వామిగా నిన్ను పంపినందున నిన్ను రక్షించుకొనటం మా విధి. కనుక నిన్ను ఒంటరిగా పంపటం వుచితమైన పని కాదు. ఇది ఇలావుండగా ఈ కార్యానికంతకూ మూలం నీవు. చెట్టుమొదలు బాగుంటే కొమ్మలూ, పూలూ, పండ్లూ కొదువ లేకుండా లభిస్తయ్. బుద్ధికీ ధీరతకు, పరాక్రమానికి నీవు పెట్టింది పేరు. నిన్ను ముందుంచుకుని కార్యం చేయగలవారమే కాని, స్వతంత్రులం కాము." అని భల్లూకపతి బదులు చెప్పాడు. "తాతా! నేను పోకపోతే కార్యం సాధించేదెలా? ఆయన అనతి నెరవేర్చక మనం పోతే ప్రభువు చేత మనుగడకే ముప్పువస్తుంది. కనుక మనకు విధి విధించిన శిక్ష ప్రాయోపవేశమే. ఈ అవాంతర స్థితినుంచి బయటపడాలంటే నీ కేదయినా ఆలోచనవస్తే చెప్పు. అలా చేద్దాం" అని అంగదుడు మళ్ళీ అన్నాడు.

"చమూనాయకా! నీవు చింతపడకు. నీవు పోకుండా సీతామాత జాడ తెలుసుకుని మనలను కాపాడే కార్యకారి మనలోనే వున్నాడు. ఆ లోకోత్తర మూర్తిని ఇప్పుడే చూపిస్తాను. సంపాతి మాటలు జరిగి తీరుతై. మనకు రామకార్యం చేసిన పుణ్యం, రాజాజ్ఞ నెరవేర్చిన ప్రతిష్ఠా తప్పక దక్కుతై. ప్రాయోపవేశం చేసేపని ఇక మనకులేదు. పగవాడైన రావణునికీ, అతని పాలితులకూ పట్టుతుంది. నాకిప్పుడు స్ఫురించింది." అనిచెప్పి, జాంబవంతుడు ఏకాంతంగా నిశ్చలుడై కూర్చున్న పావనివద్దకు వెళ్ళాడు.

## జాంబవంతుడు హనుమంతుని స్తుతించి ప్రోత్సహించుట

"మతిమంతా! హనుమంతా! మహారాయా! ఆంజనేయా!

అహ్నాయ ప్రథితా సురాధిక ఘనాహంకార విధ్వంస! మ
ధ్యాహ్నాఖిల దివాకరచ్ఛవి సమానాఖండ తేజో నిధీ!
వహ్ని ప్రస్ఫుట కీలకాభ సుఘనం పత్రోల్ల సన్మౌళికా
విహ్నాలంకృతకంఠ సీమ! గుణరాశీ! రమ్ము వాతాత్మజా!

అక్షీణ ప్రధనోగ్ర దానవబల దర్పాత్మీయ గంభీర సై
న్యక్షిప్ర ప్లవగాళికారణ మహాహంకార హుంకార దూ
రక్ష్మాక్షణ దక్షతాద్భుత ఘనప్రాగల్భ్య నిశ్ఛిద్ర సం
రక్షా ప్రాశ్రిత భీతభీత కపివారా! రమ్ము వాతాత్మజా!

సంధ్యాకాల విజృంభితారుణ ఘృణిస్ఫారాస్య పంకేరుహా!
వింధ్యాధ్యాపని భృన్మహోన్నత బృహద్విజ్ఞాన సంసద్యుతా!
కంధ్యాటోప పరాక్రమ త్రిమజిర క్రౌర్యా సురాగ్నిచ్ఛటా!
వంధ్యా పుత్త్రికసేయుఁ గాదసతి, దేవా! రమ్ము వాతాత్మజా!

అంహో మర్దనశంభుదత్త పరమాద్యత్క్రూర రక్షశ్ఛటా
రం హశ్చండ కఠోరహస్తి ఘటితత్రైలోక్య జీవావళీ
సంహారాఖిల కార్యవిశ్లథ జయస్థైర్య ప్రమానోల్లస
త్సింహా! భానుజమిత్ర! దివ్యగుణరాశీ! రమ్ము వాతాత్మజా!

ఏ తన్మాత్రుఁడవే? సుధాకర దినేశేంద్రాది దివ్యచ్ఛటా
పూరానేక వరప్రదా జనితప్రోద్యద్విభ్వా శక్తి వి
న్యాసాత్పూర్వ వివేకశాలివి; విశుద్ధబ్రహ్మచర్య ప్రతో
ద్భూతాం భశ్చర కేతనా! వినయసింధూ! రమ్ము వాతాత్మజా!

కేసరిపుత్రా! పై వానుగ్రహంవల్ల మనశ్రమ ఫలించేదినం వచ్చింది. నీవు కార్యరంగంలోదిగి, దిక్కు తెలియక పరితపిస్తున్న మనవాళ్ళను

అనుకోవాలి. మేమేకాక, రామకార్యార్థం సర్వ జీవకోటి నీ వంక ఆశతో చూస్తుంటే నీవు ఉదాసీనంగా వుంటే ఎలా? జగంలో గరుత్మంతుడు నీకు సాటి. నీవు మౌనమూర్తివై ఆత్మపరిపరాయణుడవై ఏకాంతంగా ఉండి మాటలాడకపోతే మాగతి ఏం కావాలి? కేవలం ప్రభువు ఇచ్చిన ఆజ్ఞతో శ్రీరామచంద్రుడు నిన్ను నమ్మి నీపై భారం వుంచి నిన్ను మా నాయకునిగా ఎన్నుకున్నాడు. అంగుళీయకం ఆనవాలుగా ఇచ్చాడు. ఇంత కార్యభారం నీమీద వుంటే నన్ను కానట్లు నీ వుండటం మాకు బాధ కలిగిస్తుంది. నీ బాహుబలం, వైనతేయుని పక్షాలకు శక్తిలో తేడా లేదు. ఇంకా తేజంలో, బుద్ధిలో, ధైర్యంలో నీవే అధికుడవు. నిన్ను నీవెరుగవు. అందుకు కారణం వుంది. నీకది చెబుతా విను. ధ్యాన సమాధి చాలించి మాపై దయతో ఆలించు.

## జాంబవంతుడు హనుమంతుని జన్మవిధం చెప్పుట

మారుతీ! పుంజికస్థల అనే అప్సరఃకాంత అంజన అనే పేరుతో కుంజరుడనే కపిరాజు కుమార్తెగా వానరియై జన్మించింది. ఆమెను కేసరి అనే కపినాయకుడు పత్నిగా దత్తం చేశారు. ఆ సుందరి యౌవన విలాసం ఒలకపోస్తూ, సర్వాభరణ భూషితయై, మానుషాకృతిలో పర్వత సమీపారణ్యంలో విహరిస్తోంది. ఆ సమయంలో పవమానుడు (గాలి) హాయిగా చెట్లకొమ్మలను కదిలిస్తూ, పూలను చెదరిస్తూ, నీళ్ళ తరగలపై క్రీడిస్తూ హాయిగా సంచరిస్తున్నాడు. ఆ సంచారంలో పచ్చని మఖమలుపై విలసిల్లుతుంటే బంగారు జరీ నగిషీ పని తనంతో నిండుతనం ప్రకాశించే పయ్యెద చెదరి జారిపోగా ఆమె అపురూప సౌష్ఠవం వెలికి గోచరించింది. ఆ సౌందర్యానికి ముగ్ధుడై, మారుని బారిన పడి ఆ వాయుదేవుడు నిండు ఆలింగనం చేసుకున్నాడు. ఆమె అదరిపడి "ఎవరు దుర్బుద్ధితో నా శీలాన్ని అపహరించి నా శాపానికి గురికాదలచా వారెవరో" కోప ఘూర్ణిత నేత్రయై పలుకుతూ ప్రశ్నించింది. ఆమె పలుకులకు పవనుడు కొంచెం జంకి "సుందరీ! నేను ప్రాణుణ్ణి. నీపై మక్కువతో దేవకార్యార్థం ఈ పని చేశాను. నేను జీవకోటి బాహ్యాభ్యంతరాలలో నిండివుంటాను. నా స్పర్శ సకల జీవసంరక్షణ

సంకల్పం కలిగి వుంటుంది. నేను కామవాంఛాసక్తుడనై నిన్ను కౌగిలించుకున్నాను కాని నీ శీలభంగం చేయాలని కాదు. నాకా భావంలేదు. నీ పతివ్రతాత్వం భంగంకాలేదు. అయినా కోరికతో కూడిన స్పర్శ వ్యర్థం కాకుండా నీకు నా వంటి పుత్రుణ్ణి ప్రసాదిస్తున్నాను. ప్లవనంలో, లంఘనంలో, మహాజవనంలో, పరాక్రమంలో నాకు సముడై దేవకార్యం చక్కబెట్టి యుగయుగాలకు తరుగని కీర్తినిపొంది భక్తకల్పద్రుమంగా వాసిస్తాడు." అని చెప్పి ఆమెను తృప్తిపరచాడు. నీ తల్లి కూడా మహానుభావుడైన పుత్రుడు కలుగుతాడనే సంతోషంతో అంగీకరించింది. అనంతరం ఆమె ప్రసవ లక్షణాలను కలిగి కొండగుహలో నిన్ను ప్రసవించింది.

పిమ్మట, కొన్నాళ్ళకు నీ శైశవదశలో ఆకలి తీర్చుకునే నిమిత్తం అడవిలో తిరుగుతుంటే ఉదయించే భానుణ్ణి చూచి ఫలభ్రాంతితో త్రిశతయోజనాలు ఉద్గమించావు. సూర్యునివేడి కిరణాలు శరీరాన్ని తప్తంచేస్తున్నా లెక్కగొనక ఇంకా సమీపిస్తుంటే ఇంద్రుడు నీవల్ల సూర్యగమనానికి ఆటంకం కలుగుతుందేమోనని చేతిలోని వజ్రం నీపై ప్రయోగించాడు. అది నీ వామ హనువు దూసుకుని పోయింది. అతిలోకసుందరుడవైన నీ హనువు భగ్నం కావటంతో నీ తండ్రి నిన్ను గొని గుహచేర్చి కోపంతో తన తేజాన్ని ఉపసంహరించాడు. పిపీలికాది బ్రహ్మపర్యంతం మూడులోకాలు నిశ్చేతనంగా నిలిచిపోయినై. సురలు జరిగిన అనర్థం ఇంద్రునికి విన్నవించుకున్నారు. అతడు తన తప్పు తానెరింగి, చతుర్ముఖుని ప్రార్థించగా, ఆయన దేవతలగూడివచ్చి నీకు చిరజీవిత్వం, బ్రహ్మాస్త్ర నిరాకరణం ప్రసాదించాడు. తక్కినవారు సర్వ విద్యలూ ప్రసాదించారు. ఈశ్వరుడు అష్టసిద్ధులూ, మృత్యుంజయత్వం, స్వీయాంశలో అస్త్రం ఇచ్చి ఆశీర్వదించాడు. కేసరికి విక్రమక్షేత్రజుడవు. పవనునకు ఔరసుడవు. ప్లవనంలో, లంఘనంలో సాక్షాత్తు నీవు తండ్రివే. నేను కార్యార్థినై నిన్ను స్తోత్రం చేస్తున్నానని భావించకు. మునుల శాపంవల్ల నీశక్తి నీకు యితరులు బోధించేవరకూ తెలియదు. అందుకు నిన్ను గూర్చి నీకు తెలుపుచున్నాను. పోతున్న మా ప్రాణాలు కాపాడు. ఈ విశాల విశ్వంభర

త్రివిక్రమాకృతిలో ఇరవైఒక్కసారి ప్రదక్షిణించాను. దేవదానవులు క్షీరసాగరం మథించేటప్పుడు ఎన్నో ఓషధులుతెచ్చి దాన్ని నింపాను. ఆ తీగలవల్ల అమృతం జనించింది. ఇప్పుడా జవసత్త్వాలు నాకు లేవు. ఇది రామకార్యం. ప్రభు కార్యం. తెలియక ముందు ప్రాయోపవేశం చేయటం ధర్మమే. తెలిసిన మీదట ఆ పనిచేయుటం అధర్మలక్షణం. నీయంతటివాడు మాకు అండగావుండే ప్రాయోపవేశంతో పనేముంది? గడువు గడచినా కృతార్థులమై తిరిగిపోతే ఇద్దరూ ఆనందిస్తారు. త్రివిక్రమునివలె విజృంభించి కపికులాన్ని కాపాడు. జాగు చేయవద్దు. ఉత్తిష్ఠ హరిశార్దూల, లంఘయస్వ మహార్ణవం" అని జాంబవంతుడు హనుమంతుని అనేకవిధాల స్తుతించి కార్యోన్ముఖుణ్ణి చేశాడు.

## జాంబవంతుని స్తుతితో హనుమ విజృంభించుట

ఋక్షధవుని సహేతుకమూ, సారమూ, సమయోచితమూ ఐన స్తుతి వినగానే, తనపై మోపిన కర్తవ్య సాధనకు మార్గ ప్రబోధం నిమిత్తం ధ్యానసమాధిలో మునిగిన మారుతికి రామచంద్రుడు దక్షిణ హస్తం చాచి "ఉత్తిష్ఠ హరిశార్దూల, లంఘయస్వ మహార్ణవం" అని అభయం ఇస్తున్నట్లు గోచరించింది. ఆ మహామూర్తి దర్శనం, ఆజ్ఞ అతణ్ణి పారవశ్యంలో ముంచెత్తినై. కనులువిప్పి కలయ చూచాడు. సాగరమేకాదు సమస్తవిశ్వం తనఅంగలో ఇమిడివున్నట్లు కానవచ్చింది. "రామా! రామా! ధన్యోస్మి. ధన్యోస్మి." అని మహాత్ముడు పుష్పరించాడు. సామాన్య వానరాకారం నభమంట విజృంభించి పెరగసాగింది. ఆ అపురూప సందర్శనంతో అగచరులు అందరూచేరి ముక్తకంఠంతో ఆడుతూ, పాడుతూ, ఆనంద కోలాహలం చేయ మొదలు పెట్టారు. అంగదుడు నాయకుడైనా, అతివినయంతో, భక్తితో అంజలించి,

"దేవానందకర ప్రతాపగుణపాళీ! దేవతావిశ్వపై
ర్యాఘ్రశ్రేణి విదాల! దుష్టజన సమూహ స్థయిర్య ఖండల్లతా
శీఖడ్గంబ! ధరాత్మజాహృదయ దుగ్రేమచ్ఛటా వర్ష ధా
రా! ఖట్వాంగ సుపాణిరూప! కపివీరా! త్వాంభజేహం సదా

దోః పాండిత్య శతారఖండిత సుధాంభోద్వేషి జీమూత! శ్రే
యః పద్మాసనతుల్యయోగ! రఘురామాంఘ్రిద్వయాంచింతనా
ధః పూర్ణాచ్ఛమనస్తటాక! భవఖుంభద్వహ్ని కీలచ్ఛటా
వాః పాతంబ! సమీరపుత్ర! శరణాపా! త్వాంభజేహం సదా-

గ్రీష్మాదిత్య సహస్రమండల విభార్చి స్తోమవద్వి స్ఫుర
ద్భీష్మాటోప పరాక్రమక్రమల సద్వీరాధివీరా! చిరా
యుష్మంతా! రఘురామనామ జపసద్యోగార్థి చిత్తాంబుజా!
యుష్మచ్ఛక్తికిమొప్పు, సద్గుణ విహారోత్సాహ! వాతాత్మజా!

భృగ్వత్రిచ్యవనాది రాజిత మహర్షిశ్రేణి సంభావనా
వాగ్విస్తార సుధా ప్రవాహగత కుంభత్పద్మ! భాస్వత్సుభ
ఘుగ్వం కాములనేత్రతత్పణ మహాపూర్వాది తేయచ్ఛటా
దిగ్వే దండశిరః కిరీటగళితో ద్దీపోగ్రముక్తాఫలా!

మంథానాచల తుంగవీర్య బలభామా! వర్ధమానోడు గ
ర్వాంధీ భూతసురారి మజ్జ గమనాహంకార హేళిప్రభా!
కంధి ప్రాభవ సద్గుణోన్నత! విపత్కల్లోల కీశావళీ
పాంథా నందకరామ రక్షితిజ! దేవా! పాహిమాంపాహిమాం."

అని ధ్యానిస్తూ మహోత్త పుష్పగుచ్ఛాలతో పాదార్చన చేశాడు. సముద్రుడు ఆనంద తరంగ హస్తాలతో స్వాగతం పలికాడు. పవనుడు తన పుత్రుడు స్వర్గమర్త్య లోకహితార్థం సముద్రతరణ సంకల్పంతో విజృంభించటం చూచి అలవోకగా మహేంద్ర పర్వత పరిసర వృక్షలతా సంబంధి పుష్పాలను వర్షించి "విజయోస్తు, నిర్విఘ్నమస్తు" అని ఆశీర్వదించాడు. ఖగేంద్రుడు స్వీయపక్ష బలశక్తులను హనుమదాహువులకు ప్రసాదించాడు. అప్పుడు హనుమద్వదనం ఎర్రగా కాగిన పెనంవలె, పొగలేక మండుతున్న నిప్పుల కుప్పలాగ కాంతితో కళకళ లాడింది. కపి మధ్యంలో ఆసీనుడైన కపిశ్రేష్ఠుడు దిగువనేవి ప్లవగ వృద్ధులకు చేమోడ్చి ప్రణామం చేశాడు. దేవతలు హర్షంతో దుందుభులు మ్రోగించారు.

పావని అంతర్ముఖుడై "శ్రీరాఘవం, దశరథాత్మజ, మప్రమేయం, సీతాపతిం, రఘుకులాన్వయ రత్నదీపం, ఆజానుబాహుం, మరవిన్దదళాయ తాక్షం, రామం, నిశాచర వినాశకరం నమామి" అని ధ్యానించాడు. గిరి గహ్వర వర్ధిత కేసరి చందంగా కేసరి పుత్రుడు ఉప్పొంగుతున్న ఉత్సాహతనూ విభవుండై, తన్నే లక్షించి జేజేలు పలుకుతున్న వానరానీకం వంక చూచాడు.

## హనుమంతుడు కపులతో తన పరాక్రమం చెప్పుట

"వానరశ్రేష్ఠులారా! భీతి మానండి. శోకం వీడండి. దైన్యం వదలండి. ధైర్యం ధరించండి. విస్మృతిలోనున్న నా శక్తి ఓ ప్రబోధంవల్ల తిరిగి స్ఫురించింది. వృద్ధుడైన జాంబవంతుడుగాని, నాయకుడైన అంగదుడు గాని సాగరతరణాన్ని గురించి శ్రమించనక్కర లేదు. ఆకాశగమనంలో నా తండ్రీ, వైనతేయుడూ, నేనూ గాక మరొక ప్రాణి మాతో పోటీపడలేదు. మేరు పర్వతాన్ని ప్రదక్షిణించిరానా? శైలాంబోనిధి జంతుసంయుత ధరాచక్రాన్ని దాటివెళ్లి విసరనా! సాగర జలాన్ని మింటికి చిమ్మనా? ఖగపతివేగాన్ని అనుసరిస్తూ వేయిసార్లు వలగొందునా? ఉదయమవుతున్నప్పుడు ఇక్కడ నుంచి కదిలి, సూర్యుడు అస్తగిరి చేరేలోపల నేనుచేరి ఎదురువచ్చి దర్శింపనా? గగన గోచరాలను వేగంతో అతిక్రమించిపోనా? ఇంతింత ముక్కలుగా భూమిని చీల్చనా? సప్తసాగరాలను ఇంకించనా? కులశైలాలను పిండిపిండిగా దంచనా? నా ఊరువుల వేగంతో సముద్రాన్ని వెంటకొనిరానా? ఏమనుకున్నారు భీషణకాయుడైన ఆంజనేయుణ్ణి? విడిచిన రామబాణంవలె మింటదూసుకుపోతుంటే ఆ వేగానికి పెళ్ళగిలి పూలతోకూడిన వృక్షాలు నా వెంట వస్తుంటే నక్షత్రాలతోకూడిన మింటివీధి ఇదేనని మీకు భ్రాంతి కల్గిస్తుంది. నేను ఆకాశయానంలో క్రిందికీ పైకీ దిగుతూ ఎగురుతూ వుంటే గరుత్మంతుని ప్రడీనోడ్డీనాల సంక్రమణం స్ఫురించి మీకు వింతగొల్పుతుంది. ఆకాశంలో నేను పోతుంటే నాశరీరచ్ఛాయ "మేఘంవలె మింటిని మ్రింగుతుందా?" అన్నట్లు మీరు చూస్తారు. పర్వతాలను నలిపిస్తూ,

సముద్రాన్ని ఉడికిస్తూ, మేఘాలను అడ్డగిస్తూ, కడలి తరిస్తాను. కన్నులు కలిగిన ఫలం కాంచండి.

మెరపు మెరసినట్లు క్షణమాత్రంలో ఆలంబనరహితమైన ఆకాశ పథంలో సముద్రాన్ని తరిస్తుండే త్రివిక్రమాకారం దాల్చిన విష్ణువు లాగా నన్ను భావిస్తారు. ప్రభంజన వైనతేయానుగ్రహంతో వేయి యోజనాలైనా దాటగలనన్న విశ్వాసం నాకుంది. పరమేష్ఠి హస్తంలో ఉన్నా అమృతాన్ని తేగలనన్న, సీతమ్మ జాడ తెలుసుకుని రావటం నాకు అసాధ్యమా? లంకంతా అణువణువూ శోధిస్తాను. అమ్మ జాడ తెలిస్తే సరేసరి. తెలియకపోతే లంకను పునాదితో పెకలించి తెస్తాను. అప్పు దంవరం అన్వేషిద్దాం. కాలహరణం కానీయను. అమూల్యమైన కాలం అంతా ఇప్పటికే గడిచిపోయింది. ఏడవ దినం ఉదయానికల్లా నా తల్లి కుశలవార్తతోనో, బంధీకృత పంక్తిముఖునితోనో తిరిగి వస్తాను. ఆనందంతో ఆశీర్వదించండి" అని గర్జిస్తున్న వానర యూథముఖ్యుణ్ణి విస్ఫారిత నేత్రాలతో, విస్మయ చిత్తంతో కపులు చూడసాగారు. జాంబవంతుడు విక్రమంతో విజృంభిస్తున్న హనుమంతుని చూచి సమ్మోదజలం చక్షుస్తటాకం పరిధి అతిక్రమించగా,

"స్వస్తిశ్రీ మదనంత సద్గుణ మణీ సంప్రత్ప్రభాహ్వాత్తనీ!
హస్తాలంకృత భీమనామక గదావ్యాలంబితోద్యద్భుజీ!
ప్రస్తానంత కృపావలోకన సుపర్వప్రోల్ల సద్వాహినీ!
హస్తాంభోజయుగంబు మోడ్తు; కపివీరా! యంజనా పుత్త్రకా!

అంతంబున్ గనరాకయుండి నగభీరాంభోనిధిన్ దాటగా
స్వాంతం బందున భక్తితోడ విమలస్వాంతం, భవంతం, దయా
వంతం, శాంత, మనంత విక్రమ, మహావందే యటంచున్ సదా
చింతింతున్ గృపజూడుమయ్య గుణరాశీ! యంజనా పుత్త్రకా!

దాసంగోరి ధరాజభామ ధరశ్శృంగంబెక్కి లంఘించుచో
నానాస్థావర జంగమాత్మక ప్రపంచమ్మె భవద్ధాటికిన్
ప్రాణంబున్ బిగపట్ట వారిధి తరింపంగల్గు సచ్ఛక్తి నీ
కేనయ్యా తగునీ యుపాంతమున స్వామీ! యంజనాపుత్త్రకా!

జగత్ప్రాణాత్మజా! కేసరికిశోరమా! వీరలోక వినుతా! నా ప్రార్థన మన్నించావు. బంధుజన శోకం బాపావు. నీ మేలుకై, ఈ వనచరచక్రవాళం నీ కార్యం శుభావహం కావటానికి నీకు మంగళ శాసనం పలుకుతుంది. తాపసుల ప్రసాదమహిమ, కపివృద్ధుల సన్మతి, గురుల కరుణాగరిమ నీకు పుష్టిగా, తుష్టిగా లభించి, అనిదంపూర్వమైన ఈ విపుల మహార్ణవందాటి విజయుడవై వచ్చి యశశ్చంద్రికలు వెల్లివిరియగా వెలుగుదువుగాక. రాజాజ్ఞ రక్షింపబడుగాక. రామహృదయం రాగానురాగముతో రంజింపబడుగాక. వాయు వైనతేయులు నిన్నావేశింతురుగాక. జలధి నిన్ననుగ్రహించుగాక.

## కపులతో హనుమంతుడు మహేంద్రాద్రిని ఎక్కుట

నీవు వచ్చేవరకూ నిరీక్షిస్తూ ఏకపాదంపై నిలిచివుంటాం. ఈ బలిముఖయూథ ప్రాణాలు త్వద్గతం. నీ అభిమానపాత్రుడు అంగదుడు ప్రహర్షితుడైనాడు. కార్యసాధకుడుగా నిన్ను ఎంచుకున్న రవిపుత్ర రవి వంశ్యుల లక్ష్యం సిద్ధించింది. త్రిభువన కల్యాణం చేకూరింది. అగచర సమ్రాట్టు అనృతదోషంనుంచి ఉద్ధరించబడ్డాడు. ఏక లక్ష్యంతో విడువక చేసిన పని ఫలిస్తుందన్న పెద్దల వాక్యానికి విలువ పెరిగింది. నిన్ను కన్న తలిదండ్రుల జన్మ ధన్యమై చిరకీర్తి లాభంతో వృద్ధిపొందింది. దేవతల సంకల్పం నెరవేరింది. మేము నీవాళ్ళంకావటంతో వానరలోకానికి వన్నెవాసి కలిగింది. జయవీర హనుమ. జయ రామభక్త. జయవారిలంఘన ప్రవీణ. జయ భక్తమందార. జయ మేరు గంభీర. జయ జయపాప సంహార. జయదీనమందార. జయభీకరాకార. జయసద్గుణవిహార. జయసుందరా! జయమోగసుందరా. జయకృపామందిరా. హే మహాకాయ. హే ఆంజనేయ. నమస్తే నమస్తే నమః" అని స్తుతిస్తుండే పావని భల్లూకపతి పాదాలకు నమస్కారంచేసి, "ఋక్షపతీ! నన్నింత పొగడటం న్యాయంకాదు. మనమందరం ఏక కార్యార్థులమై వచ్చాం. ఎవరివల్ల ఏ కార్యం సాధింపబడినా అది ఉమ్మడి ఫలం. అంతేకాని అది ప్రత్యేకంగా కొనియాడ తగిందికాదు. నా లంఘనానికి ఈ భూమి ఆగలేదు. కంపనంలో క్రుంగిపోతుంది. ఈ మహేంద్ర నగశిఖరాలు మాత్రం స్థిరశిలా

సంకటాలు. నానావిధ ద్రుమలతా మానితాలు. ధాతునిష్యందకాంతాలు. నిర్ఝరాలు. అవి, శతయోజన విస్తీర్ణ జలరాశి లంఘనం కోసం నా ఉత్సాహపద ఘట్టనానికి తట్టుకోగలవు. మనం అగ్ర ప్రాంతానికి చేరుకుందాం." అని పల్కి, వివిధ లతావృక్షగుల్మ వ్యాప్తం, సకల మృగనిషేవిత శాద్వలం, నిత్యపుష్ప ఫలద్రుమం, నిర్మల నీరపూరం, సింహశార్దూల సంకులం, మత్తద్విజగణారావితం, మలయానిలభరితం అయిన శిఖర ప్రదేశానికి కిశలోకేసులు సేవింపగా చేరి స్వేచ్ఛా విహారం కొంతసేపు చేశాడు. ఆ విహార యాత్రకు మహేంద్రగిరి విప్రకీర్ణ శిలోచ్చయమై నిప్రక్కింది. సింహాభిహత దంతిచందంగా నురిగిపోయింది. బెదరి పారుతున్న మృగాలు, కదలుతున్న వృక్షాలు, ఎగిరిపోయే విహంగాలు, ఎడబాటు పొందిన గంధర్వ చక్రవాక మిథునాలు, దాగే పబాధరాలు, దొరిలిపడేరాళ్లు, నిట్టూర్చే మీనాలులు, అర్ధ నిస్సృత ఫణులతో ఆ పర్వతం అనేక పతాకా ధ్వజంలాగా అయిపోయింది. భయభ్రాంతులైన తాపసపుంగవులు వీడిపోవటంతో, మహారణ్య మధ్యంలో దొంగలచే అర్థం హరింపబడిన పాంథుడులాగా దిక్కుమాలి దిక్కుబిక్కుమంటూంది. ద్విట్సంహారకుడైన కపి సింహం రంహోర్జితచిత్తంతో సముద్రం తరించి లంకలో ప్రవేశించటానికి సుసంహతమతియై దక్షిణాభిముఖంగా శిఖరాగ్రంపై సమపద స్థానంలో నిల్చాడు.

(కిష్కింధకాండం సంపూర్ణం)

"సర్వ మంత్రశక్తి, సర్వ దేవప్రీతి
సర్వకామ్యసిద్ధి, సర్వ శుభము
లందఁజేయునట్టి సుందరకాండంబు
వ్రాయుమయ్య హనుమ! భవహరముగ.

# శ్రీ హనుమత్ప్రార్థనమ్

చూరలొసంగెనాది కవి సుందరకాండను నీ మహత్త్వమున్
వారక గ్రోలి పండితులు పామరులున్ దరియించినారు సం
సార మహార్ణవంబు, మనసా వచసా భజియింతు నయ్య సా
మీరి! త్వదంఘ్రి యుగ్మము, గమింపఁగఁ జేయర, సుందరంబునున్ -

సుందరుడవీవు, కాంతంబు సుందరంబు
దాశరథి పత్ని సుందరి, దైత్యలంక
సుందరము, త్వత్ప్రవృత్తము సుందరంబు.
వ్యాఖ్యసేయు; మాదికవి రహస్యమెల్ల.

నేను నిమిత్తమాత్రముగ నీవు రచింపఁజేసి లోకమున్
గావఁగదావు, పామరులుగాని, మనీషులుగాని పెద్ద వ్యా
ఖ్యానముచేసెదు, రింకపలు, సల్లాపరించిన నీదు తీవ్ర కో
పానల దగ్ధమై చెదఁగ నానతి చేసితి, మాట నిల్పుమా.

అక్షరజ్ఞాన శూన్యులు, స్వార్థపరులు,
సంస్కృత ద్వేషులీ రామ చరితమంద
నాది కవి దాఁచినట్టి మహార్థములను
తెలియఁగారేరు, వారిని దెలుపుమింక.

# సుందరకాండ

## మహేంద్రగిరిపై హనుమంతుడు విహరించుట

అంగద జాంబవంతులచే ప్రబోధ ప్రేరణ పొంది హనుమంతుడు కపులు సేవించగా మహేంద్రగిరి అధిరోహించాడు. సీతాన్వేషణార్థం లంకనూ, లంకేశుణ్ణి ఒకసారి గుర్తుకు తెచ్చుకున్నాడు. మెడనూ, తలనూ నిక్కించి ఆబోతు రీతి మనోహరుడై, ఎవరికీ, ఎక్కడ ఎప్పుడు సాధ్యంకాని పనికై యత్నించ సంకల్పం చేశాడు. వైడూర్యం వలె, మంచినీటివలె అందంగావున్న పచ్చిక బయళ్ళలో కొంతకాలం విహరించాడు. పక్షుల బెదరిస్తూ, మృగముల అదలిస్తూ, వృక్షశాఖల కదలిస్తూ, పంచాననవ్యాఘ్రాది క్రూరసత్త్వాల పట్టి నేలపొదలిస్తూ, పెచ్చురేగి పెరిమెకంలాగా కొంతసేపు తిరిగాడు. అసితమూ, లోహితమూ, సితాసితము, ఆకుపచ్చ వర్ణాలతో పొంపిరిపోతున్న ధాతువులచేతనూ, యక్ష కిన్నర గంధర్వ నాగసుందరీ పరిష్క్రియాతతి చేతనూ, హృదయంగమంబై, మదనాగ సంచార సంకులంగా వున్న మహేంద్రగిరిపై మడుగులోనున్న మద గజేంద్రంలాగా కొంతకాలం సంచరించాడు. సకలవిద్యా ప్రసాదియైన చండకిరణునకూ, సర్వాస్త్ర శస్త్రనిరాకరణ వరప్రసాదియైన ఇంద్రునకూ, అపగత బ్రహ్మాస్త్రబంధమునిగా ఆశీర్వదించిన స్వయంభువునకూ, దిక్పాలకాది సకలదేవతలకూ సవినయంగా నతులొనరించి ప్రయాణసన్నద్ధుడై తూర్పుదిశకు తిరిగి తండ్రిని మనసారస్మరించి, దక్షిణదిక్కై నీరధి దాటేందుకు మేనుపెంచాడు. ఆ శరీరం పర్వదినాల్లో అంబుధిలాగా అంతకంతకు పొంగి నింగిని తాకింది. రామకార్యార్థం శతయోజన విస్తీర్ణమైన సాగరం లంఘించే శక్తి తనకు ఉన్నదో లేదో ఒకసారి తానే పరీక్షించుకుంటే మంచిదని భావించాడు.

# మారుతి విక్రమానికి మహేంద్రగిరి చీకాకుపడుట

పదఘట్టనంతో పర్వతాన్ని భూమిలోకి అదిమాడు. చేతులుచాచి వేరొక శిఖరాన్ని పట్టుకుని ఉర్వీధరాన్ని ఉయ్యేలలూగించాడు. అచలమైన ఆ మహానగం ముహూర్తకాలం కపీంద్రకర పీడితమై ప్రచలితమైంది. అచలామహాలు సుమనోనిచయాలను పర్వతం నిండారాల్చాయి. ఒక్కసారిగా రాలినపూల క్రొత్తావిబిగువులుకొని పర్వతాన్ని పరిమళభరితం చేసింది. వీర్యవంతుడైన హనుమచేత పీడింపబడిన గిరి మదాన్ని మాతంగం కార్చినట్లు జలాన్ని స్రవించింది. వడవడ శైలం వణకుతుంటే మడికాసుపై వినమ్రాంజనంవుండే పొరల వాళ్ళు తరతరంగా ముసుగుదీసిన విధంగా కనుపించినై. హనుమంతుని కరపీడనం సహించలేక ధగధగమంటూ మండుతూ పొగలు క్రక్కుతున్న అగ్నిలాగా మణిశిలల గుండ్లను శైలం క్రిందికి త్రోసింది. ఉదరం గడగడలాడుతుంటే గహ్వరాల్లో వసించిన మృగాలు వడిచెడి, మడిబడి అదలుతూ దిగంతాలకు పారజొచ్చినై. పర్వత సానువుల్లో విహరించే భుజంగకోటి విపులమైన పడగలువిప్పి దవానల సదృశమైన విషాన్ని ఫూత్కరిస్తూ, పెనుతాళ్ళనుదంష్ట్రాహతం చేస్తుంటే ఆ రాళ్ళు సహస్రధా ఛిన్నాభిన్నమై పెళీలని పెట్లిపోతునై. విషహరణ సమర్థాలైన ఎన్నో మూలికలు వుండికూడ ఆ విషశక్తిని హరింపలేకపోయినై. ఆ విషం ఎంత విషమ విషమో!!

పర్వతంబ్రద్దలై, బ్రతుకుబ్రద్దలవుతుందేమో అని భీతితో, పానపాత్రలు, భక్ష్యలేహ్యాలు, పైడిపళ్ళ మొలదాకులు, హారాలు, కంకణకేయూరాలు, ఫల్లిలారవోద్భటమంజీరాలు, సుమనోహారాలు ఎక్కడివక్కడ వదలిపెట్టి, తరళాక్షులు మెడలో హారాలు చిక్కుపడ, చీరకుచ్చిళ్ళుజారి పాదాలకు అడ్డుపడ, పయ్యెదలు గాలికితొలగి మేఘం చంద్రునివలె, ముఖాలుగప్ప వెంట పడుగిడగా, కాందిశీకులై విద్యాధరులు ఆకాశానికి ఉద్గమించారు. సస్మితమై రమణులతో విహరించే విద్యాధరాంగనలు సుకశాత్రవపుస్మరుడైన హనుమంతుని చేష్టలకు విస్మితలై కాసుకలాపం నుంచి విస్మృతలై మింటినుంచి కపీంద్రుని అనిమిష వాసం సార్థకంగా చూడసాగారు. విద్యాధరవరముఖ్యులు విద్యాశోభ వెలయగా ద్యోతలంనుంచి ఆ పర్వతం పడుతున్న పాటును చోద్యంగా చూచారు.

సిద్ధచారణాదిదేవానీకం "శైలాకారుడై అంజనా సుతుడు రామకార్యార్థం అపారమైన సముద్రం అవలీలగా దాటబోతున్నాడు. చూపులు ఫలించేలాగా చూడండహో!" అంటూ హెచ్చరికలు చేస్తున్న మాటలు విద్యాధర బృందం వీనులవిందుగా వింటున్నది. ఆ మాటలు వినగానే విద్యాధర పాళి ప్లవగవరుని వీక్షించి అద్భుతరసాత్మకమైంది. కొండంతటి వేసే వంపి దేహంతోవున్న కపికుంజరుడైన హనుమ మేను విదలించి, రోమాలను నిక్కించి, వర్షాగమార్భటంవలె దిగ్గజకర్ణ మహావిపాటనంగా బిట్టురిమాడు. దీర్ఘమై, ఉద్ధతమై, అనుపూర్వీవృత్తమై, రోమాంకుర సంచితమైన లాంగూలాన్ని గరుడుడు సర్పంవలె వేగంగా విదిల్చాడు. ధీర బలుడూ, అద్భుత సాహసవంతుడూ అయిన హనుమంతుని, వానరశ్రేష్ఠుని పుచ్ఛవాలం ఆయన వీపుపై వైనతేయగృహీత సర్పీకరంవలె శోభిస్తూంది.

## హనుమ ఆకాశానికి లంఘించి వేగంతో సెలవు తీసుకొనుట

ఆకాశం నిర్మలమైంది. మలయమారుతం మంజులమనోజ్ఞ సకల సుమ పరిమళభరితమై మంగళప్రదంగా వీవసాగింది. శకుని సంతానం శకునపురస్సృతంగా గమన కార్యసిద్ధికి కట్టీతీర్చింది. లంకలో రావణాంతఃపుర పరిచర్యలో విసిగివేసారుతున్న దేవతాస్త్రీగణం గుండెలలోని దుడుకు కొండలు కూలిపోయినై. పంక్తిముఖుని రథ పతాకం చివర గ్రద్ద వ్రాలింది. పర్వతరాజు ప్లవగపతినిచే పరిపీడితుడైనా, ధృతి చెదక మతిమంతుడైన హనుమంతుని పాదారవిందాలు శీర్షంపై ధరించి త్రివిక్రముని పాదం మస్తకంపై దాల్చి జన్మ ధన్యమైనదని భావించిన బలిచక్రవర్తివలె తన్ను భావించుకుని పదఘట్టన సమయంలో క్రుంగకుండా దాచిన్నే విధంగా ఉన్నతశక్తి సంపన్నుడైనాడు. తననింత కాలం బాధించిన దైత్యుని వినాశం దాపురించిందన్న సంతోషంతో హాహాకారాలు కలిసేంతవరకూ నీటితో నిండిన సింధు హనుమద్గమనానికి తనలో తాను పొంగిపొర్లిపోతూంది. విమానపథమై వేల్పులు వినువీధినిల్చి జగత్స్రష్ట్యాది జరుగని అద్భుతకార్యం హనుమంతుడు చేయ

పోతుంటే విస్ఫారితనయనాలతో, విస్మయచిత్తంతో వీక్షిస్తున్నారు. ఒక్కసారి వాయుజుడు వాలం ఝళిపించాడు. పరిఘలవంటి బాహువులు స్తంభించి, భుజాలు, మెడ ముడిచి, మోకాళ్ళు సగం ముందుకు వంచి పాదాలు రెండూ జోడించి, కదిలించి, చెవులు రిక్కించి, పెదవులు బిగించి, కటిభాగంలోనికి ఒంచి, కంటిరెప్పలు ఎగయించి, దూరం తిలకించి, ఊర్ధ్వభ్రమంపై కాళ్ళూదిపించి, శ్వాసబిగించి, తమితో పులకరించి, బయలుచూపించి, నిర్భయత్వమించి, రామకార్యం, రాజాజ్ఞ తలంచి, స్వీయ పరాక్రమం ఎంచి, పెంపు వహించి వేగముప్పొంచి ఎగిరాడు. గగనానికి ఎగిరిపోతూ కపి నాయకులచూచి అనునయుడైన హనుమ తన మగతనం పుట్టిపడేలాగా, "శ్రీరఘురామ కోదండ నిర్ముక్త శరంలాగా పోయి లక్ష్యమైన లంకలో ప్రవేశిస్తాను. అక్కడ సీతమ్మను అన్వేషిస్తాను. కనపడకపోతే స్వర్గపాతాళాలు భేదిస్తాను. అప్పుడుకూడ అమ్మజాడలు తెలియకపోతే రావణుని నా తోకతో కట్టి తెస్తాను. ఇంత శ్రమ ఎందు కనుకుంటే లంకనే త్రవ్వి తెస్తాను. ఏలాగైనా నా తల్లి జాడ కాని వస్తాను. సందేహం మాని ఆనందానంతో ఉండండి. నాకు సెలవిస్తారా?" అంటూ, తన్ను తన తండ్రిగా, ఖగేంద్రునిగా తలంచుతూ మహావాయు పథానికి ఎగిరిపోయాడు.

## పావని గమనవేగ వర్ణనం

కుప్పించి ఎగసి మహావాయు పథంలో మారుతి పోతుంటే, ఆ వేగానికి వ్రేళ్ళతోసహా పెళ్ళగిల్లి వెంటవెంటవస్తున్న పక్షి ఫలపుష్పకలిత వృక్షాలు దూరంపోతున్న చుట్టాన్ని సాగనంపటానికివచ్చినబంధువుల్లాగా పొడగట్టినై. సేనాపతి ననుసరించి పోతున్న సేనల్లాగా మహాబల సుత వేగ వశ్యులై పాదపాలు హనుమ వెంట పోతున్నై. పండిన పూచిన పూలతో నిండిన శాఖలు వెన్నంటగా కపి వేదండం పుష్పితంలాగా భ్రాంతి కల్పించింది. ఆంజనేయుని ప్లవగ వేగానికి కూడ వచ్చిన వృక్షాలు శక్తిహీనములై ఇంద్రుని వజ్రాఘాతానికి భయపడి సముద్రంలో మునిగే పర్వతాల్లాగా గుభాలున అంభోధిలోపల మునిగిపోయినై. మిణుగురు పురుగుల కాంతితో రాత్రి ప్రకాశించే భూధరంవలె జలధర సన్నిభ తను

డైన హనుమ సకల పుష్ప సంతానంతో గగన పథంలో ప్రకాశించాడు. హనుమంతుని చూడలేక సముద్రంలో పడుతున్న అవనీజాలు ఉదకం వుండే తావువరకు మిత్రుణ్ణి సాగనంపి మరలే మిత్రుల్లాగా కనిపించినై. హనుమ వేగానికి లేచిపోయిన చెట్లు ఉరవడి తగ్గి ఉదధిలోపడి మునుగుతుంటే విచ్చిన పూలు తేలి పర సహస్రంగా పరివ్యాప్తి పొందటంతో నీరాకరం తారా పరివృత సుధాకర బింబంలాగా వుంది. నానావర్ణ విరాజిత సూనావృతుడైన హనుమ మెరుపులతో కూడిన మేఘంవలె వున్నాడు. ఉడు పథంలోపోతూ మారుతి చాచిన హస్తాలు పర్వతంపై నుండి తలలు నిక్కించి పరతెంచుచున్న పంచశిరః ఫణాధరాలవలె భాసించినై. క్రిందికిమీదికి దిగుతూ, ఎగురుతూపోతున్న హనుమానుడు "సముద్రాన్ని ఆకాశాన్ని త్రావుతున్నాడా?" అన్నట్లు తోచాడు. కొండల్లో మండే పెను మంటల్లా, మెరుపులాగా, పింగళవర్ణంవలె వెలిగే పావని నేత్రాలు ఏక సమయంలో వుదయించిన దివాకర నిశాకర బింబాల్లా వున్నై. అరుణ వర్ణంతో ప్రకాశించే హనుమ వదనబింబం, నాసికా, సంజ కెంజాయ సోకుతో సపుడు మిగిలే అరుణవీథితి మండలమున్నట్లు ఒప్పినై. మారుతి పోతూపోతూ మార్గంలో లాంగూలం ఆడించగా ఆకాశంలో అసురపతి ధ్వజంలాగా ఆశ్చర్యం కలిగింది. హనుమ పిరుదులపై వెలిగే తరుణారుణకాంతి తెరపలు తెరపలుగా కనిపించే శైలం జేగురుధాతువులాగా వుంది. వెలుగుతున్న వెలికోరలతో, వలయాకారంగా వున్న వాలంతో ధీమంతుడైన హనుమంతుడు పరివేషం మధ్య భాసించే పద్మారివందంగా వున్నాడు. ఉత్తర దిశనుంచి దక్షిణానికి ఒత్తుకునిపోయే తోకచుక్కవలె లాంగూలధారియైన హనుమ లంకవైపు నిశ్శంక వృత్తితో గమించాడు. ఒడిసెల విసరునపోయే రాయివలె వియదధ్వంలో పోతున్న హనుమ బాహుమూలాల్లోనుంచి వస్తున్న వాయువు ధ్వని ఉరుములాగా భీషణంగా మొరసింది. నింగి తెరవునపోతున్న పతంగునివలె పొంగిపోతున్న మారుతి నడుమునకు త్రాడు గట్టిన తీక్ష్ణభూతంలాగా ఉన్నాడు.

అంబువుల్లో ప్రతిబింబం, అంబరంలో రూపు వెలయంగా పోతున్న అర్థభాగం నీళ్ళలో మునిగి వాయువశంతో పోతున్న ఓడవలె వున్నాడు. ఆ మహామూర్తి ఆకాశ పథంలో పోతున్నంత దూరం

ఆ భీమ వేగానికి సాగరం ఉన్మాదివలె సంక్షోభితమైంది. వాయుపీడనంతో ఉల్లోల కల్లోలమై ఉదధి మిన్ను మింగేలాగా తరంగాలతో విజృంభించగా వాయుసుతుడు తన గమన వేగంచేత కలిగే కమవలి కాళ్ళచే తన్నుకుంటూ పోసాగాడు. పావని ప్లవ వేగ సంభవ ద్వాయువూ, జలదాళిగ సంతానం ఒక్కటై సముద్రుణ్ణి తరంగ హస్తాలను పట్టి లాగుతుంటే, మీమీ హద్దులు దాటవద్దన్నట్టు హనుమ ఈ చివరనుంచి ఆ చివరకు హద్దు గీస్తున్నట్టు పోతున్నాడు. ఆకసం అంట లేచి విరుగుతున్న సముద్ర తరంగాల వున్నతికీ, మేరు మందర పర్వతాల ఉన్నతికీ, సాదృశ్యం తలపోస్తూ కేసరి ముందుకు పోసాగాడు. పవనజ జవనజ పవనం మున్నీటి నీటిని మింటికి ఎగజిమ్ముతుంటే అది నవన ధవళై శరదభ్రంలాగా వెలుగ జొచ్చింది. గుడ్డ తొలగిస్తే శరీరానికి అవయవాలన్నీ కన్పించినట్లు, అంభస్సులు అంబరం చుంబించేసరికి అంబుధిలోని తిమికచ్ఛప ఝషనక్ర భుజంగాలు స్పష్టంగా గోచరించినై. విహాయస మార్గంలో పిడుదైన పంచముఖుడు పోతుంటే జలధిలోని భుజంగాలు ఖగేంద్రుడేమోయని కళవళపడి ముక్కుసొమ్మలు పోయినై. పది ఆమడల వెడల్పూ, ముప్పై ఆమడల నిడివీ కలిగి పావని దేహచ్ఛాయ మేఘంవలె సముద్రంలో పొడకట్టగా ముందుకు పోసాగాడు. ఆలంబనరహితమైన అంబర మార్గంలో హనుమంతుడు గమిస్తుంటే రెక్కలున్న కొండలాగా గోచరించాడు. హనుమ పోతున్న అంబుధి మార్గమంతా ద్రోణీకృతం కాసాగింది. పక్షుల్లో ఖగపతిలాగా వాయువలె మేఘాన్ని వాయుపుత్రుడు తూలిస్తూ, సర్వావయవ రోచిస్సులు, సితాసిత రక్తమాంజిష్ఠ వర్ణాలను గగన ఫలకంమీద చిత్రించగా, మేఘాచ్ఛాదనా పగతదశలవల్ల చంద్రుడులాగా వెలిగిపోతూ సముద్రం దాటుతుంటే దేవ దానవ యక్ష గంధర్వ కిన్నరాదులు పుష్పవృష్టి కురిశారు. తన అంతేవాసి లోకకళ్యాణ భావంతో మింటిపై పోతుంటే రవి ఖరకిరణాలను శీతకిరణాలుగా మార్చి దీవించాడు. రామకార్యార్థం పోతున్న కుమారునకు సమీరుడు శ్రమకలుగకుండా వీవసాగాడు.

## అంబుధి హనుమకు తోడ్పడ యోజించుట

సుపర్వులు బళిబళియని మెచ్చారు. కిన్నరులు బాపురే అంటూ స్తోత్రాలు చేశారు. ఓహో అంటూ మునులు ప్రశంసించారు. విబుధ ప్రకరం సై సై అంది. యక్షులు మేలుమేలన్నారు. జగదాశ్చర్యానంద కరంగా మింటిపై పోతున్న బాపజితమేరువైన హనుమంతుని సముద్రుడు చూచి "ఈ తరుణంలో ఈ హరిశ్రేష్ఠునకు ఏవిధంగా సహాయం చేసి ఇక్ష్వాకులపై నాకున్న అభిమానం తెలపాలి" అని ఆలోచించాడు. "సగర భూపతివల్ల పోషింపబడ్డాను. ఈతడు ఆ వంశంలో పుట్టిన రఘురాముని దూతగా పోతున్నాడు. మార్గంలో మిక్కిలి శ్రమ పొందకుండా చేయాలి. ఏంచేస్తే బాగుంటుంది?" అని తర్కించాడు. "నా వృద్ధికి హేతువైన వంశంలో జన్మించిన పురుషోత్తముని ఆజ్ఞాను వర్తియై పోతున్న ఇతనికి మేలుచేయకపోతే లోకం నన్ను చీకొట్టుతుంది. కృతఘ్నుడననవుతాను. ప్రయాణ మధ్యంలో కొంత బడలిక తీర్చుకుంటే మీది పని సుకరం అవుతుంది. అందుకు తగిన అవకాశం కల్పించాలి" అని నిర్ణయించాడు. ముహూర్తకాలం యోచించాడు. తటుకున స్ఫురణ వచ్చింది. సంతోషం పెల్లుబికింది.

## మైనాకునితో సముద్రుడు ముచ్చటించుట

"పూజ్యుడా! హిరణ్యనాభా! నేనొక విషయం నీకు చెప్పదలచాను. ఉభయులకది క్షేమం కలిగిస్తుంది. నాకు పూజ్యులైన వారు నీకూ పూజ్యులేకదా. అధోభువనవాసులైన దానవులు మర్త్యలోకం ప్రవేశించకుండా ఆ యసవీకరోపు పరిఘాకృతిగా వేల్పులరేడు నిన్ను నాలో నిలిపాడు. పతంగంవలె నీవు నలుదెసలు పర్యటించగలవు. ఇప్పుడు సగరవంశంలో జన్మించిన రాముని కార్యంకోసం భీమబలుడైన హనుమ అంబరం ఒరిసి పోతున్నాడు. నెయ్యంతో తియ్యదనంచేర్చి నీవిప్పుడు సాచివ్యం సలుప వలసివుంది. చేయవలసిన పని సమయంలో చేయకుండావుండే సజ్జను లైనవారు కోపించి కూళ అని నిందిస్తారు. ఆ అపవాదు రాకుండా, చేసిన పని లోకం హర్షించేట్లుగా చేయదలచాను. అందుకోసం నీవు నీ ధర్మం గుర్తించి నాలోనుంచి లేచి వెలుపలికిరా. మారుతాత్మజుడు మనకు అతిథీ, పూజ్యుడూ. నీవు అతనికి ఎదురుగాపోయి బడలికతీరేదాకా నీ

శిరంపై ఆతణ్ణి ధరించు. విశ్రాంతినందినపిమ్మట సులభంగా శేషమార్గం దాటగలడు. ఇది రామచంద్రుని ఉత్తమశీలతకూ, భర్తృవియోగంతో పరితపిస్తున్న సీతకూ, లంకా ప్రవేశంకోసం పయనించే కపీశ్వరుని గుణశ్రమకూ సంబంధించిందిగా నీవు భావించి లోపలినుంచి బయటికిరా. వచ్చి నేను చెప్పినట్లు హనుమ సేదతీరేవరకూ ఆతణ్ణి సేవించు" అని చెప్పాడు. "నీకు శుభం కలుగుగాక" అని దీవించాడు. పరమోపకార బుద్ధితో ఆశ్రయం ఇచ్చిన అంబుధి పల్కులకు మైనాకుడు హర్షోత్ఫుల్ల మనస్కుడై అభినందనపూర్వకంగా అంగీకరించాడు.

## మైనాకుడు హనుమంతుని కెదురు వచ్చుట

పయోనిధి పలుకులకు హర్షించిన పర్వతశ్రేష్ఠుడు ఆకాశాన్ని చీల్చుకుని వచ్చే రవి బింబంలాగా జలాన్ని రెండు పాయలుగా చీల్చుతూ, నాగ కిన్నర విద్యాధరాదులతో కూడిన కూటములొప్పగా అసితవర్ణమైన అభ్రాన్ని సువర్ణకాంతులతో ముంచెత్తుతూ రివ్వున వినువీథికి ఎగిరాడు. శతసూర్యోదయ రోచిఃపటల సదృశంగా మార్గమధ్యంలో నిలిచిన మహీధరాన్ని మారుతి చూచాడు. "ఓహో! ఇంతకు పూర్వంలేని ఈ పర్వతం ఇప్పుడు ఎక్కడనుంచి వచ్చింది? ఎందుకు వచ్చింది? నా కార్యం విఘ్నం చేసే తలంపుతో ఇది వచ్చి వుండవచ్చు. దీనికి నా శక్తి లఘువుగా తెలిపి దాటిపోతాను" అని చింతించి, వేగం హెచ్చించి, శక్తిని పెంచి ఎదుటగా నిల్చిన పర్వతాన్ని తలతో ఢీకొని తాకాడు. ఆపిడుగుపాటు వంటి తాకుడుకు అదరిపడి, దిమ్మెరపోయి గాలి తాకుడు మబ్బులాగా పర్వతం తొలగిపోయింది. వెంటనే నిలువరించుకుని, ధైర్యంపుంజుకొని మానవాకారంతో స్వీయశిఖరాగ్రంపై నిల్చి మైనాకుడు "ఆహా! ఆంజనేయా! నీ జవసత్త్వాలు నాకు పరమాశ్చర్యం కలిగించాయి. నన్ను ఢీకొట్టి సజీవంగా వుండటం నీకే సాధ్యమైంది. నీ పోతున్న కార్యం నిర్విఘ్నంగా నెరవేరుతుంది. నీకు లంకా ప్రవేశం సుకరమవుతుంది. కామసంతాపులైన రాత్రించరుల గుండెల్లో గాలంగా నీ అన్వేషణ ముగుస్తుంది. రామపత్ని క్షేమమూ, రాక్షసరాజు పరాక్రమం తెలుసుకుని సిగపూవు వాడకుండా తిరిగివస్తావు. నీ సాహసం నాకు మెచ్చువచ్చింది.

మేలుచేసే వారికి మేలుచేయటం సనాతన ధర్మం. సాగరుడు సగర చక్రవర్తిచే పరివర్ధితాత్ముడైనందున, నీవా వంశశ్రేష్ఠుడైన శ్రీరామ చంద్రుని కార్యార్థం పోతూండటం చూచి, నీకు సాయపడి బహూ కృతుడు కాదలచి నన్ను పిలిచి "నగశేఖరా! మింటివంక చూడు. ఆ పోతున్నవాడు రామకార్య ధురంధరుడైన హనుమంతుడు. నూరామడల దూరం ఒక్క బిగిని దాటటం కష్టం. నీవు అభిముఖంగా పోయి, నీ శిఖరావనిలో బడలికతీరేవరకూ అవకాశం కల్పించు. అతడు విశ్రాంతి అనంతరం కడమభాగం వడకొనక హాయిగా పోతాడు. జగత్కల్యాణ కారకమైన కార్యంలో మనం మనశక్తికొలది తోడ్పడుదాం" అని ప్రేమతో చెప్పాడు. నేను నీకు విశ్రాంతికొలప వచ్చాను. విఘ్నకారిగా రాలేదు. నీకిష్టమైనంత కాలం నా శిఖరంపై విశ్రమించి, తియ్యని కంద మూలాలుతిని సేదతీరిన పిమ్మట నీవు యథేచ్ఛంగా పోవచ్చును. ఎరుగని వారిని ఆదరిస్తేనే లోకం ఎంతో మెచ్చుకుంటుంది. ఇక నీవంటి త్రిలోకపూజ్యుణ్ణి సేవిస్తే చెప్పేదేముంది? నీవు నాకు అతిథివి. ఆనందంగా నా ఆతిథేయాన్ని అందుకో. ధర్మవిదులకూ, ధర్మజిజ్ఞాసువులకూ సామాన్యుడు అతిథిగా వచ్చినప్పుడే పరమ పూజార్హుడవుతాడు. ఈనాటికి శిష్టుడవూ, బంధుడవూ అతిథిగావస్తే గృహస్థునకు అంతకంటే కావలసిందేముంది? నిన్నర్చిస్తే నాకు మేలు కూర్చిన నీ తండ్రిని అర్చించినట్లే అవుతుంది! నా ప్రార్థన మన్నించి క్షణకాలం విశ్రాంతి తీసుకో. సాగరుడూ, నేనూ ప్రత్యుపకారబుద్ధితో సలిపే ఈ అర్చన నీవాదరించక తప్పదు. మనంపైగా బంధువులంగదా. ఆ సంగతి వివరిస్తాను. ఆలకించు.

## మైనాకుడు తన పూర్వచరిత్ర హనుమకు తెలుపుట

పూర్వం కృతయుగంలో పర్వతాలన్నీ పక్షాలు కలిగి వుండేవి. అవి వైనతేయు వేగాన్ని కలిగి స్వేచ్ఛావిహారం చేస్తుండేవి. విను వీథుల్లో విచ్చలవిడిగా తిరుగుతుంటే మునులూ, దేవతలూ, భూతకోటి తమపై పడుతవనే భయంతో ఇంద్రుడికి తమబాధ విన్నవించుకోగా, ఆయన ప్రచండకోపంతో గిరుల పక్షాలన్నీ వరుసగా నరుక సాగాడు.

నేను తప్పించుకోలేక తటపటాయిస్తుంటే, నీ తండ్రి ఇంద్రుని వజ్రానికి అందకుండా అతివేగంతో నన్నునెట్టుకుని వచ్చి ఈ అంబుధిలో పడవేశాడు. తనకడ్డం వచ్చి నన్ను కాపాడిన నీ తండ్రిని "ఈ విధంగా ఎందుకు చేశా"వని ఆగ్రహంతో అడిగాడు. అప్పుడు నీ జనకుడు నన్ను కాపాడే చిత్తంతో "ఇందుకొక కారణం వుంది. పాతాళవాసులైన అసురులు మాటిమాటికీ మనపై దండెత్తి రాకుండా అంబునిధిలోని ఆ మార్గం ఈతనిచే మూయబడుతుంది. మనకు రక్షణగా వుంటాడు. అందుకోసం ఈ పనిచేశాను. అలస్యమైతే కార్యభంగం కలుగుతుందని ముందుచేసి పిమ్మట నీకు తెలుపుదామనుకున్నాను." అని చెప్ప గానే వజ్రి శాంతించి నన్ను వదిలేశాడు. ఆ కారణంగా నేను నీ జనకునిచే కాపాడబడ్డాను. మన బాంధవ్యం ఏమిటో తెలుసుకున్నావు కదా. నా మైత్రి సంభావించి, నా ఇచ్చే సపర్యల స్వీకరించి, నా విజ్ఞాపన పాలించి ఆతిథ్యం గ్రహించు. నన్నూ, సాగరుణ్ణీ పరితుష్ట చిత్తులుగా సలుపు. నీవూ సంతుష్టి పొందు. నిన్నర్థిస్తున్నాను. నా అభ్యర్థన వ్యర్థం చేయవద్దు. నిన్ను చూడటంతో ఎంతో సంతోషం కలిగింది. మాటి మాటికి నీవు రావు. మేమూ సత్కరించలేం" అంటూ మిక్కిలి వినయంతో "మనోజవం, మారుతతుల్య వేగం, జితేంద్రియం, బుద్ధిమతాం, వరిష్ఠం, శ్రీరామ దూతం, శిరసానమామి." అని నిల్చాడు.

మైనాకుని వినయ భాషణాలకు మారుతి మిక్కిలి సంతోషించాడు. ప్రీతిపూర్వకంగా చూస్తూ "నగరాజా! నీవు చెప్పిన విషయంవిన్నాను. మీ హృదయాలను అర్థంచేసుకున్నాను. అన్ని సపర్యలు నేను అందుకున్నట్టే తృప్తిపడ్డాను. నేను మా వాళ్ళతో దారి మధ్యలో ఆగనని చెప్పివచ్చి ఆగటం ధర్మంకాదు. నన్ను కార్యం, కాలం రెండూ తొందరచేస్తున్నై. ఆగలేదని ఏమీ మీరు అనుకోవద్దు. మాకు ప్రభు విచ్చిన కాలం ఎప్పుడో దాటిపోయింది. నా రాకకోసం మా వాళ్ళంతా ఎకపాదులై ఎదురుచూస్తుంటారు. నేను వాళ్ళతో చెప్పిన గడువుకు ముందే రావాలని నా సంకల్పం. ఇన్ని బలవత్తర హేతువులచే ఆగ కుండా పోవలసివస్తున్నది. అన్యథా భావించవద్దు. మీ ఆదరణపూర్వక వాక్కులచే ఆయాసం ఎప్పుడో తీరిపోయింది. ఇక నాకు సెలవు."

అంటూ తన పాణిపల్లవంతో శైలరాజును స్పృశించి, వేగం హెచ్చించి, ఊర్ధ్వానికి ఎగిరి మైనాకుని ప్రేమతో వీక్షించి, మిగిలిన దూరాన్ని గమిస్తున్నాడు. అనితర సాధ్యమైన అంబుధి తరణం కోసం లంఘించటంతో హనుమ ప్రథమ విజయం సాధించాడు. శ్రమనివారణార్థం జలధి కల్పించిన అవకాశాన్ని ఆదరించి ఆగకుండా ప్రయాణించటంతో ద్వితీయ విజయాన్ని ద్విగుణీకృతంగా సాధించాడు. ఆ కార్యదీక్షకు అమరులంతా ఆనందించారు. అమరేంద్రుడు రామదూతపట్ల చూపిన సౌహార్దానికీ, ఆప్యాయతకూ హర్షంపొంది "మైనాకా! నీవు చేసినదానికి నేను చాలా తృప్తిపడ్డాను. విహితంతోనైనా హనుమ గమనాన్ని నిరోధించాలని సంకల్పించి సాగరునకు ప్రబోధం కల్పించావు. ఆతడు నిష్కార్యసాధకుడుగా నిలిచాడు. నీవు గృహస్థ ధర్మం కొదువ లేకుండా నెరవేర్చావు. హనుమ పరీక్షలో నెగ్గాడు. నీవిక నావల్ల కలిగే ప్రమాదానికి భయపడవద్దు. నీకు స్వేచ్ఛ ప్రసాదించాను. ఇక నీవు అభిమతానుసారం సంచరించు. "నూరామడల దూరం ఏకఘటిగా ఎలా హనుమ దాటుతాడా?" అని సంశయించే మాకు నీవు కల్పించిన ముహూర్తకాల విరామం శతగుణితంగా ప్రయోజనం పొందింది. నీ జన్మచరితార్థమైంది" అని పల్కగానే హిరణ్యనాభుడు పునర్జీవితుడైనట్లుగా తన్ను భావించుకుని, మహాత్ములపట్ల చేసిన సేవ అల్పమైనా అత్యధికంగా ఫలమిస్తుందన్న పెద్దల పలుకులు తనపట్ల ప్రత్యక్షంగా ఋజువైనందుకు మోదం పొందుతూ, స్వస్థానం చేరుకున్నాడు. నిరాలంబ మార్గంలో హనుమ నిరాటంకంగా పోతున్నాడు.

## హనుమ గమనాన్ని సురస అడ్డగించుట

హనుమంతుడు చేసిన అద్భుతమైన రెండు పనులకూ మురిసిపోయిన మునులూ, సురలూ నాగమాత సురసను రప్పించారు. "అమ్మా! నీవు మహాశక్తి సంపన్నురాలవు. హనుమ రామకార్యార్థం లంకకు పోతున్నాడు. మేం ఆతని శక్తినీ, దీక్షనూ పరీక్షించాం. ఆతడు అనుమానలేశంకూడా మిగులకుండా నెగ్గాడు. ప్రవేశించేది లంక. రాత్రించరులంతా కామరూపులు. బలసత్త్వ సంపన్నులు. రావణరక్షితమైనలంకలో

పోటుటీగకూడా చొరపడలేదు. ఈ మహాకాయుడు ఏ విధంగా అక్కడ అన్వేషిస్తాడో, వాళ్ళకు చిక్కకుండా వస్తాడో, యనే సందేహం మమ్మల్ని బాధిస్తుంది. నీ వాతని నిరోధించాలి. నీ నిరోధంతో అతని మేధా, సమయస్ఫూర్తి మాకు తెలియాలి. నీవు చేసేదే చివరి పరీక్ష. ఇందులో నెగ్గితే ఇక మా సంకల్పం నిర్విఘ్నంగా చివరంట సాగుతుంది. వైనతేయవాయుజవాలను మించిపోతున్న మనోజవుణ్ణి, మారుతిని మహా ప్రాకారం దానవిగా దారిలో అడ్డగించు. పెనుకోరలతో, మంటనీ మింటనీ కలిపే నోటితో, ఎర్రని మిడిగ్రుడ్లతో, భీకరంగా ఎదురునిలుచో. నిన్ను బుద్ధితో దాటుతాడో, బలంతో దాటుతాడో మేం చూస్తాం" అని కోరారు. అందుకు నాగమాత అంగీకరించింది. వెంటనే కామ విద్యా శక్తితో దుర్నిరీక్ష్యంగా, దుస్సహంగావుండే రాక్షసిరూపం ధరించి, వార్ధిలోంచి పైకివచ్చిన చందంగా వచ్చి, నీళ్ళపై పాదాలుపెట్టి హనుమ మార్గానికి అడ్డంగా శరీరం పెంచి అవరోధిస్తూ, "ఓ కోతీ! ఎక్కడకు పోతావు? ఎదుర నిల్చింది ఎవరో ఎరుగుదువా? దేవతలు నాకు నిన్ను ఆహారంగా విధించారు. అందుచేత నీవు నన్ను అతిక్రమించిపోలేవు. కాలహరణం కాకుండా నీయంత నీవే నా నోటిలోపడు. మాటలతోనూ, మర్యాదలతోనూ నాకు పనిలేదు. వంచనతో తప్పించుకోటం నిన్ను నీవే వంచించుకోటం అవుతుంది. ఉన్న సంగతి చెప్పాను. అసత్యం అనుకుంటే అది నీ దోషమే కాని నా దోషం కాదు. ఆగు. అడిగిన మాటకు సమాధానంచెప్పి అడుగు ముందుకుసాగు." అని సురస ప్రళయ భీకరంగా పలికింది. ఆ మాటలు దూరంనుంచే విని హనుమ రెండు చేతులు జోడించి నమస్కరించి "దేవీ! నీవు చెప్పింది విన్నాను. నీకోరిక నెరవేరుస్తాను. అది ఇప్పుడుకాదు. నేను శ్రీరామచంద్రుని దూతగా, సుగ్రీవుని మంత్రిగా, వానరుల మిత్రుణ్ణిగా రావణ పాలితమైన లంకకు పోతున్నాను. ఆ రాక్షసరాజు నిర్వ్యాజంగా మా రామచంద్రుని భార్యను అపహరించుకొనిపోయి లంకలో దాచాడు. ఆమె క్షేమంగా వున్నదో లేదో తెలుసుకుని మా ప్రభువులకు తెలపాలి. దయతో నాకు దారి ఇవ్వు. ఈ సర్వధరామండలం ఇక్ష్వాకుల వశవర్తిని కనుక, నీవు వారి రాజ్యంలో వున్నావు కనుక వారి మేలు కోరటం నీకు ధర్మం. అందుకు

ఆలస్యం చేయకుండా దారి తొలగటం, నన్ను క్షేమంగా పంపటం నీవిధి. కాదంటే క్షేమవార్త తెలిపి వచ్చి నాయంతట నేనే నీ నోటిలో పడతా"నంటూ వేగం కొంచెం తగ్గించాడు. హనుమ అన్న మాటలకు ప్రత్యుత్తరంగా సురస, "కోతివైనా తెలివికలవాడివే. నాకిప్పుడు ఆకలి వేస్తుంటే ఎప్పుడో నీవు వచ్చి తీరుస్తావా? అందాకా నన్ను ఆకలితో చావుమంటావా? నాపట్ల నీ యుక్తి ప్రసంగాలు పనిచేయవని ముందే చెప్పాను. ఆలసించక, నోరు తెరుస్తున్నాను. అందులో పడిపో." అని అన్నది.

"ఏమమ్మా! ఇంత కఠినంగా మాట్లాడుతున్నావు? సర్వ లోక హితమైన కార్యం నీకు అహితంగా కనుపించిందా? అంత ఆకలి వేస్తున్నదా? అయితే ముందు నీకోరిక తీర్చే పోతాను. నన్ను చూచావుగదా? మ్రింగగలవా? మ్రింగగలిగితే నోరు తెరువు. అందులోపడి పోతాను." అన్నాడు. "బుద్ధిమంతుడవేకాక చమత్కార భాషణుడవు కూడానా? నిన్ను మ్రింగే నోరు నాకు లేదని హేళన చేస్తున్నావా? నా నోట్లో పడిపోతావా? నోటిలోపడ్డ తర్వాత పోవటం ఎక్కడికో నేనూ చూస్తా"నంటూ, సురస హనుమ పెంచిన దేహంకంటే అధికాధికంగా నోరు తెరచింది. "ఎలా పడిపోతావో, అలా పడిపో" అంటూ గద్దించింది. హనుమ గమనాన్ని పూర్తిగా స్తంభించి, లిప్తకాలం సురస కంటికి అగోచరుడైనాడు.

## మారుతి సురస నోటచొచ్చి వెడలి వచ్చుట

"అమ్మా! నీ కోరిక తీర్చాను. నీ నోటపడి పోతున్నాను. నాపై దయవుంచు. దేవతలు నీకిచ్చిన వరం చెల్లింది. నానమస్కారం గ్రహించు. నేనుఉల్లాసంగా సీతమ్మను వెదుకపోతున్నాను.ఈసంఘటన అవమానంగా నీవు భావించక శుభంగాచింతించు"అంటూ హనుమ ఆగకుండా ముందుకు పోతున్నాడు. సురస ఆశ్చర్యంతో ఆ మాటలు విన్నది. "తెరచిన నోరు తెరచినట్టే వుంది. అడ్డగించబడిన హనుమ నిర్నిరోధంగా పోతున్నాడు. నా నోటిలో ప్రవేశించిందీ, నిర్గమించిందీ తెలియనంత వేగంగా అణుమాత్రంలో కార్యం సాధించాడు. సెబాస్." అని మెచ్చుకుంటూ తన సహజరూపాన్ని ధరించింది. రాహువదనగ్రస్తుడై వెలువడిన

చంద్రునులాగా వెలిగిపోతున్న కపికులాలంకారుణ్ణి గాంచి "నాయనా! హనుమా! యథాసౌఖ్యంగాపో. నీవు తలంచిన పనులన్నీ సిద్ధించుతై. రామపత్నిని మళ్ళీ రాముణ్ణి చేర్చు. నేను వచ్చిన పని నెరవేరింది. నీకు శుభం కలుగుతుంది" అని దీవిస్తూ అంతర్ధానం పొందింది. దేవతలు హనుమంతుని తృతీయ విజయంచూచి, అన్నివిధాలా అద్భుతమైన రామ దూతను అభినందించారు. శంకారహితంగా లంకా ప్రవేశంచేసి, రాక్షస మాయల్లోపడకుండా రామపత్ని క్షేమవార్తతో మరలిరాగలడని విశ్వసించారు. మహాశక్తి సంపదగల నాగమాతను అనాయాసంగా నిగ్రహించిన హనుమ, దొంతరగానున్న మేఘమండలాలూ, పరచిపారే పక్షులూ, సంగీతకళా రహస్యాచార్యులూ, ఐరావతం, సింహ శరభశార్దూల గజాధిరోహణులై సంచరించేవారూ, విమానచరులైనవారూ, పిడుగుల చేతా, వజ్రంచేతా పుట్టిన శిఖిశిఖాముచయులూ, నాకంపోయే కృత పుణ్య పురుషులూ, హవ్యం కొనిపోతున్న అగ్నిదేవుడూ, చంద్ర సూర్య గ్రహతారకలూ, దేవముని ప్రకాండులూ, నభశ్చరులైన నాగ యక్ష విద్యాధర కిన్నరాదులూ, దిక్కరులూ, యథేచ్ఛంగా తిరిగే నిరాలంబ పథంలో గరుత్మంతుని విధంగా పక్షాలు కల్గిన పర్వతంవలె హేలగా, లీలగా, గమించినంతమేర కాంతులు కల్పిస్తూ పోతున్నాడు.

## మరుత్తనయుడు మాయావియైన సింహికను చంపుట

అంబుధిని నీడ ఆక్రమించుకొనగా ఆకాశంపై పోతున్న మహా కపిని సింహిక అనే దానవి చూచింది. "అబ్బా! ఎంత కాలానికి కడుపు నింపే ప్రాణి కనబడింది. ఎన్ని జీవులుతిన్నా ఆకలి తీరలేదు. ఈనాడు తృప్తిగా భుజిస్తాను. నా క్షుద్బాధ నివారణార్థం ఈ మహా కాయుణ్ణి విధి ప్రేరేపించి వుంటుంది. కాకపోతే ఈ ప్రదేశానికి ఎందుకు వస్తాడు? అస్మజ్జన్మ ప్రభృతి ఇంతటి భీకరాకారం దృగ్గోచరం కాలేదు. జాగుచేస్తే దాటిపోతా"డని నీటిపై పడుతున్న హనుమ నీడను నిగ్రహించింది. "గాలివాటంలో పోయే ఓడలాగా సాగుతున్న నా గమనం అభిముఖంగాపోతున్న చందంగా కుంటుపడుతూంది. ఎక్కడా ఏమీ ఆటంకం కనుపించటంలేదే? కారణం ఏమైవుంటుం"దని నాలుగు

వైపులా, మీదా క్రిందా పరీక్షగా చూచాడు. అంబుధిలో ప్రతిబింబిస్తున్న తన నీడను ఘోర రాక్షసి మ్రింగటం గోచరించింది. "ఓహో! సుగ్రీవుడు ప్రత్యేకంగా పిలిచి నాకు చెప్పిన ఛాయాగ్రాహి ఇదే కావచ్చు. సందేహంలేదు. నా నీడను నిగ్రహిస్తే గమన వేగం కుంఠితమై సముద్రంలో కూలగానే ఆహరించాలని ఆ సుర సంకల్పం కాబోలు. ఇట్టి దుష్ట శక్తులు లోకంలో వుండరాదు. దీనిని సమూలయం చేస్తాను." అని పయోధరంలాగా, పర్వతంలాగా శరీరం పెంచాడు. ఆతని విజృంభణాన్ని అరికట్టటానికి పాతాళగుహకు ప్రతిమైన తన నోరు విచ్చి, నీడను వదలి హనుమదారికే అడ్డం నిల్చింది. తత్క్షణం సూక్ష్మ విదుడైన మారుతి అంబరచుంబి కాయాన్ని అంగుష్ఠ మాత్ర ప్రమాణంగా కుంచించి సింహిక నోటిలో దూరబడ్డాడు. కపి వీరుని కార్యవిఘ్నం ఈ విధంగా కలుగుతుందని తెలియని దేవతలంతా హాహాకారాలు చేశారు. "అయ్యో! హనుమంతుడు రాహుగ్రస్త రాకాసుధాకరుడైనాడే. ఇక కావలసిన కార్యంగతి ఏమికావాలె? రావణానుమతి లేకుండా లంకలో ప్రవేశించటం మనకే సాధ్యంకాదే? ఈ మహాభాగుడు చేయగలడనుకుంటే ఈ రక్కసి వాతపడ్డాడే? కర్తవ్యం ఏమి" టని కలతపడసాగారు. ఇంతలో సింహికగర్భం చొచ్చిన వాయుసూనుడు వాడి గోళ్ళతో ప్రేవులుత్రచ్చి వెలికిలాగి రంధ్రం చేసుకుని వెలికి లంఘించి ఉప్పరానికి ఎగిరిపోయాడు. పూర్వకాయంతో మింటిపై పోతున్న హనుమంతుని మహర్షులు, దేవతలు మేలుమేలని శ్లాఘించారు. నిశిత నఖ ఛిన్నదీర్ణమైన సింహిక నిమేష మాత్రంలో ప్రాణాలువీడి సముద్రంలో పర్వతాకారంతో పడి మునిగిపోయింది. "వానరలోక నాయకా! మహాకపీ! నీవు చేసిన పని అన్యదురాసదం. ఇక స్వేచ్ఛగా సంకల్పించిన కార్యం సాధించి అజరామరమైన కీర్తిని సంపాదించు. ధైర్యం, సాహసం, దాక్ష్యం, సన్మతి, నిష్ఠరదీక్ష నీవలె ఎవరికి వుంటాయో వాడు కార్యసిద్ధికలవాడయి తీరతాడు. నీకు సీతా క్షేమవార్త శ్రమలేకుండా లభించు గాక."

# హనుమంతుడు లంకాతీరం చూచుట

అంటూ దీవిస్తున్న ఖచరుల మాటలు ఆలకిస్తూ, ఆహారం కోసం క్రిందికి దిగుతున్న పతంగపుంగవునిలాగా అవతరణం చేస్తూ, మనోహర వృక్షగుల్మలతా మండితమైన తీరప్రాంతాన్ని దర్శించాడు. ఆ ప్రదేశం చిత్రవిచిత్రవర్ణాలతో, బహుధంగులతో, పూర్వాపూర్వ పూర్వ సుందరంగా పుష్ప వనాలతో వెల్లివిరిస్తోంది. తదంత దీపంలో మలయాద్రి, చందన వృక్షసమాకీర్ణమై బంధురగంధ పరిపుష్టమై, హాయికొలిపే వాయువును ప్రసారంచేస్తూ అతిథుల తృప్తిపరచే గృహస్థువలె పాంథులకు సుఖం సంపదాంది. గమ్యస్థానం సమీపిస్తోంది. హనుమ చేరవలసిన తీరం చేరువయింది. చేయవలసిన కార్యం చెడకుండా యోచించవలసిన అవసరం వుంది. ఈ మహాకాయంతోనూ, ఈ జవంతోనూ లంకలో ప్రవేశిస్తే, రాక్షసులంతా భీతులై కొందరూ, ఆశ్చర్యంతో కొందరూ, ఆగ్రహంతో కొందరూ అవరోధం కల్పించవచ్చు. దానితో కాలహరణంతోపాటు కార్యభంగం కలుగుతుంది." అని ఆలోచించి వామనుడు బలిచక్రవర్తిని పాతాళానికి పంపిన విస్మృత యథారూపం దాల్చినట్లు, ఆత్మజ్ఞాని వీతమోహుడై ఇంద్రియశక్తిని కుంచించినట్లు దేహాన్ని సంగ్రహించి సహజరూపాన్ని పరిగ్రహించాడు. త్రికూటమైన మలయ పర్వతంలో వికసిత బహువర్ణ పుష్ప సమాకులవాటికా ప్రదేశాన్ని వీక్షించి, తన శరీర కాంతినీ, ఆకార ప్రమాణాన్నీ సరిచూచి అక్కడ క్రిందికి దూకాడు. పూలపై వ్రాలిన సీతాకోకచిలుకలు గుమతు కందనట్లు, హనుమ క్రమంగా ఆ తోటలవాటున గిరిశిఖరం చేరుకున్నాడు. అపారమైన పారావారం ఆగకుండా సురక్షిత స్థానంలో అవతరించి గిరిశిఖరం చేరటం ఒక ఎత్తు. అడుగడుగునా సుసంపన్నమైన రాక్షసానీకం రక్షిస్తున్న లంకా నగరంలో నిగూఢంగా అన్వేషించటం ఒక ఎత్తు. రాక్షస స్త్రీలే కాక, నర, సుర, కిన్నెర, నాగ, గంధర్వాది కాంతలెందరో నిండి యున్నారు. వారిలో అపరిచితురాలైన సీతను గుర్తించటం అనే ఎత్తు వేయటానికి త్రాసుకు తావు లేక పోవటంతో, దాని విలువ తెలియకుండా మిగిలి పోయింది.

# హనుమ లంక వెలుపలి పూదోటలలో విహరించుట

శిఖరాగ్రం చేరిన కపి శేఖరుడు లంకా పట్టణ సౌందర్యాన్ని మిక్కిలి పరిశీలనతో పరికించాడు. శత్రుప్రవేశ దుర్లభమైన ద్వీపం కావటంచేత, ఆరోగ్యంకోసం, అందంకోసం, హాయికోసం చతుర్దిశల ఎంతో దూరం ఎన్నో పుష్ప వనాలు పెంచబడినై. ఆప్రదేశం, ఆవాతావరణం అంతా ఐహికసుఖభోగాలకు అనువుగావుంది. ఆ వనాలు మర్త్యలోకవనాలకంటే ఎంతో మనోహరంగావున్నై. గోగులు, దేవదారువులు, అవిసెలు, చిరునిమ్మలు, మల్లెలు, రేగులు, అరంటులు, గన్నేరులు, ప్రేంకణాలు, మొగళ్ళు, పూచి, కాచి, మొగ్గ తొడిగి, అరవిచ్చి, పండి, ఫలించిన బ్రేగుతో కొమ్మలు నేలతాకగా వంగి, అతిథి పూజ చేస్తున్న గృహస్థుల్లాగా వున్న వృక్షాలూ, ధాతుకాంతుల్లో ప్రకాశిస్తూ, జల జల పారే సెలయేళ్ళతో హృదయాన్ని ఆహరించే చిన్నచిన్న పర్వతాలూ, నేత్రోత్సవం గావించుతుండగా కొంతసేపు విశ్రాంతి పొందాడు. చిరుగాలికి చెట్ల నుంచి రాలుతున్న పూలు పరిమళభరితంగా పైబడి హనుమ పుష్పమయుడుగా కనుపించాడు. నూరామడల జలధితరించినా అలసటగాని, నిట్టూర్పుగాని పొందని కపివీరుడు "ఏమి ఆపదలైనా నాకేమి లెక్క?" అని తలపోస్తూ, మంజుల మలయ పవన ప్రసాదిత శైత్య సుఖం అనుభవిస్తూ, అంచలు, బేళ్లు,కలువలు, తామరలు, నీటి కోళ్ళు, నెమళ్లు, గున్న ఏనుగులు కూడిమాడి ప్రకృతి సౌందర్యం ఒలక పోస్తున్న సరస్సులను వీక్షించాడు. సీతను ప్రుచ్చిలించి తెచ్చిన కారణంగా, తత్సంబంధులు రాకుండా ముందు జాగ్రత్త కొరకు నియమించిన దైత్యులు విచ్చు కత్తులతో, వ్యక్తి వ్యక్తినీ పరిశోధిస్తూ, ప్రశ్నిస్తూ, సంచరించటంతో సమ్మర్దంగా వున్న వీథులూ, హేమప్రాకారావృతమై అభ్రగ్రహమండలాల ఒరుస్తున్న హర్మ్యాలూ, బంగారు తీగలతో వింత వింత పనితనంతో, తీర్చిదిద్దిన తోరణాలూ, సమయోచిత కార్యావసర త్వరమాణసంచాలనులైన పరిచారికా పరిచారక సహస్రంతో సందడించే రాజ, రాజ్ఞీప్రాసాదాలూ పంక్తికంఠుని బలశాసన విభవసామ్రాజ్యశక్తులకు ప్రతిబింబాలై ప్రకాశించగా, మలయ భూధర సవిధలో విశ్వకర్మ బుద్ధి వైశద్యంతో నిర్మించబడిన లంకా నగరంచూచి, హనుమ "నిస్తు

ల్యం, నిస్తుల్యం" అని నివ్వెరపొందాడు. రావణుని ఉన్నతి మనసారా అభినందించాడు.

## హనుమంతుడు లంకానగరం చూచుట

"ఆకాశంలో వ్రేలాడుతున్నదా? ఈ రూపంతో ఆకాశానికి పోతున్నదా?" అనే శంకను కల్పిస్తున్నదాన్ని, పట్టణ వరాద్యమూ, హృద్యమూ, అనవద్యమూ అయినదాన్ని, తొల్త కుబేరునికి నిలయమైనదాన్ని, ఇదమిత్థం అని వివరించటానికి వీలులేని సుకృతితో, స్వస్థతతో, సౌందర్యంతో ఒప్పుతున్నదాన్ని ప్రాకారజఘన, అస్తోకపూర్ణ జలనవీన వస్త్ర, శూలశతఘ్ని కుంతలపాశ, అట్టాలకవిత వతంసయైన అంగనవలె విశ్వకర్మచే నిర్మితమైనదాన్ని, రాక్షసులచేతా, నాగులచేతా కూడి భోగవతిగా పోల్చదగినదాన్ని, మెండికొండవలె మింటిని రాయుచున్నదాన్ని, సర్పాలు గుహలను సంరక్షిస్తున్నట్లు, పట్టిసశూలముద్గరాది బలవచ్ఛస్త్రహస్త ప్రశస్తమైన భీకర వికార నిశాచర సమూహంతో లక్షించి రక్షింపబడేదాన్ని, మహార్ణవం చుట్టూ పెట్టని కందకంగా శోభించేదాన్ని, లంకానగరాన్ని చూచాడు. ఆ నగరోత్తర ద్వారం చేరాడు. రావణుని మేధకూ, శౌర్యానికీ, పాలనాదక్షతకూ మెచ్చుకోకుండా ఉండలేకపోయాడు. తన భావికార్యం సుకరంకాదని తలపోశాడు.

## లంకను చూచి పావని నివ్వెరపొందుట

"ఆహో! ఏమి ఈ లంకానగర వైభవం? ఏమి ఈ నిర్మాణ చాతుర్యం? ఏమి ఆ విశ్వకర్మ బుద్ధినైశిత్యం? కేవల మానవ మేధ ఎంత చేసినా ఇంత చేయలేదు. ఇది మహాభాగుడైన విశ్వకర్మ తపశ్శక్తిచే సాధించిందికాని అన్యంకాదు. ఇది అప్రధృష్యం. అభేద్యం. నాశన రహితం. సర్వశోభా భాసితం. ఇక్కడికి అసంఖ్యాక వానరానీకం ఎలా వస్తుంది? ఒకవేళ వస్తే వ్యర్థశ్రములై తూలిపోతారేకాని భేదించలేరు. సత్యపరాక్రముడైన శ్రీరాముడే వచ్చినా ఏమి చేస్తాడు? రక్షోనాథపాలితం, కల్లోలినీగర్భం. విషమదుర్గంకదా ఈ లంక? మంచి మాటలకు మానుషాశనులు లొంగరు. లంచాలు దుర్బలులకూ, నీచులకూ, దురాశాపరు

లకూ, దుర్బుద్ధులకూ, మోసగులకూ, కుంతలకూ తప్ప, రాజాజ్ఞా బద్ధులకూ, స్వకర్మ నిష్ఠులకూ, స్వదేశ, స్వరాష్ట్ర స్వజాతి, స్వజన క్షేమ గౌరవభావులకూ పనికి రాదుకదా? పరస్పర ద్వేషంతో భేదం గల్పించి కార్యసాధనకు కడంగుదామంటే వీరంతా ఉత్తమశ్రేణికి చెందినవారేకదా? యుద్ధంచేసి గెలుద్దామనుకుంటే ఇక్కడికి చేరటం మానవ సాధ్యం కాదుగదా? నిష్కారణ వైరియైన రావణుని నిర్జించ టానికి రాజనీతి ప్రమనస్థానీయాలైన చతుర్విధోపాయాలు నిష్ఫలితంగా కన్పిస్తున్నవే. నిశాచర ప్రభువును నిర్జించకుండా సీతామాతను తీసుకుని పోవటం దుస్సాధ్యం. సంఖ్యకు అపారమైనా, పారావారం ప్లవంగ కోటి దాటలేదు. సాహసంచేస్తే, నీలుడూ, అంగదుడూ, ప్రభువైన సుగ్రీవుడూ, నేనూ సముద్రం తరించి లంకను చేరగలం. ఇంతమాత్రంతో ఏమున్నది? అన్నింటికంటె జానకీదేవి ఎక్కడవున్నదో, ఏ స్థితిలో వున్నదో తెలియటం ఎంతో ముఖ్యం. ఆమెను దర్శించి, ఆమె అభిప్రాయం తెలుసుకుని ఆపై చేయవలసిన కార్యాన్నిగూర్చి ఆలోచిస్తాను.

## హనుమ లంకాప్రవేశానికై చింతించుట

ముందు లంకా ప్రవేశం చేయాలికదా! లంకా ప్రవేశం చేయటం మృత్యుదేవత వదనగహ్వరంలోకు పరిశీలించటంగా కనుపిస్తోంది. ఈ నిర్మాణమే చిత్ర విచిత్రంగా వుంది. ప్రారంభాంతాలు గుర్తించటం క్లిష్టంగా వుంది. లంకా ప్రవేశమే కష్టమైతే అపార శస్త్రాస్త్ర ధారణంతో బలిష్టమైన శత్రువాహిని తరించటం ఇంకెంత కష్టమో ఊహకందటం లేదు. ఈ ఉగ్రరూపంతో లోప్రవేశం మంచిదికాదు. జాగ్రుతులై సంచ రించే వారిని కనుగ్రామారి తెలిసినవీ, తెలియనివీ, స్పష్టమైనవీ, అస్పష్ట మైనవీ, ప్రవేశదుర్లభమైనవీ ఎన్నోచోట్లు వున్నై. ఆయా పరిస్థితులను అనుసరించి ఆయా రూపాలు ధరించవలసిన అవసరం వుంది. అందుకు తగిన సమయం పగలుకాదు. రాత్రించరులైనా రాత్రివేళ అనుకూలం. అంతా స్వకార్య నిమగ్నులై వుంటారు. అదిగాక వీరికి శత్రుభయం ఎటువంటిదోకూడ తెలియదు. అందుచే అనుమానించటం, ఆటంక పరచ టం జరగదు. నేనూ నిర్భయంగా తిరిగి కార్యం సాధించవచ్చు.” అని

కొంతసేపు చింతించాడు. మళ్ళీ మళ్ళీ మహానగరాన్ని చూచాడు. నిట్టూ
ర్పులు విడిచాడు. "ఏ విధంగా లోనికిపోయి జానకీదేవిని ఒంటరిగా
చూస్తాను? ఆమెతో రామచంద్రుని దాఘమయ జీవితగాథ తెలిపి ఆమె
చెప్పిన సంగతులు ఆయనకు వివరించటానికి అనుకూలమైన మార్గంఎలా
సాధిస్తాను? సుకరంగా ఐనట్టు కనపడేపనులు భావప్రసారానికి తమం
విచ్ఛిన్నమైనట్లు దేశకాలపాత్ర జ్ఞానంలేని దూత యత్నిస్తే చెడిపోతవి.
ప్రాజ్ఞులు బహుకాలా మథనంతో ఈవిధంగాచేస్తే ఈ కార్యం సిద్ధించు
తుందని చెప్పింది కూడ అసమర్థుడైన దూతవల్ల వ్యర్థం అవు
తుంది. ఏ మార్గాన్ని నేను అనుసరిస్తే మేలు కలుగుతుంది?
తెలివితేటలతో ఈ బృహత్కార్యం నిర్విఘ్నంగా నెరవేర్చగలనా?
ఈ లవణ మహార్ణవం దాటివచ్చి వచ్చిన ఫలం వ్యర్థం కాకుండా
చూడకోగలనా? ఈ రాక్షసులు ఏవిధంగానైనా నన్నుచూస్తే చేసిన
పనంతా ఈనగాచి నక్కలపాలు చేసినట్లవుతుంది. వీళ్ళ జాగ్రత్త పరి
కిస్తే చైత్యరూపం దాల్చినా గుర్తించగలరన్న, నేను రూపాల గూర్చి
చెప్పతగింది ఏముంది? వీళ్ళకు తెలియకుండా గాలికే ప్రవేశానికిగతిలేక
పోతే అన్యులకది సాధ్యమా? అహో! ఏమి పాలనాపటిష్ఠత? ఇంత శక్తి
సంపన్నుడు కావటంచేతనే బలవద్విరోధం పెట్టుకున్నాడు. ఈ విధంగా
ఆలోచిస్తూ ఈ ఆకారంతో ఇక్కడేవుండే ప్రమాదం తప్పదు. శ్రీరామ
కార్యం నా మతిహీనతతో చెడిపోతుంది. కనుక చీకటిపడగానే చిన్న
కోతి రూపంతో లంకలో ప్రవేశించి చూడవలసినవన్నీ చూచి జానకమ్మ
జాడ తెలుసుకుంటాను. ఈ విశ్వంలో ఇంతకంటే ఆమెను దాచదగిన
చోటు మరెక్కడా లేదు. ఉండే ఇక్కడనే వుండాలి. ఉన్నదని అంత
రాత్మ చెపుతూంది. దక్షిణనేత్రం, భుజం అదిరి శుభం సూచిస్తున్నై.
మలయానిలాసితమైన పరిమళం ఘ్రాణతర్పణంచేస్తూంది. భాస్కరుడు
క్రమంగా పశ్చిమాద్రిని చేరుతున్నాడు." అని అనేక విధాల మనసు
అనుకూల ప్రతికూల భావాలనుగూర్చి ఆలోచిస్తుండగానే అబ్జహితుడు
అపరగిరి చేరాడు. చిన్న కోతిపిల్లంతగా ఆకారం కుదించి, సమయం
సరిగాచూచి, లగ్నంగుర్తించి, శకునాలను లక్షించి ప్రదోషకాలంలో
సురవైరిపురంలో ఒక్కగంతులో చొరబడ్డాడు.

# హనుమంతుడు లంకలో ప్రవేశించుట

నాగటిచాలులాగా వంకీవంపులులేక సూటిగావున్న బాటలూ, ఇరు వైపులా ఒకదాన్ని మించి ఒకటి ఉన్నతోన్నతంగా విరాజిల్లే ప్రాసాదాలూ, స్వర్ణస్తంభ శోభితం, శాతకుంభ గవాక్షం, స్ఫటిక చంద్రశిలా సంకీర్ణ కుడ్యభూతలం, కనకవైడూర్యముక్తాప్రవాళ భూషిత ఖట్వాసన వస్తుసంకలితం, చిత్రతోరణమాలా విరాజిత ద్వారప్రదేశం, నిష్ఠురోదగ్ర రాక్షసరక్షితం, అద్భుతం, అచింత్యం అయిన సౌధపంక్తితో ఎంత సుందరమో, అంత భయంకరంగానూ, ఎంత మనోహరమో, అంత గంభీరంగానూ. ఎంత విస్పష్టమో, అంత నిగూఢంగానూ, ఎంత నిర్భయ స్వేచ్ఛాసంచారమో, అంత సభయ క్రమశిక్షణాపాత్రంగానూ లంకనుచూచి ధైర్యం డిందుపడ, దైన్యంపొందుపడ క్షణకాలం "సాలభంజిక ప్రతిమాసమా?" అన్నట్టున్నాడు. "వచ్చింది కార్యసాధనకుగాని పుర సౌందర్యానికి మురిసిపోవటానికీ, అభేద్య దుర్గమని అశక్తతతో క్రుంగిపోవటానికీ కాదని అంతలో ధైర్యం తెచ్చుకున్నాడు. తనను గురించి కపులకు చెప్పిన మాటలు తలపునకు తెచ్చుకున్నాడు. "కార్యసాధనకు తానొక్కడు చాలడా?" అని తన శక్తిని స్మృతిపథంలో నిల్పుకున్నాడు. రామస్మరణచేశాడు. తన్మయత్వంలో తబ్బిబ్బు అయినాడు. ఇంతలో సాధుచింతనునకు సర్వం శుభం చింతిస్తై అన్నట్లు రామకార్యంకోసం రహస్యాన్వేషణ కుపక్రమించిన మారుతికి సహాయకారిగా చంద్రుడు తన ప్రకాశమానం హెచ్చించి దివి భువి ఏకం కాగా వినువీథిపై వెలుగులు చిమ్ముతూ వుదయించాడు. సరస్సులో విహరించే హంసలాగా, జలజ క్షీరబిసకాంతుల గుత్తకొని వెదజల్లుతున్న నిశాకరుణ్ణి చూచాడు. అంబుదలంబమాన లంబాగ్రంలో ప్రేలాడుతున్నట్లున్న లంకా నగరంలో, వనాలూ, కాసారాలూ, భవనాలూ, జలధి పవనాలూ, సముద్రఘోషలూ, రమ్య ద్వార తోరణాలూ, మందమలయానిలాలూ, జాంబూనదమయగృహ ప్రాకారాలూ, ఇంద్రలోకాన్ని హసించగా, నాగరాజ పురాన్ని ధిక్కరించగా, అలకాపురంలోవలె లలితమై పరిపుష్టమై, సైన్య సంఘుష్టమై, కలితతటిదభ్రమై, కింకిణీరవ ముఖరితమైన ప్రాకారాన్ని చేరాడు. కొంతలో కొంత స్తిమితచిత్తుడైనాడు.

# పావని ప్రాకారంచేరి ఆలోచించుట

ప్రమాదరహితంగా, నిర్భయంగా పావని ప్రాకారంచేరి, తిరిగి లంకా నగరాన్ని తేరిపార చూచాడు. స్వర్ణ కవాటాలు, వైడూర్య వేదికలు, వజ్రాశ్మముక్తాకుట్టిమాలు, అపరంజి అనుదుదిండ్లు, చంద్ర స్ఫటిక శిలాసోపానాలు, మింటినితాకే చతుశ్శాలలు, హంసమయూరకల కలార్భటులు, తూర్యభూషణరావాలు తోరంగా కలిగి తనకు సాటి తానే అయి, నిరంతర లక్ష్మీచరణ మంజీర కింకిణీక్వాణంతో ముఖరితమవుతున్న లంకా నగర సౌభాగ్యాన్ని, లంకేశుని దర్పాన్నీ కొనియాడాడు. "ఇంత అప్రమత్తంగా, అఖండతేజోబల విలసితరక్షస్సైన్యంతో కాపాడబడుతున్న లంకలో ప్రవేశం నాకేకష్టసాధ్యమయితే, వార్ధి తరించి వచ్చి వానరయూధం ప్రవేశించగలదా? అంతటి శక్తి మా వాళ్ళకులేదే? ఈ దైత్యులను చూస్తుంటే, వారి ఆయుధాలు, వాహనాలు పరికిస్తుంటే ఎక్కడలేని భీతిపుడుతూంది. ఇంతకు సముద్ర తరణం ఏ విధంగా సాధ్యమవుతుందో తోచటంలేదు. సాధ్యమైతే ఎక్కడవుంది యుద్ధం చేయాలె? నేను సరిగా స్వపక్ష పరపక్ష తారతమ్యం భావించటంలేదు. నాయంతవాళ్ళు, నన్ను మించినవాళ్ళు నా వాళ్ళలో వున్నారు. అంగదుడేమి, జాంబవంతుడేమి? ద్వివిద, మైంద, సుషేణులేమి? రవిపుత్రుడేమి సామాన్యులా? ఒక్కొక్కడు ప్రళయం సృష్టించగలడు. ఇంకా కుముదుడూ కుశపర్వుడూ, కేతుమాలుడూ, నీలుడూ మొదలైన కపికుంజరులున్నారు. ఇదికూడ తగిన ఆలోచనకాదు. రామలక్ష్మణులున్నారుకదా? వారిలో లక్ష్మణుడు ఒక్కడేచాలు. ఇటువంటి అభేద్య దుర్గాలు శతాలైనా, సహస్రలైనా క్షణకాలంలో భస్మీభూతంచేయగల దివ్యాస్త్రసంపదకలవాడు. ఇక శ్రీరామచంద్రుడు వింటి కొరిగితే విశ్వం వింటి కొదుగుతుంది. రావణుడేమిలెక్క? వారిని నా భుజస్కంధాలపై కొనివచ్చి నిలిస్తే, దశముఖుడులేడు. లంకలేదు. సముద్రం లేదు. ఇది సరిఅయిన మార్గం. ఇక అన్వేషణకుపక్రమిస్తాను. తండ్రీ! నీ సర్వశక్తులు నాలో నింపు. దేవతలారా! మీ మీ వరాలను సార్థకం చేయండి. రామప్రభూ! నీకార్యం నెరవేర్చేవరకూ మునుల శాపంవల్ల కలిగే స్వీయబల విస్మృతి కలుగకుండా కాపాడు. తల్లీ! అంజనా! నీ సాధ్వీత్వంతో నాకు జానకీమాత

దర్శనం త్వరలో కలిగేట్లుగానూ, చూడరాని ప్రదేశాలు చూచిన దోషం వన్నంటకుండా వుండేట్లుగానూ ఆశీర్వదించు." అంటూ, మణివాసో మండిత గోపావతంస, యంత్ర సభాకాండ సన్నియై, భూషిత వేదండ గమనలాగా వెలిగే లంకానగరం ప్రాకారందాటి లోపలికి పోబోతున్నాడు. శత్రు ప్రవేశ సూచి ఘంటానాదం మ్రోగింది.

## హనుమంతుడు లంకాధిదేవతను జయించుట

నవరత్న కలితశాలా విరాజితమై, నిరస్తాంధకార నిచయమై, నిఖిల లౌకిక సుఖ సంతోష భోగభాగ్య నిలయమైన లంకా నగరంలో ప్రాకారందాటి ప్రవేశించబోతున్న హనుమ కుడికాలు ముందు పెట్టాడు. వేల ఏండ్లుగా ఎన్నడూ వినని ఘంటానాదం వినపడ్డంతో ఉలికిపడి లేచింది. నలువైపుల కలయచూచింది. పిల్లియంత ఆకారంతో ప్రాకారం దూకబోతున్న కోతిని చూచింది. అదృశ్యాకారం దృశ్యంగా మార్చింది. హనుమకు అభిముఖంగా వచ్చింది.

లంక : ఓరీ ఎవడురా నీవూ? ఇక్కడి కెందుకు వచ్చావు?

హను : వరుసెందుకు వస్తారు? పని వుండే వచ్చాను.

లంక : ఓహో! నీవు కోతివి కాదన్నమాట.

హను : ఎందుకు సందేహం కలిగింది? నేను మాటలాడే కోతిని.

లంక : అయితే వచ్చిన పని?

హను : అది చెప్పే ముందు నీ వెవరవో ఎందుకు ఈ వికారరూపంతో ఈ నగర ద్వారంవద్ద వున్నావో, ఎందుకు రొప్పుచున్నావో, నన్నెందుకు అడ్డుకుంటున్నావో చెపితే, నా పని నీతో చెప్ప టానికి అర్హత వుంటే చెపుతాను.

లంక : ఏమేమీ? పిట్ట కొంచెం కూత ఘనం అన్నట్లు నన్నే ప్రశ్నిస్తు న్నావే? నీకు బ్రదుకుపై భ్రాంతిలేదా? ఏ వేళల, ఏ చోట్ల, ఏ సితిలో, ఎవడైనా రావణబలగుప్తమైన లంకలో ప్రవేశించ లేడే. దేవతలే నా అనుమతిలేక సేవార్థంపోరే. నీవు పోతావా? నగరాధి దేవతను. లంకను. నన్ను మీరిగి శత్రువు పోలేడు. నీ రాక నాకు ముందే తెలిసింది.

హను : ఎవరు చెప్పారు? నన్నెవరు చూడలేదే?

లంక : ఈ ప్రాకారాన్ని చేరగానే శత్రువైతే ఘంటా, మిత్రుడైతే ఈలా నాకు వినపడుతుంది. నీవు శత్రుభావంతో వచ్చావు. ఘంట వినిపించింది.

హను : అది నాకు వినిపించలేదు కదా? నీవే చూచి వుంటావు.

లంక : నీకు వినపడితే మంత్రగోపనం ఏముంది? అదినాకే వినబడుతుంది.

హను : మంచిది మరి నీవెవరివో చెప్పలేదు.

లంక : చెప్పానుకదా! ఈ లంకాధి దేవతను. నా పేరు లంక. దశకంఠుని ఆజ్ఞావర్తినినై ఈ నగరాన్ని రక్షిస్తుంటాను. నా కంటిలో దుమ్ముచల్లి లోపలకు దూరటం బ్రహ్మాదులకే తరం గాదు. నేటితో నీ బత్తెం నిండింది. ఇక నీ సంగతి చెప్పు.

హను : అంత ఆగ్రహం ఎందుకమ్మా? బ్రహ్మసృష్టిలో ఇంత గొప్ప నిర్మాణం ఇంకొకటిలేదని చెప్పుకుంటుంటే చూడాలని వచ్చాను.

లంక : ఓహో! అద్భుతాల్లోకెల్లా ఇది మహాద్భుతం. మూరెడులేని కోతి లంకానగర వైభవం చూడరావటం నమ్మతగిందేనా?

హను : నీవు నమ్మినా నమ్మకపోయినా వచ్చింది మాత్రం లంకను చూడటానికే. ప్రవేశానికి నీ అనుమతి కావాలంటున్నావు కనుక ఇస్తే పోయి చూచివస్తాను.

లంక : గడుసు తెలివి కోతీ! శత్రువు అని తెలిసి నిన్ను లోనికి పోనిచ్చే పిచ్చిదాన్ని అనుకున్నావేమో ఈ లంకను? నేను ముచ్చటపడి ఇంతకాలం వాగ్వ్యయం చేశాను.

అంటూ గట్టిగా అరచేతితో హనుమ దవడపై కొట్టింది. ఆ దెబ్బ హనుమకు పిడుగుపాటువలె తాకింది. వెంటనే ఎడమచేతి ముష్టితో లంక చెంపపై బలంగా పొడిచాడు. ఆ సమయంలో ఆడుది అన్న భావానికి హస్తోదకాలిచ్చి మళ్ళీ కొట్టబోయే హనుమ కుడిచేతిని లంక పట్టుకుని, పడిపోయింది.

# హనుమంతుని లంక రక్షించమని వేడుకొనుట

మహాకపి ముష్టిఘాతానికి మూర్ఛిల్లిన లంకిణి తెలివి తెచ్చుకుని, "కపివీరా! రక్షించు. ఆడువారు అవధ్యులు అనే మరియాద పాటించు. మూడులోకాల్లో నిన్ను మించినవాడూ, నిన్ను జయించేవాడూ లేడు. నీ ముష్టిఘాతానికి నా ప్రాణాలు కడముట్టినై. నన్ను జయించటం అంటే లంకాధిపతితో, సకల దానవానీకంతో లంకను జయించటం అన్నమాట. మహా తపస్సంపన్నుడైన విశ్వకర్మ అపారమేధావిభవంతో ఈ లంకను నిర్మించి, దీనికి నాశనం లేకుండా చేయాలని బ్రహ్మను గూర్చి తపస్సు చేశాడు. విరించి ప్రత్యక్షంకాగానే "దేవా! ఈ అతిలోక నిర్మాణం అంతంకాకుండా దీర్ఘాయువు పోయు"మన్నాడు. అందుకు విధాత "దైత్యపతీ! నీ తపశ్శక్తికి ఈయరాని వరం ఏదీలేదు. అయినా దృశ్య జగత్తు నిత్యంకాదు. నిత్యమైనది పరమేశ్వర శబ్దవాచ్యమైన తేజస్సు ఒక్కటే కనుక తత్తుల్యమైన వరం ఇస్తున్నాను. నీ నగర రక్షణకు మహాశక్తి సంపన్నురాలైన లంకా నామశక్తిని నీకుఇస్తున్నానుగ్రహించు"మంటూ నన్నిచ్చి, నాతో "ఏనాడు వానరాకారుని చేతి ప్రహరణం నీకు మూర్ఛ కల్పిస్తుందో ఆనాడే నీకు రక్షణ కార్యం నుండి విముక్తి కలుగుతుంది. మరల నాలో అంతర్హితవవుతావు. ఆనాటినుంచి, రాక్షస కులానికి చేటు కాలం ఆసన్నమవుతుంది." అని చెప్పి అదృశ్యుడైనాడు. విధి సత్యం చెప్పాడు. నేను సత్యం పలికాను. నేనే బ్రహ్మవరంచేత నగరాన్ని కాస్తున్న లంకను. నా పేరే దీనికి వుంచాడా మహా తపస్వి. నేనే అధిదేవతను. నేను నా శక్తి ఉపసంహరించి, అబ్జాసనుడిలో అంతర్లీనం కాబోతున్నాను. శాపో పహతమైన లంకలో ఇక నిన్ను అడ్డుకొనేవారు లేరు. ఆమె ఇక్కడే వుంది. నీ శక్తి బుద్ధులతో నీవే గుర్తించాలె. నేను చెప్పరాదు. నీకు తప్పక ఆమె కనుపిస్తుంది. సీతా క్షేమ వార్తతో సుఖంగా తిరిగిపోగలవు. ధరణీజాత అపహరణ కారణంగా దైత్యకులానికి మృత్యువు దాపురించింది. భయంకర భూతగ్రస్త జీవ కోటికి నీ నామస్మరణ మహామంత్రమై బాధా విముక్తి కల్గించుతుంది. నీవు నన్ను యుద్ధంలో జయించావు కనుక నా శక్తులన్నీ నీ కిచ్చి పోతున్నా"నంటూ లంక అదృశ్యమైంది. ఆమె పలుకులు విన్న హనుమ ఆనందంతో పరవశించాడు.

# హనుమంతుడు లంకలో సంచరించుట

అసాధ్యం అనుకున్న లంకా ప్రవేశం సుకరం కావటమేగాక, కామరూపిణి, బ్రహ్మ మానస పుత్రి లంకాదేవి ప్రసన్నురాలై అపూర్వ శక్తుల్ని ప్రసాదించటంతో హనుమ ఉత్సాహంతో "అసురుల శిరస్సులపై ఈ కాలే ఇక పెట్టేది." అన్నట్లు డాకాలు ముందుంచి సింహద్వారంలో నుంచి నగరంలో ప్రవేశించాడు. పూలతో,ముత్యాలతో వెలిగే రాచబాటలో నిల్చి నగరం నాల్గు మూలలా తిలకించి ఆ పుర సౌందర్యానికి ముగ్ధుడైనాడు. తోరంగా మ్రోసే తూర్యధ్వనులూ, పకపక నవ్వుల ప్రాభవాలూ, వజ్రాంకుశ సన్నిభమైన వజ్ర జాలభూషణాచింత వాసాలూ, స్వస్తిక పద్మవర్ధమానా కృతిలో నిర్మించిన రాక్షస కూటాలూ, మానవ మేధతో లోటు గురుతింపలేని నవనవో న్మేషంతో లక్షణ లక్షితమైన లంకానగర సౌందర్యానికి సంతోషిస్తూ, శ్రీరామ కార్యార్థం సీతాన్వేషణకై గృహ గృహం చూస్తూ పోసాగాడు. ఆవిధంగా అసమాన సుందరాలైన మందిరాలు నానావిధాకృతులతో నయనపర్వం కావించగా వెదుకజొచ్చాడు. ఒకవంక, సురకన్యల్లాగా సౌందర్యంతో విలసిల్లుతూ, త్రిస్థాన మనోహరంగా, మదసమృద్ధ దైత్యాంగనలు గానం చేస్తుంటే హారిరత్న కాంచీ నినదం, నూపురముళం ఝుళంజితం శ్రుతిగలుపుతుంటే వీనులకువిందుగా హనుమ విన్నాడు. యాతాయాత దాసదాసీజన పదవిన్యాసధ్వని కలిత సోపానాలూ, శూరభుజాస్ఫాలనాలూ, భీమగళరావాలూ, మాంత్రిక జప స్వరాలూ ఆలకించాడు. స్వాధ్యాయరతులనూ, దశకంఠ స్తుతిశీలురనూ, రాజమార్గ సంచార గర్జన్నినాదులనూ, దీక్షితులనూ, జటిలముండులనూ, వృషచర్మధారులనూ, దర్భముష్టి ప్రహరణులనూ, దహనకుండసాధనులనూ, బహువిధశస్త్రధరులనూ, ఏకనేత్ర, ఏకకర్ణ, లంబోదరులనూ, లంబోరస్కులనూ ఇంకొక వంక చూచాడు. మరోవంక, వికటకరాళులు, విపులకోదండులు, వామనులు, భగ్నవక్త్రులు, ఖడ్గులు, ముసలులు, కవచులు, పరిఘాయుధులు, శతఘ్నిసంచాలకులు, అధిక స్థూలకాయులు, అతికృశాంగులు, అతిదీర్ఘశరీరులు, అతిహ్రస్వతనులు, అతిగౌరాంగులు, అతికృష్ణాంగులు, నాతివామనులు, నాతికుబ్జులు, బహురూపులు, విరూపులు, సురూపులు, సువర్చసులు, పతాకినులు, ధ్వజులు, పట్టిసశక్తి కుజాదిశస్త్రపాణులు సమృద్ధంగా తిరుగుతుంటే దర్శించాడు. క్షేపణీపాశ

కచులు (త్రాడు త్రిప్పి విసరి బంధించేవారు), ఆలేప నిపుణులు, మాలికా నిర్మాణచతురులు, స్వైరవిహారులు, స్వేచ్ఛాప్రియులు సహస్రసంఖ్యల్లో వున్న రావులు ఇంకోవంక వీక్షించాడు. భయద శూలధరులై, వజ్ర హస్తులై, పంక్తిముఖుని ఆజ్ఞతో పట్టణ మధ్య ప్రదేశంలో కడుజాగ రూకతో ప్రభుప్రాసాదం ముందు కాపలాకాస్తున్న మూల బలాన్ని చూచాడు. స్వర్ణతోరణ భూషితం, గిరిశిఖర నిర్మితం, బహువిధ వృక్ష పుష్పపరిమళ భరితం, అమరనివాసతుల్యం, హరినినాదముఖరితం, తురంగహేషాగజ బృంహితబధిరీకృత దిగంతం, విమలవిమాన రథ ప్రశస్త్రప్రథితాస్త్రబంధుర కరినశాలాగారావృతం, మహాబల యూథగుప్తం, సహేమరత్నోజ్జ్వల చక్రవాళం, మహార్హ ముక్తామణి మండితాంతం, మహాసితాభ్రాగురుమంజు గంధం అయిన రక్షోనాథుని రాణివాసం కనుగొన్నాడు.

## చంద్ర వర్ణనం

ఆ దైత్యభర్త అంతఃపుర సౌందర్యానికి సంభ్రమాశ్చర్యాలను పొందిన హనుమ సీతమ్మను వెదకటానికి లోనికి ప్రవేశించాడు. తారాపతి గగనమధ్యస్థుడై చల్లనిచేతులతో జగజ్జీవకోటిని శ్రమబాయ జోకొట్టుతున్నాడు. ఆ సుధాకరుని శీతలకరస్పర్శకు స్వాంతములు సంతోషంతో నిండగా ప్రాణికోటి సుఖనిద్రాముద్రితమైంది. వాహినీకాంతుడు పొంగుతున్న తరంగాలు ఒడ్డుతాకి భంగమై సితబిందుముక్తామణులతోస్వాగతం చెపుతుండగా, శీతమయూఖుని కిరణ సహస్రం ప్రతిఫలించి కాంతిని ద్విగుణీకృత చైతన్యవంతం చేస్తున్నై. ఏ కాంతి మహీస్థలి మందరస్థమై ఒప్పుతుందో, ఏ కాంతి సరసీ సరోరుహస్థమై ఎసగుతుందో, ఏ కాంతి నదీశ్వరస్థమై విలసిల్లుతుందో, ఆ కాంతి ఆ సమయంలో నిశాకరస్థమై లోకాలోకాలు నిండింది. పంజరబద్ధ రాజమరాళంలాగా, మందరకందరస్థ మృగరాజంలాగా, దుర్మదోద్వేజక కుంజరస్థ వీరునిలాగా అంబరస్థుడైన అబ్జుడు రాజు ముఖీవదనాభి రాముడై వెన్నెలలు వెదచల్లాడు. బలిసిన వృషభం కొమ్ములాగా, హేమప్రయుక్త సామజ దంతంలాగా, పాండురోచ్ఛ శృంగకరసాధరి నాధుని విధాన చంద్రుడు

పూర్ణశృంగుడై, విశ్వమనోజ్ఞ విభానుషంగుడై ప్రకాశించాడు. నష్ట శీతోదకబిందు పంకుడూ, వినోద రమాశ్రయ నిర్మలాంకుడూ, గ్రహ గ్రాహ వినష్టపంకుడూ అయిన శశాంకుడు వినిద్రకుమ్ముద్దుడై వెలిగాడు. విపుల శిలాస్పృగేంద్రుడూ, భీమ సమరార్థాగత నాగేంద్రుడూ, రాజ్యాప్తి నరేంద్రుడూ అయిన చంద్రుడు సితఖగేంద్రుడులాగా శోభ విరియించాడు. రాజవినష్టదోషం, రాత్రించర మాంసభోజనవృత్త దోషం, రమణీ రాగానుసక్త మానసదోషం అయిన ప్రదోషం స్వర్లోకనాథావాస సమాన తోషణంగా తేజంతో తేజరిల్లింది. కర్ణసుఖ ప్రవృత్తంగా తంత్రీనాదం మ్రోగింది. హృదీశవృత్తమై బిత్తరి మొత్తం నిద్రలో దిగింది. క్రూరశీల పిశితాశన సంఘం రౌద్రవృత్తమై హత్తింది. సుమేషుకృతమైన విరహిణీ లోకంచిత్తైంది. మత్తోన్మత్తనివహం, రథ గజ తురగ భద్రాసన సంగ్రహం, శౌర్యప్రశస్త వీరరమాసహం అయి ప్రతిగృహం భాసించగా ప్లవంగ వల్లభుడు పరిశీలించాడు. ఇంకా ముందుకు సాగాడు.

## హనుమ లంకలో రాక్షస స్త్రీ పురుషులను చూచుట

ఆక్షేపాలతో, భుజవిక్షేపాలతో, మత్తాలాపాలతో, మధుర సల్లాపాలతో మధుమత్తులైన వారిని చూచాడు. రొమ్ములు విచ్చి ఒళ్ళు తెలియక నిద్రించేవాళ్ళను, వనితల గాత్రాలపై కాళ్ళూ చేతులూ వేసి పడుండిన వాళ్ళను, బహురూపాలతో భాసించే వాళ్ళను, ధనువులెత్తి సజ్యంచేసి గుణంమీటే వాళ్ళనూ, పౌరనిశావిహరులను కనుగొన్నాడు. ముచ్చటలాడే వారిని, ముద్దుమొగాలపై ముద్దులుపెట్టేవారిని, నిద్రలో కన్నులు మూసినవారిని, ఒడలినిండా పరిమళలేపనాలను పూసుకునే వారిని, మర్మకోపంతో వెచ్చనూర్చే వారిని, భర్తలను ప్రార్థించేవారిని దర్శించాడు. హ్రదాల్లోని సర్పాల పూత్కారంవలె, ఏనుగులనాదంవలె, సభ్యజన నమస్కారార్హులై నిశ్వసిస్తూ సంచరిస్తున్న వీరభటులను కాంచాడు. సంవిత్ప్రభాసులు, సంశ్రద్ధభాసులు, రుచిరాభిభాసులు, విశ్వప్రభాసులు, వివిధవిభాసులు అయిన యాతుధానులనూ; మనోహర రూపులను, స్వగుణాను రూపులను, అసమాన రూపులనూ, విరూపు

లను, పరాక్రమ దీపితులనూ చూచాడు. పరిశుద్ధ భావలు, మహాను భావలు, అభిసక్త భావలు, తారకాలసిత సుప్రభావలు, అయిన మానినీ మణులను ఉప్పరిగలపై మారుతి కనుగొన్నాడు. మోహరసైక రూఢలను, రమణోపగూఢలను, వల్లభకార్యమూఢలను, ప్రమదోప గూఢలను, సహోఢలను వానరనేత కనుగొన్నాడు. హేమహర్మ్య పీఠిత లోపవిష్టలూ, ధర్మకళావిశిష్టలూ, ఆత్మనాథ సమభీష్టలూ, మదనాభి విష్టలూ, వికారరహిత మనోజ్ఞచేష్టలూ, నితాంతహృష్టలైన కాంతలను కపివీరుడు కాంచాడు. సువర్ణ వర్ణలను, భర్తృవియోగ వలక్షవర్ణలను, మనోహరరంజితోదీర్ణలను, స్కన్న కుచాంశుక గౌరవర్ణలను, గ్లాంతిగళత్సు వర్ణలను. ప్రియవిద్ధసుగంధి చూర్ణలను, నిర్జిత శ్రీకారకర్ణలను హనుమ ఆలోకించాడు. భర్తృ పరిరంభణహృష్ట మనోభిరాములూ, ప్రేమరసైక ధాములూ, శ్యామలూ అయిన రాములను కేళీగృహసీమల్లో రాముని దూత పరికించాడు. చంద్రసన్నిభముఖమాలికలు, వక్రపక్ష్మమంజుల దృక్పాలికలు, చంచలా రమాజాలకలైన బాలికలను పావని అవలోకించేశాడు. ఎంతవెదికినా మహాకపి, పవిత్రరాజాన్వయ సంజాత, పరమాభిజాత, సద్వ్రతపూత, సీతమమాత్రం చూడలేకపోయాడు. "సనాతనమార్గ సన్నివిష్ట, ప్రాణేశముఖాలోకన ప్రహృష్ట, కామాభివిష్ట, కాంతావిశిష్ట, భర్తృహృదయప్రవిష్ట, విరహతాపజనితావిరళాశ్రుకంఠి, మనోహర మనోవనచరనీలకంఠి, హసితాబ్జరేఖ, పాంసుపరిదిగ్ధధర్మరేఖ, ప్రణఘటితబాణరేఖ, అవిభిన్నాభ్రరేఖ"అని ప్రశంశలనందిన జానకీదేవి జాడతెలియక అనిలసుతుడు మహావ్యథతో క్రుగ్గిపోయాడు.

## హనుమ రావణాంతఃపురం పరిశీలించుట

అంత లంకలో ఎంత వెదకినా అవనిజాత కనరాకపోవటంతో ఆంజనేయుడు, నిరుత్సాహపరుడై, తిరిగి ఉత్సాహం పూరించి, మరల మరల చూచినవేచూచి, తిరిగిన చోట్లన్నీ తిరిగితిరిగి వేసారాడు. అసుర భర్త అంతఃపురంతప్ప అన్నీ వెదకాడు. కేసరులతో నిండిన మహా వనంలా, క్రూరాసురరక్షితమైనదాన్ని, వాసికెక్కిన అర్కవర్ణవప్రావృత మైనదాన్ని, దేదీప్యమానంగా వెలిగే దివిజారి భవనంచూచి ముక్కున

ప్రవేశించుకున్నాడు. చిత్రమైన కక్ష్యలు, చెలువారు ద్వారాలు, రజత హేమమణిభూషిత తోరణాలుకలిగి, వారణారూఢులైన బరికాంద్రచేత, శ్రమ తెలియని శూరులచేత కాపాడబడుతున్నదాన్ని, త్రొక్కనిచోట్లను త్రొక్కే గుర్రాలతో, వ్యాఘ్ర కంఠీరవ చర్మములతో కప్పబడిన రథాలతో, అమూల్య రత్న సమాకీర్ణమై పరులకొరకు నియుక్తమైన ధర్మాసనాలతో, అతిరథావాసమై, అతిరమా శోభితమై, బహువిధమృగ సంకులమై, అంతపాలురచేత అభిరక్షితమై, మనసులు చూడగానే మగువలతో నిండిన దాన్ని, రావణాలయం చూచి లోనికి ప్రవేశించాడు. వెన్నెల పులుగుల సలిపూ, ప్రమదల భూషణాలరావూ, జంత్రవాద్యాల ధ్వనీ కూడి జలధిఘోషను గేలిచేస్తుండగా, చందనాగరు ధూప వాసనలు నిండగా, రాత్రించరావిరతాభ్యర్చనీయమై, అబ్ధిగంభీరమై, అభ్రోన్నతమైన అంతఃపురం దూరం నుంచి దర్శించాడు. లంకానగర మణిమాలా తరళంగా దాన్ని భావించాడు. వీడు వీడు, తోట తోట, దొడ్డి దొడ్డి, మేడ మేడ, మూల మూల, సందు సందు, గొంది గొంది విరవు లేకుండా కార్యార్థియై, కామరూపుడై కపికులాలంకారుడు పరిశోధించాడు. కాని సీతామాత కానరాలేదు.

## రాక్షస ప్రముఖుల గృహాల్లో హనుమ వెదకుట

ముందుగా దశవదనుని ప్రథమ ప్రధానియైన ప్రహస్తుని గృహం ప్రవేశించి చూచాడు. పిమ్మట, మహాపార్శ్వుని భవనం, కందతుల్యమైన కుంభకర్ణుని సౌధం, విభీషణావాసం చూచాడు. అనంతరం, మహోదర విరూపాక్ష, విద్యుజ్జిహ్వుల హర్మ్యాలను చూచాడు. వజ్రదంష్ట్రి, విద్యున్మాలి, శుక, సారణ మందిరాలను అధిగమించి, ఇంద్రుని నిగ్రహించటంలో గ్రహించిన ఇంద్రజిన్నామాంతరంగల మేఘనాథుని వేశ్మం, జంబుమాలి, సుమాలుల సదనాలను వెదకి, రశ్మికేతువు, సూర్యశత్రువుల గేహాలను పరిశీలించి, క్రమంగా, వజ్రకాయ, ధూమ్రాక్ష, సంపాతి, విద్యుద్రూప, భీమ, ఘన, విఘన, వికట, వక్ర, శఠ, శుకనాస, బ్రహ్మకర్ణ, దంష్ట్రి, ధ్వజగ్రీవ, రోమశ, హస్తిముఖ, ఇంద్రజిహ్వ, శోణితాక్ష, కరాళనామకులైన రక్షఃప్రవరుల రమ్యసౌధాలను గంధవ

హనూమదు సీతాదేవి నిమిత్తం ప్రతిపదార్థ సహితంగా పరిశోధించాడు. కాని ఆమె మాత్రం కనపడలేదు. అంతరాత్మ శుభం చింతిస్తున్నా, బాహ్యకర్మ కార్యసిద్ధికారణం కాకపోవటంతో తైలశూన్యం అవుతున్న దీప ప్రకాశంవలె బుద్ధిసూక్ష్మత మందగించి మారుతి ముహూర్తకాలం ఇతికర్తవ్యతా మూఢుడైనాడు. ఒక్కసారి రామదర్శనం మొదలు నేటి వరకు జరిగిన పరిణామ ప్రకారం సింహావలోకనం చేశాడు. "అడవిలో పక్షులు మృగాలు దారిచూపినై. జటాయువు కొంత తెలిపాడు. కబంధుడు కార్యసిద్ధికి మార్గం చెప్పాడు. సుగ్రీవుడు అగ్నిసాక్షిగా శపథం చేశాడు. సంపాతి సీతమ్మ వున్నచోటు వివరించాడు. ఫలిస్తుందని దీవించాడు. అంబుధి మైనాకులు అనుకూలించి ఆశీర్వదించి మార్గం సుకరం చేశారు. సురస, సింహిక, లంక నన్ను అడ్డుకొనలేక పోయారు. మీదు మిక్కిలి లంకాదేవి సీతను చూస్తావని చెప్పింది. ఇప్పటికీ ఆమెను చూడకున్నా, ఇన్ని బలమైన కారణాలుండగా ఆ తల్లి దర్శనం ఎందుకు కాదు? ఇంకా చూడవలసిన చోట్లు చాలా మిగిలివున్నై. ఇంత వరకు చూచింది చూడలేదన్న నెపం లేకుండా వుండటం కోసమే. ఆ జగన్మాతను వీళ్ళ ఇండ్లలో వుంచులాడా? ఉంచితేతన అంతఃపురంలో వుంచుతాడు. లేకపోతే ఆమెకు తగిన ప్రదేశం చూచి అక్కడ వుంచుతాడు. అంతేకాని, ఆ తల్లికి అనిష్టమైన అవమానకరమైన చోట్లలో ఎందుకు వుంచుతాడు?" అని ధైర్యం తెచ్చుకుని హనుమ తేరుకున్నాడు.

## హనుమ రావణాంతఃపురం ప్రవేశించుట

దృఢ నిర్ణయానికి వచ్చిన కేసరి పుత్రుడు చూడవలసిన చోట్లన్నీ చూచి రావణా వాసం ప్రవేశించాడు. పాశ తోమర కృపాణ ముద్గర శూల హస్తలై కావలికాస్తున్న స్త్రీలు ఉపకంఠంలో శయనించిన వారిని ముందు చూచాడు. తదంతర సీమలో అడుగు పెట్టాడు. అనేక సాధనాలు ధరించి యుద్ధమర్మజ్ఞులై, ఎరుపు తెలుపు గుర్రాలనెక్కి తిరుగుతున్న రక్షో వీరులనూ, జవనాఢ్యాలైన హయాలనూ చూచాడు. పరగజ పీడాకరాలూ, శత్రుసేనా మర్దనాలూ, ఐరావత సన్నిభాలూ, పర్వతోన్నతాలూ

అయిన ఏనుగులను చూచాడు. అవి కురుస్తున్న జలధరాల్లాగా, ప్రవహించే సెలయేళ్ళతో కూడిన గిరుల్లాగా, గర్జన్మేఘాల్లాగా వున్నాయి. కాంచన పరిష్కృతాలై తరుణార్క సన్నిభమైన వాహినీ సముదాయాన్నీ, నైకాకృతులతో ఒప్పుతున్న ఆందోళికలనూ, విచిత్ర లతాగేహ నిలయ కేళీ గృహాల్లో విహరించటానికి కృతకదారు పర్వతాలనూ, కామకారణ మందిరాలనూ, మంజు దివా గృహాలనూ, మందర నామ మయూర ప్రదేశాలనూ, చెక్కేములనూ, దండములను చూడగా నిధి సంపన్నమై, ధగధగాయమానమై, కైలాస సమానమైన రావణుని అంతఃపురం రామదూత దరిసించాడు. దివిజారి తేజంచేతా, పరమ మణినికర దీప్తి పటలంచేతా, నిండి నిబిడీకృతమయి చండకిరణ సహస్రంతో వేజరిల్లే దినకరుడులాగా రావణమందిరం వెలుగులు ఒలకపోస్తూంది. ప్రాసాద పటలంతో, ధ్వజ వితానంతో, ఆసవ మధుపరిక్లిన్నమై, సరస మృదంగ వీణానాద మేదురమై, విస్తృతమై, బంగారు సెజ్జలు, బంగారు పాత్రలు, రూపవిజిత మన్మథ దారాలైన అంగనలు, కాంచీనూపుర కంకణ కింకిణీరావాలు కలిగి మనో మోహనంగా వున్న అంతిపురి చూచాడు.

## హనుమంతుడు నగరులలో సంచరించుట

చపలాలతికాళకున విహారం, మధుమాంసా పూర్ణాహారం, అస్త్ర శస్త్ర కలితావాసం, దృశ్యా దృశ్య ప్రకాశిత దీపికావిలాసం, రమ్యతోరణ పటాలంకృతద్వార గవాక్షం, నాటకటి నిర్ణిత హర్మ్యక్షం, పురుహూతాదిక దేవపూజితం, వజ్రవైడూర్య నీలగోమేధిక పుష్యరాగ మరకత మాణిక్య ముక్తా ప్రవాళసగిత విభిన్నవస్తు పరిశోభితం అయిన గృహ సముదాయాన్ని పరిశీలిస్తూ సంచరించాడు. ఆ ప్రదేశాల్లో కూడా సీతమ్మ కనుపించలేదు. ఆ నగరి మధ్యంలో ఒక ఉన్నతమైన పెద్దశాల కనుపించింది. దాని అందం వర్ణనాతీతంగా వుంది. అది ఏమిటో చూడాలని ముందుకు సాగాడు. చూచినకొద్దీ చూడముచ్చటగా వుండటంతో కామ రూపంతో చొరబడ్డాడు.

# పావని రావణుని పుష్పక విమానం చూచుట

మేఘంతో సమానమైనదీ, బంగారుమయమైనదీ, రాక్షసపతిబలాను కూలమైనదీ, అప్రతిరూపమైనదీ, త్రిలోకసంచారయోగ్యమైనదీ, బహు వర్ణభాసితమైనదీ, చారుతరకుసుమావకీర్ణమైనదీ, చంచలాసహితఘన సంకాశమైనదీ, సితఖగోపమానమైనదీ, అనూనమైనదీ అయిన విమానం చూచాడు. బహుధాతుపూర్ణమై పర్వతంవలె, గ్రహచంద్రభాసురమై గగనంలాగా, లతావృక్షసుశోభితమై ఉద్యానం వగిదీ, సరోవరం వాక్పున నానాజల విహంగ కమల కుముదవిరాజితమై, వివిధ సుందర పక్షి కలకూజితమై, ఉచ్చైశ్శ్రవసంకాశతురంగము సంకలితమై, బంధురా నేకరత్న విరచిత భుజంగమమై, నవనిర్మిత రుచిరభసంగతమై, సాక్షాత్పవనస్పాయక పక్షాలు, కనక ప్రవాళమిశితపక్షాలు, సలీల వక్ర పక్షాలు, కుసుమకీలితపక్షాలుకలిగి, తమంతతాముగా, కమలములు చిత్రిం చిన నుసుతొండాలు సాచి పైకెత్తి జలాభిషేకం చేస్తుందగా పద్మ హస్తయై సహస్రకమల మధ్యంలో నిలిచిన లక్ష్మీదేవినీ, గజయుగ్మాన్ని చూచాడు. కమ్మని వావులుచిమ్మే వృక్షమనంగా, హృత్సమ్మతమైన పుష్పకనామ విమానం పవనపుత్రుడుచూచి అబ్బురపడి అందులోని ప్రర్యంతర్భాగం వెదకాడు.

# పుష్పక విమాన వర్ణన

ఆ విమానం మధ్యభాగంలో పైకప్పు తెరచుటకు మూయుటకు వీలుగా అమర్చబడివుంది. పైభాగం తెరవగానే విమానం ఊర్ధ్వానికి సరాసరి లేచిపోవటానికి వీలుగా అవరోధాలులేని మార్గం కల్పించబడింది. ఆ నిలయమంతా పవలు రాత్రి భేదం తెలియకుండా మణిదీపికలతో ధగ ద్ధగితంగా వెలుగుతుంటుంది. కామగమనంకల్గి అవసరార్థం ఆయా రూపులుదాల్చే విధంగా తీర్చబడివుంది. ఆ విమాన నిర్మాణం దేవతలకే విస్మయం కల్గిస్తుంటుంది. అది విపుల తపఃప్రభావంతోనూ, విక్రమం తోనూ, ఆర్జింపబడ్డది. మనస్సంకల్పానుసారంగా సంచరిస్తుంది. ఒకడు మొదలు ఎందరు అధివసించినా సంకుచితసమ్మర్దంలేనిది. సర్వతో మనో హరమైంది. వాయుజవంకలది. దుర్వారమైంది. చిత్రకూటోత్కర మండితమైంది. హృద్యమై, శరచ్చంద్రధవళితమై, కుండలాలంకృత వక్రభ్రమణముఖమై, గగనచర రాత్రించర ఘూర్ణవన దురాధర్షఘాతగణ

సహస్ర వాహితమైంది. సుమసుందరం, నిర్జితసురభి సుందరం, సురశిల్పి వినిర్మితం, నిర్ద్వంద్వం అయిన పుష్పక విమాన శోధనం పూర్తిగావించి మరుత్తనయుడు జానకీ దర్శనంకోసం ఇంకా ముందుకు పోయాడు.

## హనుమ రావణుని అంతఃపురం చూచుట

ఈవిధంగా హనుమ దుష్ప్రవేశంఅయిన లంకలోజొరబడి అల్పాధిక భేదంలేకుండా అన్ని గృహాలూ చూచి,పిమ్మటఅపురూపనిర్మాణమైన పుష్పక విమానంలో చొచ్చి అందున్న రహస్య స్థానాలనుచూచి, దాని మధ్యభాగంలో యోజనం నిడివీ, అర్థయోజనం వెడల్పూగల పంక్తికంఠుని మందిరం పరిశీలించి జానకీదేవిని కానక హతాశుడై, లంకేశుని అంతఃపురం చేరబోతూ, దాన్ని చుట్టివున్న రాక్షసనాయకుల ఇండ్లన్నీ విశదంగా చూచి, దీర్ఘోచ్ఛ్వాసం విడిచాడు. తరువాత మూడు నాలుగు కొమ్ములున్న ఏనుగులను, ఉద్ధృతాయుధధారులైన యోధులనూ, కోరి వరించిన అసుర నాయకుని భార్యలను, విక్రమాపహృతలైన పృథివీనాథ కన్యకలను, తిమి తిమింగిలనక్ర దీర్ఘఝషాకులో దధివలె కల్లోలితంగా వున్న సందడి గృహాలనూ కలిగి, లక్ష్మీపతి శచీపతుల ఐశ్వర్యం అపహసించే సిరితోకూడి, యమవరుణ కుబేరుల సంపదమించిన బంధువుల ఇండ్లు పరివేష్టింపగా మధ్యలో వెలుగు లీనుతున్న రావణాంతఃపురం చూచాడు. ఆ సౌధంపూర్వం ఆకాశంలో అబ్జాసనునికోసం విశ్వకర్మ నిర్మించాడు. దాన్ని కుబేరుడు బ్రహ్మను ప్రార్థించి పొందాడు. అతణ్ణి ఆహవంలో గెల్చి అసురభర్త గ్రహించాడు. రావణుడు బలాత్కారంతో పొందిందీ, ఈహామృగయుక్తమైనదీ, కార్తస్వర స్తంభ కమనీయమైందీ, ధగ ధగత్కాంతులతో తనరేదీ, మేరుమందరముల మేలిమి కలిగిందీ, గగనాన్ని ఒరిసే కూటాలయాలు కలిగిందీ, సమలంకృతమైందీ, సవుడు మీరిందీ, నడిమింటి సూర్యుణ్ణి కాంతితో నవ్వేదీ, కనక సోపాన పంక్తులు కలదీ, క్రమవేదికలతో కళకళలాడేదీ, మనోజ్ఞవాతాయనాలతో కనువిందు చేసేదీ, నీలవిద్రుమ మౌక్తిక వజ్రమణీ స్థగితమైందీ అయిన పుష్పక విమానంలో నిర్మితమైన దశాననుని రాణీ వాసాన్ని చేరుకున్నాడు. ఆ సౌధంనుంచి భక్ష్య భోజ్య పరమాన్న దివ్యన్నివారణ

పదార్థాల్లో కమ్మని వాసనలు వెదలి కపివీరునిచేరి "నీకుమిక్కిలిబంధువు. నీ రాకను హర్షించుతున్నాడు మా దైత్య ప్రభువు" అని పల్కినట్లు ఘ్రాణ తర్పణం గావిస్తున్నై. ఆ ప్రదేశానికేగి శుభ లక్షణాయుతమై శోభనాంగి వోలె, అసురభర్తకు అనుకూల పత్నిలాగా, రత్నసోపాన విలసితమై, పైడి కిటికీలతో, పటికరాల పరుపులతో, దంతపు బొమ్మలతో, పవడాలు, ముత్యాలు, బంగారు, వెండి మొదలైన పదార్థాలతో నిర్మించిన స్తంభాలతో, చచ్చవకంగా, సమంగా, ఎత్తుగావున్న కంబాలతో ఆకసానికి ఎగురుతున్నట్లున్న అంతర్భాగాలను విలోకించాడు. ప్రపంచంలోని విచిత్రాలన్నీ చిత్రాలుగా చిత్రించబడిన రత్నకంబళాలవలె భాసించే కుడ్యాలతోనూ, ఒకవంకి పూల పరిమళంతోనూ, ఒకవంక శకుంత సంతానరావంతోనూ, మెత్తని పట్టు పాన్పులతోను, బంగరు జరీ, నగిషీకల దిండ్లతోను, వన్నెలుమీరుతూ, హాయులు విరియిస్తూ, ధూపధూమ్రమై, కాంతులకు కాంతి కల్పిస్తూ, వర్ణాలకు వర్ణం ప్రసాదిస్తూ శోకిదళన సమర్థం, ఆనంద ప్రవర్ధం అయిన రావణ పాలిత భవనం, పంచేంద్రియాలకు పంచ విషయాలైన బిడ్డకు తల్లివలె మోదావాప్తి కల్గించగా సంశోధన సలిపాడు.

నాకమో, సురలోకమో, ఇంద్రుని ఆవాసమో, ఈశ్వరుని కైలాసమో, అన్నట్లుగావున్న ఆ సుందరమందిరంలో, జూదంలో ఓటి దిక్కుతోపక చింతించే జూదరిలాగా కళాహీనంగావున్న దీపాలను తృణీకరించి మణికృత మంజుల దీప మాలికలు వెలుగులు చిమ్ముతుండే వానర ముఖ్యుడు ఆభవనాంతంలో పరికించి చూచాడు. ఆ దీపకాంతులు దైత్యభర్త తనుకాంతినీ, తపనీయ భూషణ కాంతినీ వెలవెలబోయేట్లు వెలుగుతుండే ఆ శాలంతా మండుతున్న చందంగా మారుతి భ్రమించాడు. ఆ దానవపతి అసమానమైన ఐశ్వర్యానికి ఆత్మలో మెచ్చాడు. ఇంత మహాభోగి ఏమాశించి రామచంద్రునితో విరోధం తెచ్చుకున్నాడో బోధపడలేదని ఆలోచించాడు.

# నిద్రాసక్తలైన అంతఃపుర స్త్రీలను హనుమంతుడు చూచుట

చిత్రచిత్రాలైన రంగులతో భాసించే చీరలతోనూ, ఆభరణాలతోనూ, బహుపదార్థ మిశ్రితములై, బహువర్ణభాసురములైన పానీయాలు కలకాచ పాత్ర నిచయం, త్రాగగా మిగిలినరసంతో తలల సమీపంలో హేమాసనాలపై వుండగా పలుభంగుల పయిడికోళ్ళమంచాలపై పడున్న యువతులను హనుమ కనుగొన్నాడు. తుమ్మెదలూ, రాయంచలూలేని పద్మాకరంలాగా, జారిన భూషా సమూహంతో శయనించిన యోషామణులను చూచాడు. ముకుళిత సరసీరుహాలవలె మూసుకున్న కన్నులూ, దానిమ్మగింజలతో తగవులాడే దంతాలకూర్పు వెలికితోపకుండగా, విరిసిన పద్మాలవలె శోభిలీనే వదనాలుకల వనితారత్నాలను అవలోకించాడు. ఆ కాంతల వదనాలు, పగలు వికసించినా, రాత్రి ముకుళించినా మూదముచ్చటగ వుండే పద్మాల్లాగావున్నై. "వీరి మోములు నిజంగా పద్మాలు కాకపోతే, తుమ్మెదలు ప్రార్థించుతూ ఎందుకు తిరుగుతై?" అని భావించాడు. అందం, చందం, చల్లందనం, పరిమళం, లలితాకృతీ కలిగి సుందరాలైన వీళ్ళవదనాలు పంకజబృందాలంటే పరిహాసం కాదను కున్నాడు. తారాగణరాజితమైన శారద తారాపథంలాగా కాంతారత్నాలచే రావణుని మందిరం ప్రకాశిస్తూంది. ఆ కాంతలనే చుక్కల్లో అసురపతి చంద్రుడులాగా వున్నాడు. ఆ సుందరులందరూ పుణ్యం క్షీణించగా నేలపై వ్రాలిననక్షత్రాలుగా తరుచరాగ్రేసరుడు తలపోశాడు. నిద్రాముద్రితలైన ఆ సుందరీమణుల మనోజ్ఞతను కాంతి ఆ మందిరానికి దీపాలులేకపోయినా ప్రకాశం కలిగించేట్లుగా వుంది. పాన వ్యాయామంచేత, మదన సంగరంచేత, సిగలో పూలదండలూ, కంఠంలోని రత్న భూషణాలూ చిక్కుపడి, రాలిపోతున్నా మేనెరగకుండా మెలతలు నిద్రించటం కపి వల్లభుడు చూచాడు. తిలకం జారగా, అందెలు వీడగా, పైట చెదరగా కొందరు కోమలులున్నారు. తెగిన ముత్యాలదండలూ, సడలిన చీరెలూ, తొలగిన కంచుకాలూ, తెగిన మొలనూళ్ళూ, అస్తవ్యస్తంగా అవయవాలూ కలిగి శయ్యలపై, విశ్రాంతికోరిన హయకిశోరాల్లాగా వున్న కొందరు సుందరులు పొడగట్టాడు. వేణీభరాలు వీడి, అలంకరణాలు భ్రంశంపొంది కానలో ఏనుగులు త్రెంచివేసిన లతల్లాగావున్న కొందరు

కులకాంతలను ఆలోకించాడు. కంచుకాలు ప్రిడులుటచే వక్షోజాలపై మౌక్తికాది భూషణాల కాంతి ప్రకాశించి రవి శశికర రుచిరంగా నిద్రించే హంసల్లాగ గోచరిస్తున్న కువలయాక్షుల కొందర్ని చూచాడు. కొందరు తాల్చిన భూషణాలు వారి వారి సౌందర్యాన్నిబట్టి హంసల్లాగా, చరిస్తున్న చక్రవాకాల్లాగా వున్నై. ఉరోజాలచేతా, జఘనాలచేత ఉన్నతంగావున్న ఉత్పలాక్షులు, హంసకారండవ చక్రవాక సైకతాలతో శోభించే నదుల్లాగా తోచారు. సువర్ణాభరణాలు వికసిత పద్మాలాగా, కాంచీ మంజీర కంకణ కింకిణులు ముకుళిత పద్మాల్లాగా, మనోమోహనమైన శీలవిలాసాలు నక్రాది జంతుకోటి కలిగిన తటాల్లాగా, నిదురించే నీరజాక్షులు విశ్వలంగావున్న మహానదులవలె వుండగా కనుగొన్నాడు. సుషుప్తిలో వున్న సుందరుల నిట్టూర్పుచే కదలుతున్న పైటచెరగులు నీచోపల్లాగా ముఖమండలి స్వేదబిందువులు పోగొట్టుతున్నై.

గురుకుచ చూచుకాలూ, కోమలహృద్యతరాంగాలూ, మణిమయాభరణ సమూహాలూ, దర్పకదర్ప వినష్టవిత్తులై నిదురించే కాంతామణుల విలాసాన్ని ఇనుమడింపచేసి పురుషులు మోహితులై సోలిపడేలాగా చేస్తున్నై. మందమందంగా మందయానల ముఖనిర్గతాలైన పరిమళ భరిత నిశ్వాసాలకు, గురువిందమణీ రుచిరమయిన కమ్మలు కదలాడుతుండగా కాంచాడు. ఆ ఊర్పుదొంతర్లు పంక్తికంఠునిపై విహరించి కైపెక్కించుతున్నై. కొందరు స్త్రీలు తమకు ప్రక్కగా పండిన మగువలను నిదురమత్తులో ఆత్మేశుడైన అసురపతిగా భావించి ముద్దాడుతున్నారు. ముద్దిడుతున్నది తనపతి అనేభావంతో సవతి మచ్చరంమాని నిద్రలో ప్రతిచుంబనం కొందరు వనితలు చేస్తున్నారు. కొందరు కంకణభూషితాలైన కరములే దిండ్లుగా పండారు. రొమ్ములపై తలలుమోపి పడున్నవారిపై తమచేతులువేశేవారూ, మోకాళ్ళపై కొందరూ, తొడలపై కొందరూ తలలుంచి నిద్రించేవారూ, త్రాగి త్రాగినమేనుమరచి పార్శ్వపృష్ఠోదకటి ప్రదేశాలను మోహంతో స్పృశించేవారూ, బలంగాదగ్గరకులాగి చేతులతో పొదివి జడలు ముడివేశేవారూ కపి వీరునకు కనుపించారు. మందమలయానిలవశం చేత పెనుగుపడ్డ తీవలతో కూడిన వృక్షల్లా కొందరూ, పూలమాలికలపై వ్రాలుతున్న తుమ్మెదల రొదతో కొందరూ వసంతంలో

లాలు ధానునికాదనగా, ఎవపుతనంతో విశాలంగా వున్న కన్నులు రాజీవాలను తేజోహీనంచేయగా, మేఘం మెరుపు కలిసినట్టు దేహమంతా రక్త చందనం అలదుకొని అనర్ఘ పరిష్కార భూషితుడై, రూపసియై కామరూపధరుడై, అసుర కన్యలకు ప్రియుడై, [illegible] హాయిగా నిద్రించటం ఆంజనేయుడు అవలోకించాడు. అతడు ఉచిత వస్త్రం ధరించాడు. దీర్ఘమయిన బాహువులు కలవాడు. [illegible] సహిత మందరం అనతగినవాడు. అసురకోటి ఆశాంతకుడు [illegible]వాడు. మదగజంవలె [illegible] పెట్టుతున్నాడు. సాహసవృత్తతచే సన్ముతిరేనివాడు. [illegible] నిద్రవటు. ఆతని సమీపించాడు.

హనుమ ఆతని దగ్గరగాపోయి చూచి నిశ్చేష్టుడై నిలిచాడు. భూతాన్నిచూచి సామాన్యుడు వణకినట్లుగా క్షణకాలం కంపించి శయ్యపై నుండి దిగి వేదికాంతరం చేరాడు. మధుపంజరం కూడిన మురిలాగా ఆ పానువు మెప్పుకొల్పింది. పరాక్రమ కీర్తిచిహ్నాలైన భూషణాలు ధరించినవాని, ఐరావత విషాణహతులంచేత కాయలుకాచిన మేనివాని, వజ్రాహతి భరించు అంసభాగంకలవాని, విష్ణుచక్రక్షతి (ఇది ఒక ఆయుధ విశేషం) భరించిన వెడదవక్షం కలవాని, సబలసంగత మాంసలములైన వింశతి బాహువులవాని, శుభలక్షణాలుకల నఖాంగుష్ఠములున్నవాని, మాతంగంవలె మదించినవాని, పంచముఖ నాగేంద్రుడువలె వవశించినవాని, శశరక్తంవలె వాసనలీనే లేపనం రాచుకున్నవాని, గంభీర నేత్రాలు కలవాని, యక్ష పన్నగ నిర్జరాసుర గంధర్వులు భయంతో హాహాకారాలు చేసే భయంకర కాయంకలవాని, మందరాచలమధ్యసీమలో కూర్మక్రుద్ధాహుల పోలిన భుజాలవాని, సశిఖర మేరుపర్వతంవలె పరుండినవాని, రావణుని వివరంగా కపివీరుడు వీక్షించాడు. నాసికాపుట నిర్గతాలైన శ్వాసపవనాలు చూతపున్నాగవకుళ పుష్ప సురభితాలై ఆ సదనమంతా నింపుతూన్నది. ఒకప్రక్క జ్వలన్మౌక్తిక కాంచన మకుటం ఒరిగివుంది. కర్ణకుండల కాంతితో ప్రకాశిస్తున్న వదనాలు నిద్రాముద్రితాలై ముకుళిత సరోజాలవలెవున్నై. క్రూరసర్పాల ఫూత్కారంవలె ఊర్పులువచ్చి పోతున్నై. వక్షంపై రక్తచందన దిగ్ధ రమణీయ హారాలు మేఘంలో మెరపువలె కన్నుల్లో జిగేలుమంటున్నై. ఒక

## హనుమ మండోదరిని చూచుట

ఆమె శయనించిన మంచం అన్నివిధాలా అమరపతి తల్పాన్ని పోలివుంది. పూర్వం చూచిన స్త్రీలవలెకాక ఆమె నిర్మలంగా, నిశ్చలంగా, వికార రహితంగా, సభ్యతా సంస్కృతులకు పట్టంకట్టినట్టు నిద్రిస్తుంది. ఆమె ధరించిన ఆభరణాలుకాని, భూషణాలుకాని ఇంతకుముందు చూచిన అంతఃపురంలో కనుగొనలేము. ఆమె సౌందర్యం మంచిముత్యం తెల్లదనంలోని కాంతిపూసినట్టు ఆ అంగనాజనంలోనుంచి కొట్టవచ్చినట్లు కనిపిస్తుంది. ఆ సాధ్వి లోకోత్తర సౌందర్యానికి హనుమ అచ్చెరువు చెందాడు. ఒకటికి పదిసార్లు ఆమెను నిదానంగా అవలోకించాడు. "ఈ పవిత్రదనం, ఈ సౌమ్యత, ఈ సంస్కారం, ఈ సుగుణసంపద, ఈ సౌశీల్యం రాక్షసాంగనలకుకానీ, స్త్రీజనసామాన్యానికి కానీ ఉండటం దుర్లభం. ఈమె తప్పక రామచంద్రమూర్తి ధర్మపత్ని సీతామాత అయివుంటుంది. అందుకే ఈమెకోసం ప్రత్యేకవాసం ఏర్పాటుచేయబడింది. ఇప్పటికి నా శ్రమ ఫలించింది. దీర్ఘప్రయత్నంతో విజయం కలిగే ఆనందం కలుగుతూంది. ఈమె తప్పక రాఘవ ధర్మపత్ని. సందేహం లేదు. నేను సీతమ్మను చూశాను. ధన్యుడనైనాను. నా నేత్రాలు కృతార్థమైనై," అని భావిస్తూ హనుమంతుడు సంతోషంతో చప్పట్లు చరిచాడు. తోక ఆడించాడు. స్తంభాలెక్కాడు. క్రిందికి దూకాడు. మళ్ళీ మళ్ళీ ఆమెను చూశాడు. కూనిరాగాలు తీశాడు. గంతులువేశాడు. తోక ముద్దుపెట్టుకున్నాడు. ఈ విధంగా జాతి సహజ చేష్టలతో సంబర పడ్డాడేకాని ఆమె రావణుని అర్ధాంగియైన మండోదరి అని గ్రహించలేక పోయాడు.

## హనుమ సీతను పానశాలలో మరల వెదకుట

ఆనందంతో నేల మరచిన హనుమ కొంతసేపటికి స్థిమితపడి మరల ఆమెను చూశాడు. ఈసారి ఆమె సీతకాదనే భావం అతనిలో స్ఫురించింది. వెంటనే "ఈ సతి సీత ఎలా అవుతుంది? ప్రాణాధికుడైన భర్తను బాసి పరునిచే బంధింపబడ్డ పరమసాధ్వి నిద్రిస్తుందా? అందులో ఇంత ప్రశాంతచిత్తం కలిగి వుంటుందా? ఉన్న భూషణాలనే తీసివేసిన ఆమె ఇన్ని విలువగల ఆభరణాలు ధరిస్తుందా? ఇంత అసహ్యమయిన

కంచుకవసనాలు ధరిస్తుందా? ఈ పరిమళ ద్రవ్యాలమధ్య పవళిస్తుందా? పూలు జల్లిన పట్టు పరుపులపై పరుండుంటుందా? అభిముఖంగా నిలువెత్తు లంకేశుని చిత్రపటాన్ని వుంచుకుంటుందా? పానాశనాలు ఆమెకు పరితృప్తి కల్గింపగలవా? ఆమె ఆత్మేశ్వరుణ్ణిగాక అమరలోక పతినైనా కన్నెత్తి చూస్తుందా? ఈమె ఎంతమాత్రం జానకి కాదు. ఆమె దుర్వ్యసనపరనటంలో అభ్యంతరం లేదు. కాగా ఆలోచిస్తే ఈమె దశకంఠుని ధర్మపత్నిగా భావించటం తప్పుకాదనుకుంటాను. మళ్ళీ పానశాలకుపోయి పరికిస్తాను." అంటూ నిర్ణయం చేసుకుని ఆ చోటు విడిచి పానశాలకు చేరాడు. ఆటలపాటల అలసినవారినీ, మధుపానంతో మైమరచినవారినీ, మద్దెళ్ళు, మురజలూ తలదిండ్లుగా నిద్రించేవారినీ, ఆస్తరణాలపై అత్తరుచల్లినవారినీ, వానరముఖ్యుడు శోధించాడు. అనంతరం ఆవులమధ్యవున్న వృషభంలాగా, కరేణువుల నడుమవున్న గజేంద్రుడులాగా అంతఃపురకాంతా జనమధ్యంలో పండిన దానవేశ్వరుణ్ణి దాటి పానశాలకు చేరగానే, మహిష సూకరమృగమాంసాలు ప్రోవులు ప్రోవులుగా పెట్టబడి రాలింపుల ఘుమఘుమలతో తల దిమ్మెక్కిస్తుండగా, మిగత మెతుకులు, కుక్కుటమయూరకకిరిచకోర సంఘాల ఎరచులు, ఖడ్గాలు, నగంటిన్న రకరకాల పక్వ లేహ్య భోజ్యపటలాలు, ఉప్పు, పులుసు, షాడబాలు, విడిగా తీసిపెట్టిన అందెలూ, ఆభరణాలూ, పాన పాత్రలూ, వెండి బంగారు గిన్నెలూ, ఆసులూ, ఆసనాలూ, శయ్యలూ, కలిగి అగ్గి రేకున్నా మణిదీప కాంతులతో నిండివున్న ప్రదేశం పరిశీలించాడు. సురకాంతలు మధురఫలాలు, సుమశర్కరలు, ద్రాక్షలు, హేమకలశాలు, దేవలోకపానీయాలు ఉంచిన చోట్లు చూశాడు. ఎంత త్రాగినా తరుగని పానభాండాలూ, ఎంతతిన్నా కొదవపడని మాంసాది భోజ్యాలూ, పగిలిన కుండలూ, దొరలే గిన్నెలూ, పారుతున్న సీధువులూ, యువయువతి నిద్రించే పజాషుకల మూలలన్నీ వెదకాడు. నిద్రమత్తులో ఒందొరుం చీరలాగికొని కప్పుకునే యౌవనాంగనలనూ, నల్లని, తెల్లని, పచ్చని వన్నెలతో మోహనంగావున్న మోహనాంగులను గాఢంగా వెదకాడు.

## పరాంగనలను చూచినందుకు పావని దుఃఖించుట

"అంత లంకానగరంలో తాను తొక్కనిచోటూ, తాను చూడని చోటూ లేదే. సీతమ్మ మాత్రం కనుపించలేదు. రాకూడని రావణుని రాణివాసంలోకి కూడావచ్చి కడిగి గాలించాను. ఈ పరిశోధనలో, ఈ పరిశీలనలో పరాంగనలను ఎందరినో చూడవలసి వచ్చింది. నాకు ధర్మహాని వచ్చింది. నేను బ్రహ్మచారిని. ఇంతవరకు అన్యకాంతలను పరిశీలనగా చూడలేదు. అందులోనూ ఆ సమయంలో, అంతఃపురంలో, అవశలైయున్న వేళలో చూచి పాపంచేశాను. ఈ పాపానికి నాకు నిష్కృతి వుందో లేదో?" అని దుఃఖిస్తున్న పరమ పవిత్రుడైన పావనికి కార్యనిశ్చయ దర్శన క్షమమైన అంతరాత్మ ప్రబోధం బుద్ధిలో కలిగింది. వెంటనే "రావణాసురుని రమణీమణులను చూచింది సత్యం. అయితేయేం? నా బుద్ధి చలించలేదు. మంచికైనా చెడ్డకైనా ఇంద్రియాల ద్వారా మనస్సుకదా ప్రవర్తించేది? ఆ మనస్సు వీరలపై సాభిలాషతో ప్రవర్తించలేదు. త్రికరణశుద్ధిగా వారంతా నాకు మాతలుగానే భావించాను. వారి బాహ్యశరీర వికారాలన్నీ శిశువుల చేష్టలుగా చూచాను. నేను చూడవలసింది స్త్రీమూర్తి. ఆమె లంకేశునిచే అపహృతయై కొనిరాబడ్డది. అతడు ఆమెను అంతఃపురంలోకాక అడవిలో వుంచుతాడా? ఆడవాళ్ళను ఆడవాళ్ళల్లో వెదకక అరణ్యంలో వెదకుతామా? పురుషుల్లో వెదకుతామా? నేను శుద్ధమైన మనస్సుతో, శుద్ధాంతం అంతా శ్రద్ధగాచూచాను. ఇది ప్రభువు కార్యం. కార్యనిర్వహణలో నియమితులకు పుణ్యపాపాలతో ప్రసక్తిలేదు. దాశరథి నామస్మరణమే అన్ని పాపాలకు తరుణోపాయం. ఇంక ఈ విచారణమాని చూడక మిగిలినదేమైనా మిగిలివున్నదేమో చూస్తాను" అంటూ, నాగకన్యలనూ, నాక గంధర్వ యక్షకన్యలనూ వెదకాడు. అక్కడా అవనిజాత పొడగట్టలేదు.

## హనుమ సీతను కానక విచారించుట

ఎంత వెదకినా సీతాకాంత కనరాక పోవటంతో మారుతి మనస్సువికలమైంది. ధైర్యం సన్నగిల్లింది. పరితాపం హెచ్చింది. అంతరంగంలో అనేక భావాలు రాసాగినై. "ఈ మహానగరంలో ఇన్నికోట్ల జీవులు సుఖంగావుండగా, ఆమె జీవించివుంటే ఎందుకు

కనుపించదు? బహుకాలమైనా భర్త జాడ తెలియక, ఆయన వియోగం భరించలేక ప్రాణత్యాగం చేసిందేమో. లేక రాక్షసుడే ఆమె అంగీకార దూరదై ఆగ్రహంతో హత్య చేశాడేమో. వికృతకాయములూ, పెద్ద పెద్ద మొగాలూ, చింతనిప్పులవంటి కనుగ్రుడ్లూ, మృగాలకువలె వాడిగల కోరలూ, బండరాలవంటి భయంకర శరీరకాంతులూ క్రూర శస్త్రాలూ కలిగిన దైత్యాంగనల కాంచి భయంతో ప్రాణాలు విడిచిందేమో. ఆమె జీవించి వుంటే ఎందుకు కనుపించదు? అసురనాథుడు ఇంత సురక్షిత స్థానంలో కాక ఇంకా ఎక్కడ దాస్తాడు? ఉంటే ఇక్కడే వుండాలి. లేకపోతే మరణించనైనా మరణించాలి. సజీవంగా వుంటే ఇక్కడ కాక ఇంకెక్కడ వుంది? అన్నిచోట్లా విడువకుండా వెదకాను కదా? మరణించినట్లు మనస్సు అంగీకరించడంలేదు. వెదకితే కనుపించడంలేదు. అంగదులతో అంతంత పెద్ద మాటలుపలికి అంబుధి దాటివచ్చి, అభేద్యమైన అసురేశుని లంకలో ప్రవేశించి, కామరూపంతో కనరానిచోట్లన్నీ గాంచి, చివరకు సీతమ్మ క్షేమం తెలియక ఏ మొగంతో రవి పుత్రుని దర్శిస్తాను? నాపై కార్యభారం మోపి, నన్నే విశ్వసించి, ఆశీర్వదించి, ఆనవాలిచ్చి, దూతగా స్వీకరించి పంపిన రామచంద్రుని ఏ గుండె నిబ్బరంతో చూస్తాను? సుగ్రీవుడు ఎంత సాధువో ఆజ్ఞాతిచరిష్ణులపట్ల అంత క్రూరుడు. అన్నమాట చెల్లించి తీరుతాడు. తక్కిన దిక్కుల కేగినవారు సకాలంలో రాజదర్శనంచేసి తమ విధ్యుక్త ధర్మం తీర్చుకుని వుంటారు. మేమా! గడువు దాటినా సముద్రం దరిచేరలేక పోయాం. ఆమె వునికి తెలిసినా, ఆమెను చూడలేకపోయాం. అసాధ్యమైన అబ్ధి తరించి వచ్చినా శ్రమ ఫలించేలాగ ఆమె దర్శనం కాలేదు. ఆమెపట్ల మనస్సు అవధరించలేక నన్ను ఆరాటపాల్జేస్తుంది. ఇది దుఃఖకరమని విషయంగా వుంది. చూడతగిన తావులన్నీ చూశాను. రిక్తుడనై తిరిగిపోతే "హనుమా! ఏమి చేసుకుని వచ్చావ"ంటే నా కోసం తపిస్తున్న సాటివారికేమి సమాధానం చెప్పేది? లంకంతా వెదకాను. ఆమె జాడ తెలియలేదంటే అంగదుడంతా అప్పటికప్పుడే అసువులు విడుస్తాడు. నన్ను మెచ్చి జానకి వృత్తాంతం చెప్పి ఉత్సాహం కల్పించిన వయో

వృద్ధుడు జాంబవంతుడూ, నన్ను గురుభావంగా చూచే అంగదుడూ అపహసించరా? ఇప్పుడేది కర్తవ్యం" అని విచారించాడు.

## హనుమ ఉత్సాహంతో మళ్ళీ వెదకుట

మళ్ళీ ధైర్యం తెచ్చుకున్నాడు. "ఉత్సాహమే లక్ష్మి. ఉత్సాహమే సౌఖ్యం. ఉత్సాహమే సర్వకార్య సాధనం. కాబట్టి ఆ ఉత్సాహాన్నే ఆశ్రయిస్తాను. శ్రమ అనుకోక ఇంకోసారి చూడనివన్నీ చూస్తాను. నా శ్రమ ఫలించకపోదు. త్రికరణశుద్ధిగా ప్రయత్నిస్తే కార్యం ఎందుకు వ్యర్థమవుతుంది? ఈసారి ఇంకా జాగ్రత్తగా పరీక్షిస్తాను" అని లేని ఉత్సాహం తెచ్చుకుని కార్యోన్ముఖుడయ్యాడు. భూగృహాలు, చైత్యాలు, కేళీవనాలు, ఆయుధశాలలు, గజతురంగ మందిరాలు, పాన ప్రదేశాలు, భోజన గృహాలు, ప్రాకారాలు, నడబాటలు, వేదికలు, దిగుడు బావులు, సరస్తీరాలు, వివిధ విహార భూమి విశేషాలు, రాజ సౌధాలు వెదుకుతూ హనుమ పరిశీలించాడు. అసమాన సౌందర్యంకల విద్యాధర కాంతల చూశాడు. పూర్ణచంద్రాస్యలైన భోగినులను చూశాడు. పంక్తిముఖుడు బలాత్కారంగా తెచ్చిన నాగకన్యలను చూశాడు. ఎంత చూచినా సీత కనుపించలేదు. పిడుగుపడ్డట్లు శైలపాతం జరిగినట్లు ఒక్కసారి అంత మహాశక్తి సంపన్నుడైన హనుమ గడగడలాడాడు. గుండెల్లో కొండలు దొర్లినై. మెదడుపై వేయి వజ్రాఘాతాలు కలిగినై. నిరాశా నిస్పృహలు వికటతాండవంచేస్తూ మనస్సును వికలం చేసినై. రకరకాల దైవీశక్తులన్నీ పనికిమాలిన గారడీవాని కనుకట్టువలె కనుపించినై. అపార సముద్ర లంఘనం అనవసర శ్రమగా అనిపించింది. మహాకపుల సమక్షంలో తాను పల్కిన పల్కులన్నీ త్రాగినవాని ప్రేలుడులాగా తోచినై. వెంటనే విమానం దిగాడు.

## హనుమ ప్రాకారంపైని సీత కానరానికి మథించుట

సరాసరి ప్రాకారం చేరుకున్నాడు. గతవర్తమాన సంగతులన్నీ ఒక క్రమబద్ధంగా ఆలోచించసాగాడు. ఇంద్ర పుత్రునిచే పరాభూతుడై ఋశ్యమూక పర్వతంలో తలదాచుకున్న రవి పుత్రుడు దుఃస్థితిలో

లంకిణి లంకలోనే సీతవున్నట్లు సూచించింది. తిరిగి కిష్కింధకు పోనా? ఆమె కనుపించేవరకూ ఇక్కడే వెదకనా? వ్యర్థంగా మరలటం అనర్థాలకు కారణం అవుతుంది.

## రామునితో సీతలేదని చెపితేవచ్చే అనర్థాలు హనుమ యోచించుట

ఆమె కనుపించలేదని చెపితే అనేక విపర్యయాలకు దారితీస్తుంది. చెప్పకపోతే దోషంవస్తుంది. చెప్పనా? మాననా? ఈ విషమపరిస్థితిలో ఏంచేసేది? ఏది కాలార్హమైన నీతి? అన్యోన్య విరుద్ధంగా వున్న రెండుబలమైన భావాల సమన్వయం సాగేదేనా? వారిధిదాటటం, లోపం లేకుండా లంకలో వెదకటం, రావణుని చూడటంవల్ల ఏ ఫలం కలిగి నట్లు? సీతమ్మ కనుపించలేదని చెప్పటానికే పనికివస్తే. అందువల్ల పుణ్యమా? పురుషార్థమా? నేను కిష్కింధకుపోతే వానరులూ, రవిపుత్రుడూ నన్ను ఏమంటారో? రామలక్ష్మణులు ఏమంటారో? జానకీదేవి కనుపించలేదని చెప్పగానే రామచంద్రుడు ప్రాణాలు విడువడా? ఏ ఆశలో ఇంతకాలం నిరీక్షించాడో ఆయాశ అడియాశ అయితే సహించగలడా? అన్న మరణిస్తే, ఆయనే సర్వంగా నమ్మిన సౌమిత్రి జీవిస్తాడా? సోదరుల మరణవార్త విని పరమ భక్తుడు భరతుడు బ్రదుకుతాడా? భరతుడులేక శత్రుఘ్నుడుంటాడా! కొడుకుల చావు చూచి వృద్ధలైన కౌసల్యా సుమిత్రా కేకయ పుత్రికలు వెంటనే అసువులు విడుస్తారు. కృత మెరిగిన వాడూ, దాన దక్షునివాడూ, మేలు పొందిన వాడూఅయిన సుగ్రీవుడు తనవెనుక మిత్రుడు మరణిస్తే తానుసహిస్తాడా? అతడు కూడా అంతమవుతాడు. చాలాకాలానికి భర్తృసుఖం లభించిందని సంతోషిస్తున్న రుమ పతి చనిపోగానే సహగమనం చేస్తుంది. కాని జీవించుట కిష్టపడుతుందా? వాలి మరణంతో కృంగిపోయిన తార రవిపుత్ర మరణంచూచి ఇంకా భూమిపై నిలుస్తుందా? తండ్రీ లేక, తల్లీ లేక, పిన తండ్రీలేక అంగదుడుమాత్రం, ఎందుకు బ్రదుకవాంఛిస్తాడు? భర్తలచావుతో పరస్పరం కూడబలుకుకుని భార్యలందరూ చస్తారు. భార్యలతోపాటు

బిడ్డలు చస్తారు. కిష్కింధ నాశనం కాగానే వనచరులు దిక్కులేక చెట్టుకూ గుట్టకూ చేరుకుంటారు. వానర వల్లభులు చావంగానే వారి వారి ఆశ్రిత బంధుమిత్ర పరివారం భృగుపాతంతో కొంతా, ఉరిపోరం కొంతా, మంటల్లో కొంతా, విషభక్షణంతో కొంతా, నిరుపాసంతో కొంతా, కత్తి కోతలతో కొంతా నశిస్తుంది. ఇప్పుడు నేను కిష్కింధకు వ్యర్థుడనై పోతే «హా» అనే ఏడుపే వినిపిస్తుంది. ఇక్ష్వాకు వంశ నాశనం, కపికుల నాశనంవల్ల కలుగుతుంది. కనుక నేను అక్కడికి పోక పోవటమే ఉత్తమం. నేను పోకపోతే నా శక్తి సామర్థ్యాలమీద నమ్మకం కలవాళ్ళు కనుక నా రాకకోసం నిరీక్షిస్తూ అయినా బ్రతుకుతారు. ఇదే మంచి ఆలోచన." అని హనుమ ఒక నిశ్చయానికి వచ్చి మళ్ళీ పునరాలోచన చేయసాగాడు.

## హనుమ ప్రాణత్యాగం చేయాలని తలంచుట

"నేను కిష్కింధకు పోను. అంత మాత్రంతో అయినదేముంది? నా అసమర్థత బయట పడుతుంది. దోషి శిక్షించబడరాదా? సీతారామ సమాగమం జరుగుతుందా? వానరులకూ, వానరేశ్వరునికీ కీర్తి గౌరవాలు దక్కుతవా? ఇంతకూ ఆమె కనుపించలేదుకదా? కనుపించనప్పుడు నేను పోయి లాభం ఏముంది? అంతా విషాదాంతం అవుతుంది కదా? పోక వంచనతో, చిత్రవధ అయినవారిని చేయుటకంటే పోయి జరిగిన సంగతి చెప్పి వచ్చే పరిణామం ఎదుర్కొనడం మంచిదికదా? కాదు నేను జీవించగా అమంగళం జరుగరాదు. జీవించి మోసగించరాదు. అన్నింటికీ నేను ఆత్మ త్యాగం చేస్తే—చేస్తే పరిష్కారం కుదురుతుంది. అందుకు కరాదానుడ (చేతపడింది తినటం) గానో, ముఖాదానుడ (నోట్లోపడింది తినటం)గానో ఏదో ఒక చెట్టు ఆశ్రయించి, జీవేచ్ఛ విసర్జించి, వానప్రస్థుడనై జీవిత శేషం గడుపుతాను. ఇది కూడ సమంజసంగాలేదు. కొంతకాలమైనా బ్రతక వలసి వస్తుంది. నేను వెంటనే మరణించాలి. అందుకు అగ్నికి పోయి చిచ్చు రగిల్చి అందులోపడి పోతాను. రవిజుని మంత్రినై, రాముని దూతనై, వాయుపుత్రుడనై, దేవతలచే దివ్యమైన వరాలు పొందిన వాడనై జానకి దేవిని కానక వ్యర్థ ప్రయత్నుడనై జీవించటం

తిన్న, స్వామి కార్యార్థం చావటం సర్వవిధాలా ఉచితమైన పని. అదే చేస్తాను. అంత కాలవ్యవధి మాత్రం ఎందుకు కావాలి? యోగాగ్ని సృష్టించి అందులో ఆహుతి అవుతాను. నా మరణ లక్షణం చూసి మునీంద్రులు, రోగులు సంతోషిస్తారు. అయ్యో! నాకు చావు లేదేమో? ఈ వరం కూడా నాకపకారి అయిందే. మరి ఏం చెయ్యాలి? ఏమి స్ఫురించటం లేదే? అయ్యో! సుధావహాశాలినియై, చంద్ర చంద్రికాసుభగయై, యశో విభవాభిరామయై, నిద్ర లేక పోవుటచేత దీర్ఘమై నాశ కీర్తిదమైన ఈ రాత్రి జనక పుత్రికను చూడకుండా వృథా అయిపోతున్నదే. ఈ రాత్రిని అస్తమంతంచేసి తీరాలి. ప్రాణాలు వదలటం మంచి లక్షణం. నేనెందుకు చావాలి? బ్రతికి వుంటే శుభాలు పడయవచ్చని చెప్తున్నారు. సీతమ్మ కనరాకపోతే పోనీ. క్రూరుడైన రావణుని పేరు లేకుండా చేస్తాను. ఇరవై కంఠాలకు తోక చుట్టి నూరామడలదూరం సముద్రంపై యజ్ఞానికి బలి పశువును ఈడ్చినట్లు ఈడ్చుకునిపోయి రామభద్రుని పాదాలపై పడవేస్తాను. దైవం నాకింత శక్తి కోరకుండా జన్మతోనే ప్రసాదించినందుకు ఫలం సాధిస్తాను. చరాచర జగత్తును సంక్షోభ పరుస్తాను. రావణుని ముష్టిఘాతంతో, పాద తాడనంతో మర్దించి అమ్మ వారి బాధ వాని నోటనే క్రక్కిస్తాను. దారుణ రోషంతో లంకంతా మారణహోమం చేస్తాను. సర్వనాశనంచేసి రామదర్శనానికి పోతాను. నన్ను మనసారా ఆయన అనుగ్రహిస్తాడు."

## హనుమంతుడు అశోకవనం చూచుట

అని ఆశా నిరాశలమధ్య, ఉత్సాహ నిస్స్పృహలమధ్య సముద్రం లోని నావవలె కొట్టుమిట్టాడుతున్న హనుమకు కొంత దూరంలో ఒక ఉద్యానవనం కనుపించింది. "ఇది నాకింతకు పూర్వం అగుపడలేదే? ఇది అక్కడవున్న సంగతికూడ నాకు తెలియదు. దీన్ని మాత్రం ఎందుకు వదలిపెట్టాలి? దీన్నికూడా చూచి అనంతరం చేయతగిన కార్యం నిర్ణయం చేసుకుంటాను. ఇదే నా చివరి పరిశోధన. నా భావిజీవితానికి ఇదే సంధి పెద్దల నిర్ణయంలో నికషం. అదిగో ఆ దీపం తళుక్కున మెరిసింది. చీకటిగా వున్న ఆ ప్రదేశం వెలుతురులోకి వచ్చింది. ఈ సంఘటన నాకు

దారి చూపిస్తుంది. నేను చేయబోయే కడసారి యత్నం తప్పక సిద్ధిస్తుందని చెప్తూ ఉంది. ఓ అదృశ్య దేవతల్లారా! హనుమ ఇచ్చే అంజలి గ్రహించండి. ఆదిత్య వసు మరుద్గణాలకు నా ప్రణామాలు. ముమ్మూర్తులకు నమస్కారాలు. మీరు నా కార్యానికి సుప్రసన్నులై దోహదం చేయండి. ఈ యత్నంలో జానకమ్మ వార్త తెలిసి తీరాలి. లేదా రావణునితో లంకా నాశనం జరిగి తీరాలి. ఇదే నా నిర్ణయం. ముమ్మాటికీ ఇదే నా నిశ్చయం" అంటూ ఉత్సాహంతో లేచి "శ్రీరామ లక్ష్మణులకు కైమోడ్పు. సీతమ్మకు అభివాదం. సూర్యచంద్రులకు, ధర్మదేవతకు, ఇంద్ర యమద్గణ మారుత రుద్రులకు నమోవాకాలు. పవిత్రులకు, ప్రతిమాతకు, మహర్షులకు ప్రణతులు" అని అందరికీ మ్రొక్కి నాల్గుదిశలు పరికించాడు. అశోక వనంపై చూపులు నిల్పాడు. భయంకర రాక్షసగణం పరివేష్టించి ఉండటం చూశాడు. సృష్టిలోని సౌందర్యం అంతా ఒలకపోస్తున్న ఆ ఉద్యానంలో వాయువు మెల్లమెల్లగ వీస్తున్నది. కావలికాస్తున్న దైత్యులందరూ అప్రమత్తులై ఉన్నారు. "దృశ్యులకు తప్ప మిగిలినవారికి అగోచరంగా ఉండే సూక్ష్మరూపం ధరించి ఆ వనంలో ప్రవేశిస్తాను. ఓ దృశ్య భూతములారా! అదృశ్యభూతములారా! నా అఖండ బ్రహ్మచర్యవ్రతంచేత సాధించిన ఫలమంతా పణంగా ఒడ్డి కళ్యాణమూర్తులైన సీతారాములకు సంధానయత్నం చివరిసారిగా చేయబోతున్నాను. మీరంతా విశ్వశ్రేయస్సుకోసం జానకీమాతను నాకు దర్శనం అయ్యేట్లు చేయండి. లేదా మీరిచ్చిన శక్తులతో మిమ్మల్ని పీడించవలసి వస్తుంది." అని తీవ్రంగా సంకల్పించి "ఎప్పుడు జగన్మాతను సీతను చూస్తాను? ఆమె పాదాలకు భక్తితో ఎప్పుడు నమస్కరిస్తాను? రామప్రభు క్షేమోదంతం ఆమెకు ఆనందకరంగా ఎప్పుడు చెప్తాను?" అన్న తలంపులు తొందర పెట్టగా హనుమ లంకా ప్రాకారందాటి అశోకవన ప్రాకారం చేరాడు.

## హనుమంతుడు అశోక వనంలో ప్రవేశించుట

ఆ విధంగా హనుమ అశోకవన దర్శనోత్సాహంతో వనప్రాకారం చేరి దానిచుట్టూ తిరిగి ప్రవేశించే ద్వారం వద్దకు వచ్చాడు.

అన్వేషణకు అనుకూలంగా తన రూపు సంగ్రహించుకున్నాడు. అందులోకి చొరబడ్డాడు. ఆ వన సౌందర్యానికి చకితుడై క్షణకాలం నిల్చాడు. వసంతుడు విశ్వంలోవున్న పూలతోటలన్నీ విడిచి ఇక్కడే విడిది చేశాడా అన్నట్లు, సాల, తమాల, తక్కోలహింతాల, కోద్దాల, నాశోక, రసాలచంపక, కపిముఖానేక కమనీయ వృక్షతతా శోభితమై, నయన ప్రమోదానంద తర్పణమైయున్న అశోక వనంలో ప్రవేశించి, వింతలు గొలిపే విహగ మృగాలతో, ఉదయభాస్కర కాంతి వలె అరుణంగా వున్న లేచిగుళ్ళతో, ఆకులతో, పూలతో, పిందెలతో, దోరపండ్లతో, పండిన ఫలాలతో నిండిన పెక్కు తెగల వృక్షాలను చూశాడు. కోకిల కేకిజాల విహంగాది నానా పక్షికుల సంతానకలరవంతో శ్రవణపేయం చేస్తున్న అశోక వనంలో వైదేహిని వెదకటం మొదలు పెట్టాడు. వెదికే మందు సుఖంగా నిద్రిస్తున్న పక్షులను అదలించాడు. అవి లేచి భయంతో కూయసాగినై. కొన్ని ఆకాశానికి ఎగిరిపోతుంటే ఆ రెక్కల గాలికి చెట్ల పూలన్నీ జలజల రాలజొచ్చినై. రాలిన పూలరాసుల నడుమవున్న పావని పుష్పాలు నిండిన పర్వతం వలె కనిపించాడు. అందులో చెట్టుచెట్టుకూ, తీగతీగకూ తిరుగుతున్న హనుమంతుని అవి అన్నీ వసంతుడు వచ్చినట్లే మురిసిపోయినై. పుష్పభరితమైన పుడమి రత్నాభరణ భూషితయైన రమణీమణివలె ప్రకాశించింది. పరిశోధిస్తూ దాటుతున్న పవన పుత్రుని వేగానికి పూలు అతనిపై రాలి ఆమోదాంజలి అర్పిస్తున్నై. రాలిన ఆకులతో పూలతో, పండ్లతో నిల్చిన వృక్షాలు, జూదంలో కల ధనమంతా ఓడి దైన్యంతోవున్న జూదరులవలెవున్నై. శకున సంతానం వీడిపోగా, స్కంధమాత్రావశేషంగావున్న భూజాలు సకల బంధు మిత్ర పరివారం పరిత్యజించిన గృహస్థుల్లాగా ఇంపుసొంపు లేక బిక్కుమంటూవున్నై. అంతకు పూర్వం ఎంతో హృద్యంగావున్న అశోక వనలక్ష్మి వానరవర వాలహస్త చరణాహతిలో, విరిసిన కేశపాశంతో, వీడిన కంచుకబంధం, చెదరిన కుంకుమ పత్రరేఖలతో, ఖరనఖాంకురగాఢరదకపోలస్తనాధరంతో విహ్వల ఐన జవరాలివలె అయింది.

# హనుమంతుడు అశోకవనంలో
# విపరీతంగా విహరించుట

వింధ్యాచల శిఖరాగ్రంలో వర్షంతో కూడిన మేఘంలా ఆ గదపల అనేక చెట్లను వెదజల్లుతూ హనుమ తీగ గుంపుల పొంకం, వింతం చెదరగొట్టాడు. ఆ విపరీత విహారంలో వనమధ్యంలోవున్న మగరాలు రాసిన వేదికలనూ, వెండిపైడి రేకులతో కప్పిన విశ్రాంతినిచ్చే ఆసనాలనూ, మంచి సున్నంతో నిండిన గోడలనూ, మణిమయసోపానమండపాలనూ, మౌక్తిక విద్రుమమండపాల సింహాసనాలనూ. స్ఫాటికకుట్టిమాలనూ, వివిధ మనోజ్ఞమాలికలనూ పద్మపత్రాంగ షట్పదకూజిత సరోవరాలనూ చూచాడు. ఆవనంలో ఒక వంక విచిత్ర వాటాలతో ఉన్నట్లుగా శిలంతో నిర్మించిన కృతక కేళిపు పర్వతం కనుగొన్నాడు. ఆ కొండ శిఖరం నుంచి క్రిందికి పారుతున్న సెలయేటిని చూచాడు. అది కోపంతో భర్త రొమ్ముపై నుంచి దిగి విసురుగా పోతున్న కోపనమైన కాంతవలె వుంది. తీరస్థ వృక్ష శాఖలు వంగి నీళ్ళను అడ్డగించగా వెనుకకు మరలుతుండే కోపంతో లేచిపోతున్న ఆకోమలాంగిని వారించే చుట్టాలవలె, శాంతించి మరలే సతివలె దర్శించాడు. ఆ సెలయేటికి అల్లంత దవ్వులో బహుపక్షి పుష్పఫలితమైన కాసారాన్ని కాంచాడు. చిత్రవిచిత్రానేక రత్నఖచిత సోపానపంక్తులతో, పరిశుద్ధ శీతజలంతో, కృత్రిమ వనాంతో, త్వష్టనిర్మించిన సౌధాలను చూచాడు. చెట్టుమొదళ్ళలో చతురస్రంగా నిర్మించిన మేలిమి అరుగులను వానరపుంగవుడు చూచి తనలోతానే పొంగిపోయాడు. గుంటలు, మిట్టలు, నదులు, చెట్లు ఒకటేమిటి? అన్నీ బంగారురంగుతో వెలుగుతున్నై. ఆ ప్రకాశమానానికి తానుకూడ మేరుపర్వత తరచులతో వెలిగేవేడి వెలుగులాగా వెలుగుతున్నానని భావించాడు. ఆ స్వర్ణవర్ణ కుజాలమధ్య బంగరుమువ్వల మ్రోతను నిరంతరం మ్రోగిస్తూ, అచ్చెరువు కొల్పుతున్న శింశుపావనీరుహాన్ని చూచాడు. అనంతరం సురుచిర కోమలాంకుర పల్లవ సుసంపన్నమైన శింశుపానగం అధిరోహించాడు. ఇక్కడ నుంచి ఈ వనమంతా పరికిస్తానని తలంచి నలుదిక్కులు కలయచూచాడు. రామదర్శనలోల, రమ్యశీల, జనకపుత్రి, చారుగాత్రి, సద్గుణ సముపేత, సీత ఈ

వైభవమంతా వెంపెట్టి అద్వితీయంగా నిర్మించిన అశోక వనాన్ని పావని పారచూశాడు. వికసించిన అశోకాలు ఎర్రని కాంతులతో వెలిగి పోతూ అరుణోదయసూర్యకాంతుల అపహసించి మంటల దీప్తితో వంత నాలు సలుపుతుండగా మారుతి మర్మశోధనం చేశాడు. రాలుతున్న పూలు ధూపదూలుకాగా ఒకే సమయంలో పక్షులు తలలాడిస్తూ రెక్కలు విప్పి కొనగా, పూలన్నీ ఆ రెక్కల్లో తిప్పవడి సర్వాంగాలంచేసి కట్టుబట్టలతో నిల్చిన గృహస్థులవలె పుష్పవిహీనమైనవాటితో పాదపాలు పొడగట్టగా మహాకపి మనసులో రత్నమైన సీతను అన్వేషించాడు. ఒకవైపు పుష్పఫలభరిత భారంతో నేలను వంగుతున్న కొమ్మలుగల అశోకాది వృక్షాలలో పరికించాడు. ఇంకోవైపు కుసుమిత కర్ణికారాలు, క్రొన్న నలు కలిగిన కింశుకభూజాలనూ, పనసల పున్నాగాలనూ, పొన్నలనూ, చంపకాలనూ, సనిగలతాల పంథసన్నిభ దాయసాలనూ వానరశ్రేష్ఠుడు విడువక సీతను వెదకాడు. కాటుక రంగు చెట్లు కొన్నీ, ఎర్రని రంగు వృక్షాలు కొన్నీ, తెలుపురంగు భూమిరుహాలు కొన్నీ, వేల సంఖ్యలో వుండి, నందన చైత్రరథవనాలను నాణ్యతలో మించుతూ ద్వితీయగంధమాదన పర్వతంవలె భాసించే అశోకవనంలో అంజనాపుత్రుడు క్రమంగా పరిశో ధించిచూస్తూ వనమధ్యంలో కైలాసంవలె శుభ్రమై ఎగసినమెట్లూ, తప్త సువర్ణ వేదికలూ, కనకరత్నఖచిత స్తంభ సహస్రాలూ కలిగి వెన్నె రెడి ఒక దివ్యహర్మ్యం చేరువకు చేరుకున్నాడు. అక్కడికి రాగానే హనుమ ఆత్మ ఎందుకో ప్రసన్నమైంది.

## హనుమంతుడు సీతాదేవిని చూచుట

ఆ మేడవైపు హనుమ చూస్తుంటే శుభ సూచకంగా ఎడి కన్ను, కుడి భుజం ఒక్కసారి అదిరి ఆగిపోయింది. ఎక్కడ లేని సంతోషం తనకే కల్గినట్లనిపించింది. ప్రయాణ ప్రారంభం నుంచి అప్పటి వరకు తను పొందిన శ్రమంతా ఫలించినట్లు శరీరం తేలికపడింది. "అమ్మయ్యా. పని నెరవేరింది." అని భావించి దీర్ఘశ్వాసను వదలి ఆ హర్మ్యాన్ని జాగ్రత్తగా హనుమ చూడటం మొదలు పెట్టాడు.

ఆ మేడకు సమీపంలో శింశుపా వృక్షం వుంది. అది ఎంతో మనోజ్ఞంగా వుంది. దాని నీడలో సుందరాతి సుందరంగా చలువరాళ్ళతో ఒక వేదిక వుంది. ఆ వేదికపై మాసిన చీరతో, ధృతిమాలిన చిత్తంతో, ఇంతైనా గ్రాసం లేకపోవటంతో, చిక్కిపోయిన శరీర విభవంతో, పై పై మాటిమాటికీ వదలే నిశ్వాసాలతో, గుటుకుపట్టటానికి కూడ వీలు కలిగించని దేహచ్ఛాయతో, హోమధూమ సంఛన్న హుతాశనార్చిగని ఆకసంలో నెలవంకలాగా, గాసిపెట్టే కర్కశ రాక్షసకాంతలమధ్య, ఎంతో శ్రమ చేసినాని నిర్ణయించరాని రూపదుస్థితో, దుఃఖభారంతో క్రుంగి కృశిస్తున్న ఒక కాంతను కపివల్లభుడు కనులారా చూచాడు. ఆమె శరీరం ధూళిధూసరంగా వుంది. కమలాలులేని కొలనులాగా, అలంకార రహితంగా పీతవర్ణంగల ఒంటిచీరతో కుజగ్రహం పట్టిన రోహిణీచందంగా, వాకి పవిత్రమై, తపస్వినియై వున్న ఆమె హనుమంతుని హృదయం ప్రపీడితం చేసింది. కాటుకలైపారే కన్నీళ్ళు మొగమంతా తళ్ళలంచేయగా, ఎడతెగని ఆలోచనలకు చిక్కి, శోకంతో క్రుంకి, ఎప్పుడు వెక్కి వెక్కి ఏడుస్తున్నదాన్ని, అయినవారి మొగాలకు కరవై కటిక రక్కసిగుంపు మొగాలుచూచి బెగడుపడేదాన్ని, వేట కుక్కల పాలిపడిన ఆడ లేడివలె అల్లాడేదాన్ని, నక్షత్రాలవలె జఘనాలను దాటుతున్న ఒంటిజడతో వున్నదాన్ని, శరత్కాలంలో ప్రాతర్వేళ కారడవుల్లో వుండే కితిజంలాగా వున్నదాన్ని చూచి హనుమ నిశ్చేతనుడైనాడు.

## హనుమ సీతను చూచి తనలో తర్కించుకొనుట

కొంతసేపటికి తెప్పరించుకొని "అయ్యయో! ఎంత కానికాలం వచ్చింది! వ్యసనం అంటే ఏమిటో ఎరుగని ఈమె వ్యసన పడుతూంది. భోగభాగ్యాలతో, సుఖ సంతోషాలతో ప్రొద్దు పుచ్చవలసిన ఈమె దురంతమైన చింతతో దీనాతిదీనయై రక్కసులమధ్య నిద్రాహారాలుమాని జీవిస్తూంది. ఇప్పటి ఈమె పరిస్థితిచూస్తే, భర్తృవియోగ భారంతో బాధపడుతున్న సీతమాతయే అనిపిస్తూంది. ఆనాడు ఏ మాతంగలకాంతను రావణుడు బలాత్కారంగా వెంటకొని పోతుంటే మేం పర్వతంపైనుంచి

చీరముక్క రంగుకూ, ఈ చీరరంగుకూ భేదంలేకపోగా పయిట భాగం కొంత చినిగివుంది. ఈమె చీరమాసివున్నా నలిగినచోట ధూళిపోయి కొంత కనుపిస్తున్నందున సర్వవిధాలా ఈమె రామపత్ని అనుకొనుటకు తగివుంది. ఈమె రాముని హృదయేశ్వరియే. దూర విప్రవాసాయమై రాముని హృదయంలో ఎప్పుడూ పాయకుండా వుంది. రాముని అంగ సౌష్ఠవంవలెనే ఈమెకూడా ఆ సౌష్ఠవమే కలిగివుంది. భార్యాభర్తలు అనురూప లావణ్యంకలవారు కావటం దుర్లభం. అదే వీరిరువురిలో అచ్చుగ్రుద్దినట్లుంది. ఇట్టి శుభలక్షణ లక్షిత కనుకనే రాముడు వియోగ భారం భరించలేక పోతున్నాడు. ఈమె కూడ పతినిబాసి పరితపిస్తోంది. ఇంత మనోనిగ్రహంగల కాంతకాబట్టే దాశరథి భార్యను శంకింపక ఆశతో బ్రదుకుతున్నాడు. ఆపదలో అంగనను కాపాడలేకపోయినన్న కాతర్యం, నన్ను నమ్మిన ఇల్లాలికి ఇన్నిపాట్లు వచ్చెనే అన్న ఆనృశంస్యం, అర్ధాంగిని కోల్పడినానన్న శోకం, ప్రియ నా వెంటలేదన్న ఒంటరితనం రాముని హృదయాన్నిపట్టి వల్లాప్పుతున్నై. ఆ భావాలే స్త్రీజనానుకూలంగా మారి ఈమెను బాధిస్తున్నై. అందుకే ఇద్దరూ జీవించి వున్నారు. ఇటువంటి అర్ధాంగిని కోల్పడి బ్రదికాడంటే రామునిలో ఎంత మనోనిగ్రహంవుందో తెలుస్తూనే వుంది. జగద్భయంకర కోదండధారి ఏనాటికైనా కాపాడకపోతాడా అన్న ఆశతోనే ఈమె జీవించివుంది. చూడవలసిన ఆమెను చూడకలిగాను. ఇది సంతోష కారణమే. కాని, ఈమె దీన స్థితిచూస్తే ఇది భరించరాని దుఃఖకారణం కూడా అయింది. ఏదిఏమైనా ఈమె జీవించి నాకు దర్శనం ఇచ్చింది. ఇదేచాలు. ఈపైన చేయవలసిన కార్యం ఇక నిర్భయంగా, నిర్విఘ్నంగా, నిరాటంకంగా నెరవేరుస్తాను. సర్వ దేవతలు నా మొరలాలకించి సంతోషంతో సాయపడ్డారు. ఆదర్శ దంపతులైన సీతారాముల అనుసంధానం నాచేత చేయించి పరమేష్ఠి నాజన్మకు చారితార్థ్యం కలిగించాడు." అని క్షణకాలం మనసు ఆనంద నృత్యం చేశాడు.

# హనుమంతుడు సీత స్థితికి దుఃఖించుట

అతి కష్టంమీద అవనీజను ఆలోకించిన పిమ్మట ఆమెను రామ పత్నిగా నిర్ణయించుకొని శ్రమకు ఫలితం దొరికిందని ఆనందంతో నృత్యం చేశాడు. అంతలో ఆమె వున్న దీనస్థితి చూచి పట్టరాని బాధతో పరితాపం పొందసాగాడు. "అయ్యో! ఎక్కడ పుట్టింది? ఏవిధంగా పెరిగింది? ఎక్కడ మెట్టింది? నాగటిచాలులో యజ్ఞ సంకల్ప దీక్షితుడైన జనక చక్రవర్తికి అయోనిజగా దొరికింది. ఆమె ఆ దంపతుల ప్రేమ సంస్కారముంతో పెరిగింది. అసాధ్యమైన శివ ధనుస్సు అవలీలగా అటుఇటు పెట్టగలిగింది. లోకోత్తర సౌందర్యమూర్తియై, మహేశ్వర కోదండ ఖండన పటిష్ఠుడైన రామచంద్రుని పాణిగ్రహించి ఇక్ష్వాకు వంశంలో ప్రవేశించి, పిన్నతనంలోనే సాధ్వీ మకుట శిరోమణిగా పేరు మోసింది. భర్తతో అడవికివచ్చి ఆదర్శ గృహిణిగా అలరారింది. ఈమె కేనా ఈ క్రూరునిచే నిర్బంధం, ఈ ముష్కర రక్కసి గుంపుల పీడనం? ఈ సుకుమార తనువల్లికేనా భర్తృ వియోగబాధా ప్రభంజనం? ఈ అసూర్యంపశ్యకేనా అన్నపాన సుఖశయన దూరం? నిరంతరం ఏడ్చి ఏడ్చి కన్నులు ఉబ్బి వున్నవి. ముఖం కళ తొలగింది. ఈ తల్లి ఏ యాశతో ఇంతకాలం శరీరధారణ చేసిందో ఆ ఆశతోనే రామచంద్రుడు కూడ జీవం దాల్చి వున్నాడు. ఆహా! ఏమి వీరి అన్యోన్య ప్రేమానురాగ వైభవం! ఇంతటివారికే ఇంతటి కష్టాలువస్తే, గుణహీనులు పడేబాధలకు అంతేముంటుంది? ఈమెను చూస్తేనా గుండె చితుక్కుపోతూంది. దశరథుని కోడలు, రాముని పత్ని, జనకుని పుత్రి ఈమెకే శోకం తప్పక పోతే విధి ఎంతదురతిక్రమణీయమో! అందుకే "ఎంతవారైనా విధిబద్ధులే" అన్నారు పెద్దలు.

రాముని వ్యవసాయం, సౌమిత్రి బలం తెలిసింది కనుకనే శోకంతోనైనా, వానలకు దేవ వాహినిలాగా కలకబడటంలేదు. రాముని సీత, సీతను రాముడూ ప్రాయంలోనూ, శీలంలోనూ, సాముద్రిక లక్షణాలలోనూ, సద్వంశంలోనూ తగి వున్నారు. ఈ కాంత కోసం కదా రాముడు ఒక్క బాణంతో వాలిని వధించింది? ఈ సుశీలకోసంకదా రావణునితో సమానుడైన కబంధుణ్ణి కాలుని పురం కాపుపంపింది? ఈ మానినికోసంకదా అనిరోధుడైన విరాధుని అంతం చేసింది? ఈ అమ్మ

కోసం కదా పధ్నాలుగువేల రక్కసుల రూపుమాపింది? ఈ సాధ్వికోసం కదా
ఖరదూషణ త్రిశిరాదుల ఖండించింది? ఈమె కోసమే కదా అలభ్యమైన
కిష్కింధా వైభవం అంతా రవిపుత్రునికి రాముడు చేర్చింది? ఈ మాత
కోసం కదా శతయోజన విస్తీర్ణ సాగరం నేను తరించింది? లంకను దర్శించింది
ఈమెకోసం శ్రీరాముడు ఈ విశాల విశ్వాన్ని దహించినా తప్పులేదని
నేను తలంచుతాను. "త్రిభువనరాజ్యమేలా? సీతమ్మమేలా?" అంటే
ఈమెలోని ఏ ఒక్క అంశానికైనా అది చాలదంటాను. ఈమె ధర్మ
శీలుడూ, మహాత్ముడూ, మిథిలానాథుడూ అయిన జనకుని పుత్రిక
సీతయే. సంశయంలేదు. ముమ్మాటికి ఈమె సీతయే. నా అంతర్వాణి
అవునని చెప్తూంది. ఇంత చల్లని తల్లిని, ఇంత భర్తృప్రేమైక
జీవిని రాముడు కోరటం యుక్తమే. దప్పికతో తపించే పాంథుడు
చలువ పందిరినే కదా కోరుతాడు. రాజ్యభ్రష్టుడు మళ్ళీ రాజ్యం పొందిన
చందంగా, రాముడు సీతను పొంది రహించును గాక. చుట్టాలు దూరమైనా,
భౌతిక సుఖాలు పంచబంగాళమైనా, భరించరాని కష్టాలు వచ్చినా,
"ప్రాణనాథుడు దైత్యుని దునిమి తనను తప్పక గ్రహిస్తా"డన్న
ఆశతో అయ్యయ్యో, ప్రాణాలు గుప్పిటబట్టి బ్రతుకుతూంది. చుట్టూ
మూగి బాధిస్తున్న సురవైరి కాంతలవంక చూడదు. పుష్పఫలద్రు
మాలను చూడదు. సుందరమైన అశోకవనాన్ని, అందమైన హర్మ్యాలను
చూడదు. ఆమె చూస్తున్నది హృదయనాథుడైన రాముని రాకను. అది
ఆదర్శయోషామణికి యుక్తమే. ఎన్ని భూషణాలున్నా సతికి భర్త
కంటే మించిన భూషణాలవి కానేకావు. ఆ భూషణం దూరం కావటంతో
మట్టిలో మాణిక్యంలాగా ఈమె సర్వం మరుగుపడింది. రాముడు ఎంత
ఇంద్రియ నిగ్రహం కలవాడో ఈమె సాహచర్యం లేకుండా ఇంతకాలం
జీవించటమే చెప్తుంది. ఇంకొకడైతే మరణించటమో, మతిభ్రమణం
పొందటమో జరిగేది. రామలక్ష్మణుల రక్షణ మధ్య సుఖంగా జీవించే
ఈమె, ఈ వికృత శరీరాలుకల రాక్షసాంగనల నడుమ క్రూరమృగాల
మధ్య నిలిచిన లేడిలాగా చెట్టు మూలంలో కూర్చొనివుంది. విధికేది
అసాధ్యం తప్పచూస్తే? మంచుగప్పిన తమ్మిపూవువలె కాంతిబాసి
దుఃఖ పరంపరతో తప్తం అవుతున్న ఈమె పురుష చక్రవాకాన్ని పాసిన

పెంటి చక్రవాకంవలె దీనతతో వుంటుంది. ఈమె ముఖాన్ని చూస్తుంటే శోకధర్మం ఎరుగని నాకే దుఃఖం ఆగటంలేదు. ఇక రాముని సంగతి వేరే చెప్పటం ఎందుకు? పూలతో వ్రాలిన కొమ్మలుగల ఈ అశోక వనం, మలయమారుతం, చంద్రచంద్రికాలోకితం ఈమె మన్మథా వేదను పురికొలిపెంచి ఇంకా శోకాన్ని ఇనుమడింపచేస్తున్నై. ఈమే సీత. ఇట్టి కాంత ఈ మహానగరంలో ఎక్కడా కనుపించలేదు. ఈమె మహా పతివ్రత కనుకనే దుర్బుద్ధితో కొనితెచ్చినప్పటికీ చేసేదిలేక చెరలో పెట్టాడు. ఇంకా కొంతకాలం వేచిచూస్తాను" అని హనుమంతుడు శింశుపా వృక్షంలో దాగాడు. ఆమె చుట్టూవున్న వాతావరణాన్ని నిశితంగా చూడ మొదలుపెట్టాడు.

## హనుమంతుడు సీతకు కాపున్న దైత్యకాంతల చూచుట

హనుమంతుడు కడుజాగరూకుడై ఒడలెల్లా కన్నులు చేసుకుని ఆమె ఏ స్థితిలో వుందో, ఎలా నిర్బంధించబడివుందో, పరిశీలించే సమయంలోనే, నీలాంబువుల్లో రాజహంసంలాగా, గగనం అపరభాగాంతరంలో తెల్లకలువల కాంతితో చంద్రుడుతోచాడు. పావని సహాయానికి తోడుపడదలచాడో అన్నట్లు ధవళనిర్మల తేజోరాసులు తాపం చల్లార్పునట్లుగా చంద్రుడు చంద్రికలను వెదజల్లాడు. ఆ వెన్నెల వెలుగులో భారంతో మునిగే నావవలె దుఃఖంతో నవయుచున్న నాగటిచాలునవలా విన్ననను, రాముని ఇల్లాలును చూచాడు. ఆమెను చూచిన తర్వాత ఆమె నికటంలో ఆసీనలై వున్న అసురకాంతలను చూచాడు. వారంతా, "ఏకాక్షి, అకర్ణ, ఏకకర్ణ, శంకుకర్ణ, తనుదీర్ఘకంధరలు, విచిత్రనాసిక, లంబకర్ణ ధ్వస్తకేశిని, శిరోముండిత, దీర్ఘకాయ, దీర్ఘదంష్ట్రిక, లంబకుచ, నీల కంధర, లంబజానుక, లంబాస్య, లంబజఠర, లంబరదన" అనే వికట నామాలతో [illegible] మదవిమోహాకృతితో కూర్చునివున్నారు. ఇంకాముడుగుజ్జులు, వామనలు, మిట్టపండ్లవారు, పొట్ట ఉబ్బినవారు, ముక్కిడులు, పింగాక్షులు, బోసినోటివారు, వికృతులు, కాణలు, పింగళలు,

క్రోధనలు, కాలాంతక కాలకూట ముద్గరహస్తలై, కలహప్రియలై, అజమృగమహిష శివాస్యశిరస్కలై వారికి కాపుకాస్తున్నారు. వ్యాఘ్ర ముఖులు, ఉష్ట్రిగజఘోటకాంఘ్రులూ, నిఖాతమూర్ధులు, ఏకాంఘ్రు ఏకకర్ణలు, అశ్వకర్ణికలు, ఖరకర్ణికలు, హస్తి కర్ణికలు, గోకర్ణికలు, హరికర్ణికలు, వాళ్ళపై అజమాయిషీ చేస్తున్నారు. "అతినాస, అనాస, చ్యుతనాస, ఉదరనాస, తిర్యఙ్నాస, నాగనాస, పాదచూళిక, హస్తపాద, గోపాద, మహాపాద, దీర్ఘజిహ్వ, దీర్ఘనఖ" అనేపేర్లుగల దనుజ కాంతలు పై మాటవరసల వాళ్ళపై మోహరించి వున్నారు. ఎంత మేధావినైనా అనుమానం ఎంత తెలివితక్కువ వానిగా చేస్తుందో ఈ సంఘటన ఋజువుచేస్తూంది. అపారమైన పారావార మధ్యంలో తన లంక వుంది. అందులోకి లంకాధిదేవత అనుమతి లేకుండా చీమకూడా రాదు. అలావస్తే ఆమె తనకు ముందుగా తెలుపుతుంది. తెచ్చింది పరస్త్రీకాంతను. ఉంచింది దుష్ప్రవేశమైన అశోకవనంలో. అది చాలక పరస్పర పరిశీలనాబుద్ధులైన నాల్గువందల నక్తంచరకాంతలను, శత్రు పాలబడక ఆమె పారిపోకుండ రావణుడు కాపుపెట్టాడు. అందే అతణ్ణి అనుమానం ఎంత క్రిందికి దిగజార్చిందో తేటతెల్లంగా తెలుస్తూంది. వాళ్ళంతా కల్లుత్రాగుతూ, రక్తం ఒళ్ళంతా పూసుకుని అగ్నికుండాల వలెవున్న పిడిగుడ్లతో ఆమెచుట్టూ, చెట్టుచుట్టూ కాపుంచటం కాంచాడు. ఆ వ్యూహ రచనకు హనుమ ఆశ్చర్యపడ్డాడు.

## హనుమ సీతాదేవిని చూచి సంతోషించుట

ఆ భయంకర దృశ్యం నడుమ చెట్టు క్రీనీడలో, వనటచే వగచే దాన్ని, మాసిపెనవేసుకున్న వెంట్రుకలదాన్ని, కాంతి తరిగినదాన్ని, కాంతుని కాననిదాన్ని, భూషణాలను పూర్తిగా పరిత్యజించినదాన్ని, భర్తృపరాగం పరమ భూషగా ధరించేదాన్ని, పుణ్యంపోగానే పుడమి పై రాలే చుక్కవంటిదాన్ని, రావణాపహృతయై బంధువులకు దూరమైన దాన్ని, సింహం ఆఘ్రాణించిన కరిణీలాంటిదాన్ని, పాపని కారణంచే తంత్రులు వదులై ధూళిగ్రస్తమైన వీణ వంటిదాన్ని, నిరంతరం పతినామం ప్రణవము దోహదంగా బ్రతికేదాన్ని, రాక్షస స్త్రీలు పలికే పరుష వాక్యా

శకుంత సంకులంకలంచేతా, ఈహా మృగ వ్యాళాలచేతా, ద్రుమగుల్మోహ రంగా అమర్చిన రత్న కాంచన తోరణాలచేతా, బహుమృగాకీర్ణమై, గళత్పుష్పనివహమై, నిత్యపుష్పమై, శోభావిలసితమైన అశోకవనం ప్రవేశించాడు. సహస్రాక్షుని అనుసరించే అమరగంధర్వ సతులవలె వందమంది అతని సేవిస్తూ అసుర స్త్రీలు చామరహస్తలై నడిచారు. రంగారు బంగారు భృంగారాల్లో జలం నింపుకొని కొందరు కోమలాం గులరాగా, మరికొందరు మండలాగ్రాలు, మణిమయాసనాలూ, మణిపాత్రలో ఘృతము పూరించి వాళ్ళను అనుసరించారు. ఒక సుందరి, రాజహంస వలె, రాకాచంద్రునివలె ప్రకాశించే ఛత్రం పట్టింది. ఒక కలకంఠి, పైడి దండం ధరించింది. కూర్కే కన్నులతో కులకాంతలు పరివేష్టించిరాగా, మేఘాల వెంట నడిచే మెరపుల్లాగా ప్రియాంగనలు నడుస్తుండగా పంక్తి కంఠుడు వనిలో ప్రవేశం చేశాడు. ఈ విధంగా అనుకోకుండా, వీడిన కొప్పులూ, రాలినపూలూ, పూతలూ, జారినసరాలూ, చెదురసొంపులూ, మత్తు కంఠాలూ, చెమటకు తడిసిన శరీరాలూ, తెగిన రత్నాభరణ హారాలూ, జేవురు కన్నులు, చెలువంపు చిన్నెలు, మేలైన వన్నెలు మెరయించే అవయవాలూకల అంగనామణులతో, రాగం ముందుకునెట్టగా రావణుడు రామపత్నిపై కామంతో మాధ్యం సహించి, మర్యాద మట్టగించి సమీపించాడు. ఆ రావణుని రాకతో అశోకవనమంతా కలకీపికా సహస్రంతో కళకళ లాడింది. అతడధిరోహించి వచ్చిన గజం నడిచేటప్పుడు ఇరువైపుల వేసిన బంగరు గొలుసుల గంటల మ్రోతలు కపివీరుడు విన్నాడు. ఆ ధ్వనివైపు చూచి, ద్వార సమీపంలో వచ్చిన లంకేశుణ్ణి ఆహ్వానించే వనరక్షకాధికారులబలగం పట్టే మణిదీప కాంతుల్లో మన్మ ధుడులాగా కనిపిస్తున్న వీరుణ్ణి దర్శించాడు. హనుమ చూచే సమ యంలో అమృతఫేన సన్నిభమైన శ్వేత వసనాన్ని చేయితో సవరిస్తూ, భుజబలంలో ఎదుర్లు లేరని చెప్పతగిన వింశతి భుజాలతో వెలుగు లీనుతున్న రావణుని కూడా చూడటం జరిగింది. తానింతకు పూర్వం అంతఃపురంలో నిద్రావస్థలో వున్న అసురుల నాయకున్ని చూచాడు. ఆ మూర్తికీ, ఈ మూర్తికీ ఎంతో తారతమ్యం వుంది. కాంచనకాంచీ చంచన్మణి కింకిణీల సవ్వడులమధ్యలో సర్వాభరణభూషణభారవిలాసుడై

వలె మహాబలవంతుడై, రూపవంతుడై కనిపించిన విశ్రవసుని కుమారుడు నిర్మలాకాశంలో తారకలమధ్య శోభాకరంగా ప్రకాశిస్తూ వెలిగే చంద్రుడు వలె వున్నాడు. "ఆహా! ఇతడా రావణుడు? ఇతడా ఈ లంకాధిపతి? ఇతడా రామచంద్రునితో నిష్కారణ వైరం పెట్టుకున్న వీడు? ఇంతటి లోకైక సుందరుడు అందరినలరించే వాడుండగా ఈ ప్రాజ్ఞుడు అగ్నిని కొంగులో ముడివేసినట్లుగా మహాసాధ్విని బలాత్కారంగా ఎందుకు కొనితెచ్చాడు? ఈ అనర్థంలో ఇక్కడికి ఎందుకు వచ్చాడు? ఏం చేయ తలచాడు? ఏమిచూస్తాడు" అని లోపల తర్కించి ఆ మహాత్ముని తేజఃప్రకాశంలో విగతతేజుడై హనుమ అతడు కనిపించే చోటుకు చేరి దాక్కున్నాడు. రావణుడు కూడ సమీపస్థుడై సీత వున్న ప్రదేశాన్ని సమీపించాడు.

## రావణుడు సీతాదేవిని చేరబోవుట

ఉన్న వైభవమంతా ఒలకపోస్తూ ఆడంబరంగా వస్తున్న అసురనాథుని అల్లంతదూరంలో చూచిన జనకజాత గాలికి ఊగే అరటి చెట్టువలె వణకుతూ, ఉదరం బాహువులూ, వక్షోజాలూ ఊరుయుగ్మంలో దాచుకుని ఘోరంగా దుఃఖంతో కుమిలిపోసాగింది. ఉత్సాహం, ఉద్రేకం ఉరకలువేస్తూండగా రాకాసిమూకల రక్షణలో వున్నదాన్ని, జలధిలో తలక్రిందవుతున్న తరణిపోలినదాన్ని, కటికనేలపై ఆసీనురాలై వున్నదాన్ని, త్రెంచివేసిన తీవెనుపోలినదాన్ని, అసమాన సంకల్పతరంగాలదాన్ని, మట్టితోగూడిన మేనుతో ఒప్పుతున్నదాన్ని, తన కష్టాలకు అంతంలేదని కంటికీకడివెడుగా ఏడ్చేదాన్ని, గొప్పకులంలో పుట్టి, గొప్పగుణాలుకలదై, వివాహంచేత కాపురమెట్టి, నిదురలోద్భవిష్ట భర్తగా పడసిన పతివ్రతవలె లోలోపల మరగేదాన్ని, ఆత్మేశ్వరుని కోసం అహర్నిశలు ఎదురుచూస్తూ, వస్తాడనే సంకల్పహృదయంతో జీవితరథం నడుపుతున్నదాన్ని, సమసిన యశస్సునూ, ఆదరం చూపని శ్రద్ధనూ, సంక్షీణమైన పూజనూ, భగ్నమైన ఆశనూ, చెల్లాచెదురైన లాభమునూ, వాడిన కమలమునూ, కారుచిక్కునూ, చీకటితోకూడిన వెలుగునూ, నిదానంలో ఎండిపోయి, హతహత సైన్యంవలె, ప్రతి

హత శాసనసంకీర్తి, రాహుగ్రస్త చంద్రుని భాతి, శాంతానలంభంగి, అపరిశుద్ధ వేదిక చొప్పున, గత సంతోషంచే కశ్మలపూరితమైన కాసారం చొప్పున, కట్టతెగిన తటాకం గతి, కృష్ణపక్ష చంద్రుని రేఖ, భయంతో, శోకంతో, ఉపవాసాలతో, గ్రీష్మకాల నదివలె కృశించి వెలవెలపోతున్న సీతామాతను, "నా భర్తకు తేజం హెచ్చించి, ఈ దశగ్రీవుణ్ణి సబాంధవంగా సంహరించి నన్ను కొనిపోయే సమయం ప్రసాదించండి దేవతల్లారా!" అంటూ బెగ్గడిల్లిపోతున్న జానకిని దురదృష్టం రూపు కట్టివచ్చినట్లు రావణుడు చేరాడు. ఆమె దివ్యతేజస్సుకూ, అపూర్వ సౌందర్యానికీ ఆనందించాడు.

## రావణుడు సీతకు తన కోరికను తెలుపుట

"ఓ చారుహాసినీ! ఎందుకు నన్ను చూచి ఇంత భయపడుతున్నావు? నీ లావణ్య శరీరం ఎందుకు కుంచించుకుంటున్నావు? ఇక్కడ మనుషులెవ్వరున్నారు? వీళ్ళంతా పరివారకులే. పరిచారికలే. నా మాటను సూటిగా పాటించు. రూపవతులలో నీవు శ్రేష్ఠురాలవు. నన్ను బహూకరించు. మీ మానవులూ లేరు, మా కామచరులైన రాక్షసులూ లేరు. ఇంక నీకు భయమెందుకు? సంకోచం ఎందుకు? నేను లోక భయంకరుడనే కావచ్చు. నీపట్ల ప్రసన్నుడనేకదా. పరదార గమనం, పరదారాపహరణం మా రాక్షసులకు కులధర్మం. ఇది ఇట్టిదైనా నీవు అకామవు. అందుచే నిన్నింత వరకు అంటలేదు. కామాగ్ని నన్ను కాలుస్తున్నప్పటికీ, నీ అంగీకారం కోసం ఆగాను. నన్ను యథాకామంగా కామించు. నా ఎడ కరుణామతివై ప్రవర్తించు. నీవు ఎంతమాత్రం భీతి చెందవద్దు. ప్రసాద దృష్టితో నన్ను సంభావనం చేయి. వ్యర్థంగా వెతంపాలుకాకు. త్రిభువనాల్లో సాటిలేని వైభవంగల లంకా నగరంలో, కోరితే అసాధ్యాన్ని సాధ్యంచేసే అవక్ర విక్రమ పరాక్రముడైన రావణుని సమక్షంలో ఏకవేణివై, కటిక నేల శయ్యగా, పస్తులుండటం నాకు సంతోషమూ కాదు, నీకు ఉచితమూ కాదు. ఈ మాసిన చీర, సంస్కారంలేని శరీరం ఎందుకు ధరించినట్లు? ఎవరికోసం ధరించినట్లు? నీవు కోరితే దివ్యమైన భూషణాలు లేవా? అనర్ఘ చీని చీనాంబరాలులేవా? చందన లేపనాలులేవా? సుందరమందిరాలు

లేవా? నామధేను కల్పవృక్ష చింతామణులు నీ పాదా లాశ్రయించవా? ఇప్పటికే చాలాకాలం వ్యర్థమైంది. ఇకనైనా వెలిచి తెమ్ముకుని నన్నానందపెట్టి నీవానందించు.

నీవు తెలియకుండా ఎంతోకాలం వ్యయమవుతూంది. దానితో నీ యౌవనం అడవి కాచిన వెన్నెలలా వ్యర్థంగా నశిస్తూంది. వర్షాకాలంలో వచ్చే ప్రవాహం శరత్కాలంలోరాదు. పోయిన యౌవనం పొందటం నీ తరమా? నా తరమా? చతుర్ముఖ బ్రహ్మకు తరమా? నిన్ను చూస్తుంటే ఆ విధాత నిన్ను సృష్టించిన అనంతరం నీకంటే అందకత్తెను సృష్టించలేక పోయాడనిపిస్తుంది. అట్టిదో నిన్ను శ్రమతో తెచ్చి వ్యర్థముగా ఎంతకాలం వేగించుతావు? లోకంలోని సౌందర్యవతులలో నా కంటికి నచ్చిన వారినీ, నా మనస్సు మెచ్చినవారినీ సహస్ర సంఖ్యలో లంకకు తెచ్చాను. కాని వాళ్లెవరూ నా చూపు నీ శరీరంపై ఎక్కడనిలిస్తే అక్కడే ఆగిపోయేట్లు చేయలేకపోయారు. నిన్నుకూర్చి చెప్పటానికి ఏంమిగిలింది? నీ అనుగ్రహం మిగిలింది. నా ప్రాప్తం మిగిలింది. లోకాలన్నీ పాలించే దేవతలు నాయాజ్ఞానువర్తులు. మానవులు నా జాతికి అశనం. నన్ను నిగ్రహించి బ్రతికే తలంపు ఏ ప్రాణికీ ఇంతవరకు కలుగలేదు. అటువంటి శక్తిసంపదకల నేను ఒక సామాన్యుడుగా నిన్ను అర్థిస్తున్నాను. నీ వ్రతం విడిచిపెట్టు. నాకు పత్నివికమ్ము. నాకై కూర్చిన అంగనాజనంలో తలమానికంవలె తనరారు. నీవే నాసర్వస్వం కాబోస్తావు. నన్ను సంగరంలో నిగ్రహించు తలంపుతో దండెత్తివస్తే, ఒరిగినటెక్కెలూ, రవుతులూ, ఊపిరారిన గుర్రాలూ, వాలినతేరులూ, రాలిన అంకుశాలూ, విరిగిన విల్లూ, ప్రేలాడు జుట్టూ, తడబడిపడవే పదములూ, కంపంతో కదలిపోయే హృదయములూ, విలువమాలిన సేనలూ, పీనుగు పెంటలైన హతప్రాణులూ కలిగి శత్రురాజులు భీతులై పారిపోయినారేకాని, వీరులై నన్ను నిలువరించలేదు. ఇది జగమెరిగిన సత్యం. అర్థరహితంగా, అసందర్భముగా ఆత్మస్తుతి చేసుకోవటంలేదు. కన్నులకాంక్ష తీరేట్లు నిన్నుకాంచవలెననే ఆకాంక్ష నన్ను త్వరపెట్టుతూంది. పన్నీటిజలంతో స్నానమొనరించు. పరిచారికలుతెచ్చే పరిమళద్రవ్యాలతో నీ శరీరాన్ని

మనసంతోషింపచేయి. దేవతావసనాలు ధరించు. దివ్యభూషణాలుదాల్చు. నా ఆశ ఫలింపగా, నీమనసుసంతసించగా నిధిశేష్టభోగాలు ప్రాజ్యంగా అనుభవించు.

నా తెంచి ఒక్కమాటయినా పలుకు. నీ కోరిక ఏదో చెప్పు. సప్తసముద్ర పరివేష్టిత ధరామండలం నీ సామ్రాజ్యం దానంచేస్తాను. నాపై నీవు హర్షంచూపిస్తే నీ బంధుకోటి అంతా సుఖ భోగభాగ్యాలతో నిత్యంగా వుంటుంది. నా సర్వసమృద్ధి, కలిమి, కీర్తియూ. నీ భర్త వనాటుడు. ఏకాంటవాడు. సంచలితాయు. నిన్ను వదలిన తర్వాత ఇంకా ఇంతకాలం జీవించివుంటాడని ఆశతోవున్నావా? బ్రతికివుంటే నీకోసం ప్రయత్నం చేయడా? ఎక్కడవున్నావో తెలుసుకుని ఒక్కసారి అయినా వచ్చి చూడడా? నీ మగడు భీరువు. నా తేజస్సును కన్నెత్తి చూడవైనా చూడలేవు. ముందుభాగంలో బలాకలు మోహరింపగా వాప్ప కాంబుదం వట్టింగా గ్రమ్ముకొంటే చంద్రజ్యోత్స్నను ఎవరైనా చూడగలరా? పవిత్ర శాస్త్రవిక్రమపరమైన హిరణ్యకశిపుని కీర్తిలాగా నీ రాముడు నా హస్తం లోనుంచి నిన్ను మళ్ళీ పరిగ్రహించలేడు. అందాలుచిందే చిరునవ్వులతో, సుందరమైన పలువరస కన్పించగా, ఆకర్ణాంతలోచనాలతో గరుత్మంతుడు కేళిహాసాన్ని హరించినట్లుగా నా మనస్సును నీవుహరిస్తున్నావు. మాసిన ఒంటిచీరతో, నీరాటక, చెంద్రుకలు జతగట్టగా, అలంకృతులేమీ లేక అభిమానంతో అల్లాడుతున్న నిన్ను తలంచినప్పుడెల్లా అనురాగపాత్రలైన నా ఆత్మేశ్వరులను ఆనందింప చేయలేకపోతున్నాను. నాకాంతలు సప్త సముద్రాలవాసలు. వారికీశ్వరివై హాయిగా కాలంగడపక, ఆశ కుదిరిన ఆత్మపతికోసం ఆరాటంపడతావెందుకు? లక్ష్మీదేవిని దేవవాంగనలు సేవించునట్లు నా ఉత్తమాంతఃపురకాంతలు నిన్ను సేవిస్తారు. సిరిరా మోకాలు అడ్డకు. విశ్వంలో అత్యల్పంగావున్న లనర్ఘవస్తుసముదాయం అంతా నా లంకలో వుంది. ఆ సంపదతో నన్ను నీ దాసునిగా పరిగ్రహించు. నీ రాముడు నాతో దేనితో సరిపోలుతాడు? తపంలోనా? బలంలోనా? పరాక్రమంలోనా? విత్తంలోనా? విద్యలోనా? యశస్సులోనా? కాంతినా? వట్టిఅడియాసలుమాని నేనై చేరవచ్చిన నదవకాశాన్ని సార్థకంచేసుకో." అంటూ పరిపరివిధాల ఆమె మనస్సును అసురనాథుడు ఆకట్టుకో చూచాడు.

# సీతాదేవి రావణునకు బుద్ధులు చెప్పుట

ఇంకేమి నిశ్శంకగా అనుచిత భాషణాలు నిరర్గళస్వరఝరివలె అఖండంగా పలుకగా, ఆ మాటలువిన్న జానకి దుర్మనయై, దీనమానసయై కంపితగాత్రయై, ఆత్మలో రాముని సంస్మరించి, అశ్రువులు కనుపోయి జారగా, హీనస్వరంతో, గడ్డిపోచను చేతగైకొని ఇరువురిమధ్య అడ్డుగా ఉంచినట్లుపెట్టి, దానిని ఉద్దేశించి పల్కునట్టిగా రావణునకు తన మనసులోని మాట చెప్పసాగింది. "ఓరి! క్రూరకర్మా! నీవు చేసిన నీచకార్యానికి సిగ్గుపడక, నా వద్దకువచ్చి ప్రగల్భాలు పలుకుతున్నావా! నీవు చెప్పినవాటిలా కల్లలు. నాకు నీమీద వాంఛయినాదు. మరి నేను కన్యనా? పరకాంతనా? భారతస్త్రీ తన కన్యాత్వం ఒక్క పురుషునికే విధివిహితంగా దత్తంచేస్తుంది. బహుభర్తృత్వ పరిగ్రహం ఈ జాతికీ, పుణ్యభూమికీ పరిత్యాజ్యం. ఈ కర్మభూమి స్త్రీశీలంపై, మహాత్ముల తపశ్శక్తిపై, రాజుల స్వార్థరహిత సత్యధర్మ పాలనంపై, "సర్వేజనాః సుఖినోభవన్తు, భద్రంకర్ణేభిశ్శృణుయామదేవాః, భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః" అనే మంత్రార్థభావంతో మనతే పాలసంతానంపై ఆధారపడి వుంది. అందుచేత నాపట్ల మనస్సునిల్పి నాశనం కోరితెచ్చుకోకు. నీపై మమకారంతో చేరిన మగువల సమానంగా ఆదరించి తత్ఫలంగా ప్రత్యానందపొందు. రాలిని పొందగోరి అర్థించినట్లు, పాపాత్ములు పుణ్యం కోరినట్లు నన్నునీవు ఆశించటం. నేను పుణ్యవంశంలో పుట్టాను. పూజ్యమైన వంశంలో మెట్టాను. ఏకపత్ని నియమంపట్టాను. ఇటువంటిదాన్ని అకార్యంచేసి పాపం కట్టుకుంటానని తలంచకు. తెలిసిన మూర్ఖుడవు. వృథావిప్రలాపాలు వాగుతున్నావు. నేను సాధ్విని. నీ భార్యను కాను. పరకాంతను, ఇది తెలుసుకుని సాధుమార్గంలో సంచరించు. పని పెట్టుకొని తేరతేరగవచ్చి నన్ను బాధించి ఇంకా పాపం మూట పెద్దది చేసుకోకు. చేసిన చెడ్డ పనికి పశ్చాత్తాపంపడు.

నీ భార్యలు నీ కెటువంటివారో. లోకంలోవారికి వాళ్ళ భార్యలు వాళ్ళకు అట్టివాళ్ళే. ఇందుకు నీ చరిత్రే ఉదాహరణంగా తీసుకుని సొంత భార్యలతో సుఖించు. బలవంతుడనని భావించి కొరమాలిన పనిచేస్తే, నీకంటే బలవంతుడు నీకు కాని పని చేసి కష్టం కల్పిస్తాడు. లోకధర్మం సామాన్యంగా నమ్మకం మీద నడుస్తుంది. ప్రభువులు ఒకచోట

వుంది శాసనాలు చేస్తారు. అంతేకాని ప్రతి వ్యక్తినీ, ప్రతిదాన్నీ అంటిపెట్టుకుని తిరగదు. ఆ శాసనం అనుసరిస్తే మంచి జరుగుతుంది అని మనుష్యులు నమ్మి ఆచరించాలి. శాస్త్రీయంపై భక్తిగా, ధర్మ వర్తనంపై శ్రద్ధగా మనస్సు వుంచి జరుపుకునే ఫలితం నడిపించేదే నమ్మకం. నీచేత అపహృతనైనా, నా భర్త నా శీలాన్ని శంకించడు. నాకై యుద్ధం చేయక మానడు. పిల్లి తాను కళ్ళు మూసుకుని పాలు త్రాగుతూ లోకం చూడలేదని తలచినట్లు నీవు భావిస్తున్నావు. వెర్రి వాళ్ళంతా ఇలాగే భావిస్తారు. స్థావర జంగమాత్మకమైన ప్రకృతిమీద వుండా, ఆ ప్రకృతిలోని అణువణువూ నీవు చేసేది గమనించదా? ఈ పాటికి నీ దురాగత కార్యం నాపతికి తెలిసేవుంటుంది. ప్రతిక్రియ త్వరలో జరగనే జరుగుతుంది. సంచరించే ఇంద్రియాలతో చంచలచిత్తుడై ఎవడు కట్టుకున్న కాంతకు ఎగ్గులు పెడతాడో ఆయుర్లక్ష్మీ, ప్రజ్ఞా, సంపదా, కీర్తీ, చివరకు ఆయువుకూడ ఊడిపోతుంది. నీ బంధువుల్లోగాని, నీ రాజ్యంలోగాని పెద్దవాళ్ళు లేరా? వాళ్ళయినా నీకు బుద్ధి చెప్పలేదా? వారు భయపడితే నీవైనా వారిని ఆశ్రయించరాదా? నీ దురాచారం చూస్తే నీవు తోచింపరాని పెద్దల మాట వినవనీ, దురహంకారివనీ, నీస్వార్థంకోసం జాతినే బలిచేయటానికి జంకవనీ తేలుతూంది. నీకు వినాశకాలం సమీపించబట్టే ఇన్ని విపరీతవాక్యాలతో బాధిస్తున్నావు. కత్తిప్రేమను మునగకొన్నను అర్థంకోసం ఆశ్రయించినట్లు, ఉన్మాదస్వభావుడవైన నిన్ను నీజాతిఅంతా ఆశ్రయించి నాశంకోసం ఎదురుచూస్తూంది. నీ దౌష్ట్యంవల్లనే నీ కులానికంతా ఉత్పాతం వస్తుందని అయినా వూహించవేం? యుగయుగాలుగా ప్రసిద్ధికెక్కిన లంకానగరం నీ ఒక్కని దోషానికి ఆహుతికాబోతూంది. దూరదృష్టిలేకుండా స్వీయాధికారంకోసం, స్వీయప్రాబల్యంకోసం చేయరాని అకృత్యాలను చేసేవ్యక్తి చస్తే అంతవరకు ఆశ్రయించినవారే "పీడా వదలింది" అని సంతోషిస్తారేకాని రవ్వంతైనా సానుభూతి చూపరు. పైగా పండగలు, వేడుకలు, విందువినోదవిలాసాలతో గడుపుతారు-

శ్రీ రామచంద్రార్పణమస్తు.

నమోస్తు రామాయ సలక్ష్మణాయ, నమోస్తు దేవ్యై జనకాత్మజాయై.
నమోస్తు వాతాత్మ భువేశరాయ, నమోస్తు వల్మీక భవాయ తస్మై.

# ఎమెస్కో వచన రామాయణం

శతావధాని కోట వీరాంజనేయ శర్మ



Volume Seven

Price Rs. 5/

COVER PRINTED AT SUPREME ARTS, HYDERABAD-500 020